# స ప్త ప ర్ణి









ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటితము

1956

# సప్తపర్ణి

కుమారి మల్లాది వసుంధర

Y. Seshatalpasai
Pre-University Course
S.R.R & C.V.R. Govt College
Vijayawada.




ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటితము

1956

వెల రు. 2-8-0

# సప్తపర్ణి

...oOo...

## ౧

వసంతము. నందనవనీసంజాతకాంచనకేతకీకుసుమగర్భదళోదర గతపరాగసమమనోహర సంధ్యాపూర్వనాతితీక్ష్ణార్కాంశుమాలా వినిస్రుత సువర్ణదీధితు లంగరములప్రోవులై గదిగవాక్షముగుండ కాంచన సప్తపర్ణిపైఁ బ్రసరించి ధగధగ లాడినవి. ప్రభువుదృష్టి యా సప్తపర్ణి యందాబద్ధమై యున్నది. ఆయనకుఁ దా నంతిపురియందలి విశ్రామ భవనమున హంసతూలికాతల్పమున నుండెనని, పగలు మూడుజాములు గడచినవని, తాను మధ్యాహ్న ఫలాహారముచేసి విశ్రాంతి తీసుకొనుచుండె ననుజ్ఞానమే లేదు. ఆయన మనస్సంతయుఁ దల్పమున కెదురుగ, మందిరమున నొకమూల పూర్ణదిశాముఖముగ నిలబెట్టఁబడిన బంగారపు తొడాకుల యరఁటిచెట్టును గూర్చి యూహ చేయుచున్నది. అనిమేష దృష్టితో దానిపంకకే చూచుచున్నాఁడు.

అది రాజసౌధములో నొక విశాలమైన గది. ప్రతిదినమును మధ్యాహ్న ఫలాహారానంతరము మహారాజు విశ్రమించు విడిది. నేల యంతయు పాలగచ్చు చేయఁబడి రత్నకంబళాచ్ఛాదితమై యున్నది. గవాక్షమున కొకింతదూరముగ హంసాకృతిగ నతిసుందరముగ తయారు చేసిన బంగారపు మంచము ; దానిమీఁద హంసతూలికాతల్ప మమర్పఁ బడియున్నది. తల్పమునకు వామభాగమునఁ దల్పమున కంటునంతటి యున్నతమైన యొక వలయాకారపు స్వర్ణపీఠము చిత్రితానేకఫలపుష్ప లతాసందోహ మున్నది. దానిపై రత్నఖచిత సుందర హేమకలశము

హిమశీతలమధుపూరిత మొక దున్నది. గదిలో నాలుగువైపుల నేవంకఁ జూచినను గోడలనిండ శిల్పపుఁ బనితనము కానవచ్చుచున్నది. ఎటు చూచినను శివలీలలు నేత్రపర్వములై యతిమనోహరముగఁ గుడ్యముల మలచఁబడి యున్నవి.

దాక్షాయణీ వియోగజనితప్రబలశోకానలజ్వాలాసంతప్తమానసుఁడు, ఆర్యాభావవిరహహేతూద్భూతప్రచండనిరాశాక్రోధాగ్నికీలా వివశీకృత కృశతనూయష్టి, అసహనీయసతీవియోగబాధా పరిదీన మూర్తి, దక్షాత్మజాదుస్సహవియోగవశశిథిలీకృతాంగకములవాడు, శక్తిహీనుడైన శివుఁడు తపశ్చర్యకుఁ గడఁగినాడు. కైలాసమును రోసి, దేవదారు వనాభ్యంతరమున, గగనధునీధార జాలువారు చోట వ్యాఘ్రచర్మము ధరించి యూర్ధ్వరేతస్కుడై, నిమీలిత త్రినేత్రుఁడు తపస్సుఁ జేయ మొదలుపెట్టెను. పాశాంకుశడమరుక త్రిశూలచాపబాణగదా శక్తిధారి, కల్పాంతకాల త్రిజగత్సంహారోద్రేక జనితోగ్రపటుప్రతాపస్ఫుట వికటాట్టహాస విచలితబ్రహ్మాండకోశుఁడు, రోదసీవలయితసహస్రముఖారుణదంష్ట్రావినిర్గత విధూమ ధూమకేతన జ్వాలాసమకాలాగ్నికీలామయభీషణ కపాలమాలాధరమూర్తి, ముక్త కేశుఁడు, ఫాలనేత్రాగ్నికీలాభస్మీకృత త్రిలోకానందోద్భూత మహా ప్రళయతాండవోన్మాది, సంహారరుద్రుఁడు, నటరాజు స్మశానమున విలయతాండవ మొనర్చినాడు. భగీరథుఁడు గంగను ప్రార్థించినాడు. ఆమె భూమికి దిగివచ్చుట కంగీకరించినది. కాని ఆమె వేగము నరికట్టు వారు లేరు. వ్యోమకేశునికే తక్క నాపని యనితరసాధ్యము. గగన గంగాప్రచండధారావేగమును మహాదేవుడు తన జటాజూటమున నిల్పినాడు. ఏమూలఁజూచినను రుద్రగాథలను సజీవములుగ, మనోహరములుగ గుడ్యములందు శిల్పచాతుర్య మఱయఁ బ్రోవులు

పోసినట్లుగఁ జెక్కినారు. ప్రళయతాండవరుద్రుని శిల్ప మమోఘము. నటరాజమూర్తి కల్పన దివ్యము. అట్టి నటరాజును శిల్పముఖమున శిలలయందు విన్యసించి శిల్పులు తమ జన్మకుఁ జారితార్థ్యమును సంపాదించుకొనినారు. ప్రభువు పరమ మాహేశ్వరుడు.

ప్రభువుదృష్టి సప్తపర్ణినుండి మరలలేదు. సమయముగడచు చున్నది. మొగసాలలో గడియారపు గంటలు కొట్టఁబడుచునే యున్నవి. అవి యాయనకు వినిపించుట లేదు. చక్రవర్తి బయటికి వచ్చునని ప్రజలు నిరీక్షించుచున్నారు. ప్రభువుమనస్సు మనస్సునలేదు. కన్నుమూసినాడు. నిద్దురయేమో తెలియదు. కాదది యొకవిధమగు మైకము. చీఁకటిపడినది. జనులు ప్రభు విఁక రాడని నిరాశఁజెంది వెడలి పోయిరి. ప్రభు వింతవరకు బయటికి రా నందులకు పరిచారిక లాశ్చర్య చకితులై పలువిధముల గుసగుసలు వోయిరి. దాసివచ్చి గదిలో మణి దీపపుతెరతీసి వెడలినది. రాజు కన్ను దెరచినాడు, చీకఁటిపడిన దను భావమే కలుగలేదు. మణిదీపపుఁ గాంతులలో సప్తపర్ణి తళతళలాడి నది. ఆ తళతళలలో రాజుకన్నులు మిలమిల లాడినవి. రాజుకన్నుల కా సప్తపర్ణి సప్తార్చివలె కనిపించినది. చిఱుగాలికిఁ గొలఁదిగ కదలాడు చున్న సప్తపర్ణాంతములు మండుచున్న కాళీ, కరాళీ, మనోజవా ధూమవర్ణా, స్ఫులింగినీ, విశ్వపవాద్యగ్ని దేవుని జిహ్వారూపములైన సప్తజ్వాలలవలె భాసిల్లనవి. రాజు నేత్రములకు మిరిమిట్లు గొల్పినవి. ప్రభువునకేమో భయ మొదవినది. మరల కనులు మూసికొనినాడు. నిద్దురపట్టలేదు. నిద్దుర కాదాయున్న నిద్దురయే. మరి నిద్దుర పట్టక పోవుటయేమి? రాజునకు తాను నిద్రించుటకు యత్నించుచున్నాఁడని తెలియును. తెలిసినప్పు డది నిద్రయెట్లగును? కన్నులు తెరువలేదు. ఆ తెరువలేనిస్థితి రాజునకుఁ దెలియును. అది జాగ్రదవస్థను నిద్రా

వస్థకును భిన్నమైన మధ్యమావస్థ. స్వప్నమువలె నున్నది. ప్రభువున కదియేమో తెలియదు. ఆసప్తపర్ణి రకరకములుగ కనిపించసాగినది.

హరిద్రాస్వచ్ఛపాండువర్ణ మిశ్రితస్నిగ్ధతనూరోచిశ్ఛటా పరిదీప్తారుణ జిహ్వాంచలకృతఫూత్కార హేలాజనిత మహానంద నిమీలితాక్షి సప్తముఖ స్వయంభూకంఠభూష. దినాంతసమయ పశ్చిమోన్ముఖపరిశ్రమాలసమందీకృత గమనవేగులు, కశాఘాతవేళాకించిద్బాధామాత్ర బహిరాగత జిహ్వానిష్యంద లలజ్జలములు, సంయుక్తారుణ సువర్ణీకృతాశావలయిత దేహచ్ఛాయాపరిరమ్యారుణముఖములు, సప్తాశ్వములు సూర్యస్యందనవాహనములు, గగనధునీసంజాతపరిఫుల్ల హిరణ్యపద్మాయాత సుగంధ శీతలవాయుసంసేవన కించిద్విచలితపర్ణాంచల సురవనీభూజము కాంచనసప్తపర్ణి. అహో! ఏమి సప్తపర్ణి! తమ యారాధ్య దైవము స్వయంభూస్వామి కంఠభూషవలె నున్నది. తమ వంశాధిదేవత యాదిత్యదేవుని రథవారువములం బోలి కనిపించినది. కోరికోరి దివ్యలోకమునుండి సప్తర్షి మండలము తనమందిరమునకు వచ్చి నిలిచినది వలె నున్నది. తానెంతటి యదృష్టవంతుడు! ఈ సప్తపర్ణికిని తనకును నేదో విడదీయరాని బంధ మున్నదా? ఈ సప్తపర్ణి తనభావవేగము నడ్డి నిలిచిన దేమి? సప్తపర్ణి మగలమారినది. ఏవో పొగలు సుళ్ళుసుళ్ళుగ తిరుగుచున్నవి. ఆకసమంతయు గాఢ కాలిమావృతమైనది, కన్నుపొడుచుకొన్నను నేమియు కనిపించుటలేదు. సప్తపర్ణి యాకసమున గాలిలోం దేలిపోవుచు విద్యున్మాలికవలె మెరయుచున్నది. స్వప్నము గడచుచునే యున్నది. మరల నొక విచిత్రదృశ్య మగుపించినది. అది వాస్తవమువలె నున్నది. చూచుచుండగనే సప్తపర్ణి రూపాంతరమునొంద మొదలిడినది. అదితసవంశవృక్షము వోలె ననుభూతమైనది. అది వృక్షమో లేక యెనిమిదిమంది మనుజుల చిత్రవిన్యాసమో యవగత మగుటలేదు. ఆయెని

మిదిమంది తమవంశమునందలి యెనిమిది రాజులవలె మారినారు. ప్రభువు ముగ్ధుఁడై చూచుచున్నాడు. ప్రతియొక్క యాకును తమ వంశమునందలి యొక్కొక్కరాజువలె కనిపించెను. ఆహా! ఏమి దృశ్యము! ఏమిప్రభువులు! ఒక్కొక్కరు మహాసామ్రాజ్యనిర్మాణ సమర్థులు, సర్వతంత్రభావనాశీలురు.

సప్తపర్ణి కాండము ప్రోలరాజుమూర్తి కట్టినది. ప్రభు వాశ్చర్య ముగ్ధుడైనాడు. ప్రోలుకు కాకతివంశ మూలపురుషుడు. కాకత్యన్వయ మహామంటపమునకు మూల సంభమూర్తి. కొలవి దేశాధినేత. పశ్చిమ చాళుక్య సామంతుడుగ నబ్బిమండలమును పరిపాలించినాడు. దూరదర్శి. ఆంధ్ర దేశముపై దాడివెడలివచ్చిన వీరరాజేంద్ర చోళు నితో యుద్ధ మొనర్చి కాకతీయ రాజ్యమునకు ముప్పు రాకుండునట్లు చేసెను. ఏమి దూరదర్శిత! వేంగి దేశముపై చోళుడు దండెత్తివచ్చెను. వేంగీ విజయానంతరము కాకతీయరాజ్యమున కుపద్రవము వచ్చును. దీని నెఱిఁగినవాడై వేంగిదేశాధిపతి విజయాదిత్యునికి బాసటయైనిల్చి చోళుని పరాభూతు నొనర్చినాడు. ముప్పదియైదు సంవత్సరములు నిరాటంకముగ సుభిక్షముగ పరిపాలన మొనర్చిన నీతిశాలి.

సప్తపర్ణములలో నొక పర్ణమున బేతరాజువిగ్రహము సజీవముగ దర్శన మొసఁగినది. త్రిభువన మల్లదుర్జయ కులాబ్ధిచంద్ర చలమర్తిగండ మహామండలేశ్వర హనుమకొండ పురవరేశ్వర బిరుదాంకితుఁడు, తండ్రి కన్న నొక్కయడుగు ముందుకువైచినాడు. ఈయన రాజ్యమునకు వచ్చు సరికి రాజ్యస్థితి యల్లకల్లోలముగ నున్నది. బేతరాజు బాలప్రాయుఁడగు టచే శత్రురాజు లితనిఁ బదభ్రష్టునిగఁ జేసిరి. దుర్జయవంశీకుడైన యొజ్జన శత్రువుల నిర్జించి యీయనను కొలవి సింహాసనమునఁ బ్రతిష్ఠించి తన స్వామిభక్తిని వెల్లడించినాడు. ఆయనభార్య కామసాని. భర్తచని

పోయినను ప్రభుభక్తిని విడనాడక యుద్ధావసరసమయమున ప్రభువున కండయైనిలిచి పల్లవరాయడు, భాస్కరచక్రవర్తి కాడవనాయకుల మహిషాసురమర్దినివోలె సంహరించి బేతరాజును గాకతివల్లభునిగ నిల్పిన సంగరప్రజ్ఞాధురీణ. కామసాని యెంతటిసాహసిని! మహాప్రళయ సమయవిలయతాండవోన్ముఖ భద్రకాళీస్వరూప యనున ట్లున్నది. అట్టి కామసానులు తనకుఁగూడ నున్నచో నెంతబాగుండును! బేత రాజు స్వతంత్రుఁడు. తండ్రిగుణములఁ బుణికిపుచ్చుకొనినాడు. పశ్చిమ చాళుక్యచక్రవర్తి త్రిభువనమల్లవిక్రమాదిత్యుని రాజ్యకాలమున చాళుక్యసామ్రాజ్యము పశ్చిమమున కళ్యాణీనగరము మొదలుకొని తూర్పున వేంగిదేశపర్యంత విస్తృతమైయున్నది. ఈచాళుక్యవాహినీ విజృంభణమునకుఁ గాకతీయరాజ్య మడ్డుతగిలినది. ఈసంగతి సూక్ష్మ దర్శియగు బేతరాజు గ్రహించి, తనమంత్రియగు వైజదండాధినాథుని ముఖమున విక్రమాదిత్యుని శరణుజొచ్చెను. ఈమంత్రి ప్రవరుని మేధా విభవమున చక్రవర్తితోడి సంధానఫలితముగ సహస్రగ్రామపరివృత మగు సబ్బిమండలమును పొంది చాళుక్యసామంతుఁడుగ ముప్పది యేండ్లు నిష్కంటకముగ రాజ్యమేలిన బుద్ధిశాలి.

ప్రభువు చకితనేత్రుఁడై విలోకించుచున్నాఁడు. రెండవప్రోలుఁడు భవిష్యదాంధ్ర సామ్రాజ్య నిర్మాణైకదక్షుఁడు, ఏకశిలానగర నిర్మాత పర్ణమున కదలాడిన ట్లనిపించినది. ఈతఁడు కొంతకాలము పశ్చిమ చాళుక్య సామంతుఁడుగ నుండెను. ఆరవ విక్రమాదిత్యుని రాజ్యాంత కాలమున దక్షిణమున చోళులనుండి, హొయసలులనుండి యొత్తిడి కలిగినది. ప్రాప్తకాలేంగితమతియు, మహాయోధుఁడును, ప్రజ్ఞాశాలియు నగు ప్రోలభూపతి యీ వైషమ్యములఁ దిలకించి స్వతంత్రసముపార్జన మునకదనిదియ యని తలపోసెను. సరిగ నదేకాలమున ననుమకొండ

రాజ్యపరిసరవివిధచాళుక్యసామంతులు చెలరేగి స్వతంత్రతాబుద్ధులై తిరుగఁబడిరి. ప్రోలుడు చాళుక్యచూడామణి హస్త్యారోహణ చతురుడునగు తైలపుని జయించి, భక్త్యనురాగములచే వదలివేసెను. విక్రమదండనాథుడు నేలకొండపల్లి పరిపాలకుడు నగు గోవిందరాజుపై దాడివెడలి యాతని సమరరంగమున నిర్జించి లుంఠాకవిషయమును ఉదయరాజున కిప్పించిన మహోదార స్వభావుడు. మంత్రకూటరాజగు దండరాజునుగెల్చి శిరోముండన మొనర్చి విజయాంకముగ నాతని వక్షమున తమ వంశలాంఛనమైన వరాహముద్రను వేయించిన క్రోధమానసుడు. మంత్రకూటరాజును ప్రోలుడు మఱల యుద్ధమున కాహ్వానించినాడు. కాని, భీతహృదయుఁడగు గుండరాజు తప్పించుకొనినాడు. చాళుక్యసామంతుడై వేములవాడ పాలకుఁడైన జగద్దేవుని బహుళసేనాపరివృతుని అనుమకొండయం దోడించి తఱిమినాడు. పశ్చిమ చాళుక్యచక్రవర్తియగు మూఁడవ సోమేశ్వరుని జయించి ప్రోలరాజు స్వాతంత్ర్యపిపాసను తీర్చుకొనెను. ఇట్టిస్థితియందు మూడవతైలపుని రాజ్యకాలమున చాళుక్య సామ్రాజ్యవిచ్ఛిత్తి పొడసూపినది. ప్రాచ్య చాళుక్యసామ్రాజ్యభాగ మప్పటికే కాకతీయరాజ్యమునఁ గలసినది. చాళుక్యమంత్రియు, దండనాథుడునైన కరికాలబిజ్జలుడు చక్రవర్తిని త్రోసి, కళ్యాణీ సింహాసనము నధిష్ఠించు నాశగలవాడై ప్రోలరాజు సాహాయ్య మర్థించెను. ప్రోలుడు స్వలాభపరుఁడై కళ్యాణీనాశనమునం దాతనికి దోడుపడి, స్వమార్గావరోధములఁ దొలఁగించుకొనినాడు. అరిజనభయంకరముగ నలువదిమూఁడేండ్లు సామ్రాజ్యము పాలించిన మహాప్రతిభాశాలి. మహాస్వతంత్రతాశీలి. అంతటి స్వతంత్రబుద్ధి యభూత పూర్వము. నిగూఢాంధ్రపౌరుష రాజనీతిజ్ఞతా కార్యదక్షతలను వెలికిఁదెచ్చి వానిని తనసామ్రాజ్యమున నన్వయించిన మహామేధావి. పద్మాక్షీ దేవాలయమును నిర్మించెను. ఒకశిలాశాసనమును నిర్మించి

నాడు. ఈయన మొదట జైనమతావలంబియై శైవమును స్వీకరించినాడు. బసవేశ్వరుని వీరశైవమతప్రభావకృష్టుఁడై శైవుడై అనుమకొండలో సిద్ధేశ్వరాలయమును కట్టించెను. సర్వభైరవకాళీప్రతిష్ఠాపనాబుద్ధియయ్యెను. పరమత సహనమతి. అనుమకొండకు శిలాప్రాకారమును కట్టించెను. వెలనాటి రెండవ గొంకరాజుపైకి దాడివెడలి ఘోర సంగ్రామమున గొంకరాజు పుత్రుడైన యువరాజచోడునిచే నిహతుఁడయ్యెను.

ప్రభువు హృదయముసఁ జేయివెట్టి కలచినట్లైనది. క్రోధతామ్రాక్షుఁడైనాడు. విక్రమార్క సువర్ణసింహాసనగతసాలభంజికా మనోహరమూర్తివలె మఱియొక కాంచనపత్రము రుద్రదేవునివలె మెరసినది. ప్రభువు విస్మితనేత్రద్వయస్థిరీకృతవీక్షణముల నవలోకించుచున్నాడు. ప్రోలరాజ జ్యేష్ఠపుత్రుఁడు, నానాశాస్త్రవిచారణైకచతురుడు, బ్రాహ్మీవిలాసాశ్రయుఁడు, సహస్రస్తంభమంటప నిర్మాత, త్రికూటాలయకర్త, మహాపరాక్రమశాలి, రుద్రదేవుడు నిజముగ త్రిజగత్సంహార రుద్రునంతటివాడు. ఈయన రాజ్యమునకు వచ్చుసరికి సామ్రాజ్యపరిస్థితులు విపరీతములై కానుపించినవి. నలుదెసల శత్రుప్రాబల్యము మిక్కుటముగనున్నది. తూర్పున రెండవచోడుని కాలమున పరమావధి నందిన వెలనాటి వంశప్రతిభ సన్నగిలఁ జొచ్చినది. దక్షిణ పశ్చిమముల నాంధ్రచోళులు కొణిదెన, పొత్తపి మొదలగు స్థలముల నాక్రమించి వెలనాటిపై దండెత్త మొదలిడిరి. నెల్లూరుచోడులు దక్షిణదేశ వ్యవహారములందుఁ బాల్గొని ప్రాముఖ్యము నందసాగిరి. గోదావరికి దక్షిణమున కోలని వంశీయులు, ఉత్తరమున తూర్పుగాంగులు రాజ్యమేలుచుండిరి. అనుమకొండనగరమునకు పశ్చిమోత్తరమున లింగాయతులు కళచురి రాజ్యమును నాశమొనర్చిరి. ఉత్తరమున యాదవులు రాజ్యము విస్తీర్ణము

గావించుకొనఁ దొడఁగిరి. పశ్చిమచాళుక్యసామంతులుగ నుండిన మహా మండలేశ్వరు లందఱును స్వాతంత్ర్య వాంఛాపరులై పరస్పర కలహములకు లోనైరి. ఈస్థితిలో రణరంగ విశారదుడు, వీరవ్రతుడు, దూరదర్శియు నగు రుద్రుఁడు తండ్రి జయింపగా మిగిలిన మాండలికుల జయించుట, పితృమరణ హేతుభూతులైన వెలనాటి రాజులపైఁ బగఁ దీర్చుకొనుట, యీ రెండు కర్తవ్యములను మున్ముందుగ నెఱవేర్పఁ దలంచి మనస్సంతోషకరముగ నుత్కృష్టముగ సాధించెను. దొమ్మ రాజు, మేడరాజు, మైలిగి దేవులను జయించెను. మాతుస్సపత్నీరతత్వమునకు, అగ్రజువధకు వెనుదీయని ధూర్తచోళుడు స్వార్థాభిలాషి, మహాబలవంతుడు, చాళుక్యసింహాసనాక్రమణాభిలాషుడు నగు భీమునిపై దాడివెడలి భీమురాజధాని యగు వర్ధమానపురము నాక్రమించి యాతని రాజ్యచ్యుతునిఁ జేసి యాపురమును సమూలముగ నాశ మొనర్చి తన్మధ్యమున గొప్ప తటాకమును త్రవ్వించిన క్రోధసంక్షుభితమతి. వర్ధమానపురమున తన ప్రతినిధిగ మల్యాలగుండని నియమించినాడు. రుద్రదేవ మహారాజు సామదాన భేద దండోపాయ చతురుడు. చోడునియెడ సామము నెఱపి యాతని కుమార్తె యగు పద్మావతిని పెండ్లియాడి ప్రబలశాత్రవు నాత్మబంధునిగఁ జేసికొనిన యుక్తిశాలి. మైలగిదేవునిఁ బరిమార్చి పోలవాస రాజ్యముఁ గెల్చినాఁడు. చండశాసనుడై గోదావరీ కృష్ణామండల పర్యంతము రాజ్యమును విస్తరింపఁ జేసి వైరిరాజు హృల్లతాలవిత్రసముడై ప్రచండ గ్రీష్మభానునివలె దుర్నిరీక్ష్యుడై ముప్పదిమూడేండ్లు నిర్భయుడై రాజ్యపాలన మొనర్చిన రాజనీతి కుశలుఁడు. శిల్పకళాభిమాని. శిల్పమున గజలక్ష్మిని ప్రథమమున విన్యసింపఁ జేసిన దీయనయే. ఏకశిలానగర రాజవీథులను నిర్మించినాడు. అగాధములు అపరిశోష్యజలములును ప్రశస్తములు నగు కాకతమ్మ బావి, గడియారముల బావి, దేవత బావి, అక్కచెల్లెండ్ర బావి,

శోభనాల బావులను త్రవ్వించినాడు. (రాజకుమార్తెల క్రీడా సరస్సౌందర్య మప్రతిమానము) ఘోర వీరశైవ మతావలంబి. విజయస్తంభ ప్రతిష్ఠాత.

ప్రభువు దేహమున విద్యుత్ప్రసార మైనట్లైనది. ఆయన యాశ్చర్యమున కవధి లేకుండ నున్నది. కనకరంభాపత్రమున మహాశౌర్యధనుడు, మహాదేవరాజు కన్పించి కన్మరగినాడు. ఆరోహణక్రమమునం బంచమపర్ణమున మాతామహుండు, శౌర్యనిధి, జైనబౌద్ధమతవిధ్వంసకారి, మహానీతియుతుడు, రాజ్యతంత్ర మర్మజ్ఞుడు నగు గణపతిదేవ మహారాజు సప్తమ చక్రవర్తియై యన తీవి మెరయ నాసీనుండై దృష్టికమరెను. ప్రభువునకు తా నాయన యంకము నధిష్ఠించి యాడిన బాల్యక్రీడల జ్ఞప్తికి వచ్చినవి. ప్రభువు నయనములు కుతూహల పూర్ణములైనవి. గణపతిదేవుని రాజ్య కాలమంతయు గన్నులకుం గట్టినట్లైనది. గణపతిదేవుని రాజ్యము క్లిష్టపరిస్థితుల యందారంభమాయెను. శత్రురాజులు నవ్యాంధ్రమహోజ్జ్వలసామ్రాజ్యమైన కాకతీయమును నమూలముగ నాశన మొనర్చి ప్రోలరుద్రులు తమ కొనర్చిన పరాభవములకుం బ్రతీకార మొనర్ప నుత్సాహావేశపరులై అనుమకొండపైకి దాడి వెడలిరి. కొందఱు సామంతులు స్వాతంత్ర్య ప్రకటన మొనర్చిరి. కాని వారి యాటలు సాగకుండ స్వామిభక్తిపరాయణులు, దేశాభిమానులు, నిర్వక్రపరాక్రములు నైన కాకతీయసేనానులీ యపార వైరివరూధిని నడ్డగించి నిలిచి సామ్రాజ్యము నకాలప్రళయజలధిమగ్నము గాకుండ గాపాడిరి. గణపతిదేవుని రాజ్యారంభకాలమున నాంధ్రదేశము విచిత్ర పరిస్థితులయందున్నది. రుద్రదేవుడు మూడవ వెలనాటి గొంకరాజును జయించిననాంటనుండి యిరువది మూడేండ్లుగ తూర్పుతీరమునం దనేకములగు రాజకీయ పరిణామములు లేర్పడినవి. వెలనాటి వంశీయుల ప్రతిభ

తరిగిన వెంటనే వేంగదేశమునం దమరావతీ ప్రాంతమున కోటవంశీయులు, మునుపల్లెయందు నతవాడి వంశము, పారసిపురమున కొలని నాయకులు, గుడిమెట్ట యందలి చాగివంశీయులు స్వాతంత్ర్యాభిమానులై విజృంభింపసాగిరి. కృష్ణానదీముఖద్వారమునం దయ్యావంశీయులు ప్రబలియుండిరి. గోదావరికి నుత్తరమున వేంగిదేశచ్యుతుడై పారివచ్చిన వెలనాటివంశరాజు పృథ్వీశ్వరుడు పిఠాపురమున స్థిరపడెను. ఉత్తరమున మరికొంతదూరమున కళింగగాంగు లుండిరి. వేంగిదేశమునకు దక్షిణమున పొత్తపి నెల్లూరులనుండి తెలుగు చోళులు మహాపరాక్రమమున విజృంభించి ద్రవిడ రాజ్యాంగములయందుఁ బాల్గొనుచు తమ ప్రాముఖ్యమును వెలయింప యత్నించుచుండిరి. బయట పరిస్థితు లిట్లుండ నసుమకొండ రాజ్యమునకు వాయవ్యమున హొయసలులు, దక్షిణమున చోళులు, ఉత్తరమున దేవగిరి యాదవులు రాజ్యవిస్తరణకై ప్రయత్నములు సలుపసాగిరి. గణపతిదేవుడు సింహాసనాధిష్ఠితుఁడైన వెంటనే వెలనాటిపై దాడివెడలి విజయముఁ జేకూర్చుకొనినాడు. వెలనాటి విజయమున గణపతి దేవుని దూరదర్శిత యనుపమానము. రుద్రదేవుడు జయించిన భూభాగము భద్రాచలమునుండి వెలనాటివఱకు వ్యాపించి యున్నది. ఈ భాగములలోని రాజుల కుట్రల నరికట్టుటయు, యవనులతోఁ బోరాడుచున్న గాంగులు పరాజితులైనచో యవనులు కాంధ్రదేశ విజయము తప్పనిదగుట గణపతిదేవుడు గాంగులకు సాయమొసని యవనవిజృంభణము నరికట్టుటయు జరిగెను. కేవల యుద్ధసిద్ధాభిలాషుఁడు మాత్రమేగాక, యీాయన వెలనాట శాశ్వతసంబంధముల నేర్పరచుకొనిన ప్రజ్ఞాచతురుఁడు. కోటవంశీయుఁడైన బేతరాజునకు తన రెండవ కుమార్తెయైన గణపాంబను, నతవాటి బుద్ధరాజు పుత్రుఁడైన రుద్రునకు తన సోదరి మేలాంబికను ఇచ్చి వివాహములు సల్పి రాజ్యమును శత్రు హస్తములనుండి సంరక్షించుకొనెను. కృష్ణాముఖ

ద్వారప్రాంతాధిపతి నెదుర్కొని మహాశూరుఁడైన జాయపనాయకు నోడించి గజసైన్యముల కధ్యక్షునిగ నిల్పి యాతని సోదరీ ద్వయమైన నారమ పేరమలను పెండ్లియాడెను. కొలని మాండలికుల నిందులూరి సోమయమంత్రి సాయమున నిర్జించెను. కళింగమును స్వాధీనపరచుకొని నాడు. తెలుఁగు చోళులఁ బరిమార్చి రాజ్యవిస్తరణ మొనర్చెను. దక్షిణ దిగ్విజయ మొనర్చి తమ వరాహలాంఛనముద్రితమైన కీర్తి పతాకను నలుదిక్కుల నెగురవైచినాడు. గణపతిదేవు డఖండశివనిష్ఠా గరిష్ఠుఁడు, స్వయంభూదేవాలయనిర్మాత, ఏకశిలానగరమునకు శిలా ప్రాకారమును గట్టించినాడు. శత్రుతల్పగతకాలహిమవోలె నరువది సంవ త్సరములు నిర్వక్రపరాక్రమముతో నేకధాటిగ రాజ్యమేలిన శౌర్య ధనుఁడు. దేవగిరి యాదవులను చోళచాళుక్యులను తన యాజ్ఞాబద్ధులనుగ గట్టడిచేసిన చక్రవర్తి. ప్రభువు శరీరము పులకరించినది. తన పూర్వు లెంతటి ప్రతిభాశాలులు! ఒకరికంటె నొకరు, వారికంటె మరియొకరు ఘనులు. చిన్న సామంతరాజ్యమును మహోజ్వల సామ్రాజ్యముగఁ జేసిన ధీమంతులు. ఏమి ప్రభువులు! రెండవ ప్రోలుఁడు రాజ్యస్థాపనా ప్రధానమూర్తి. రుద్రుఁడు రాజ్యవిస్తరణా కాంక్షాప్రధానమూర్తి. గణపతిదేవుఁడు పితృదత్తరాజ్యనిష్కంటకపరిరక్షణాప్రధానమూర్తి.

ఆజవయాకున రుద్రాంబిక జగదంబవలె నవతరించినది. ఈమె సింహాసన మధిష్ఠించినవెంటనే ఆంధ్రదేశమున నొక్కుమ్మడిగ ననేక ప్రళయము లాక్రమించినవి. దక్షిణదిశనుండి కుళోత్తుంగచోళదేవుఁడు దండెత్తివచ్చెను. రుద్రమసేనానియగు త్రిపురాంతకునిచేఁ బరాజితుఁడై సిగ్గిలిపారిపోయెను. దేవగిరి యాదవరాజైన మహాదేవరాయలు రుద్రమపై దండెత్తివచ్చెను. ఈమె తన యపారరణరంగవిద్యాపారీణత నంతయు నుపయోగించి యాయనను గెలిచి వెన్నంటి తరిమినది.

అటుపై నఖండముగ శాంతియుతముగ ముప్పదియెనిమిది సంవత్సరములు పాలనమొనర్చిన మహామేధావిని. స్త్రీయని నిరసించిన సామంతులకుఁ గరాళకాళికాదేవివలె నడలుపుట్టించినది. శివదేవమంత్రి ధీవిశేషబలమున రుద్రాంబిక రుద్రాణివోలె దుర్నిరీక్ష్య తేజోమయమూర్తియై శత్రురాజులకుగుండెగాలమై యొప్పినది. ఈమహారాజ్ఞి యనేకములైన ప్రజాహితసత్కార్యముల నాచరించినది. వాపీకూపతటాకారామగ్రామ నిర్మాణముల నొనర్చినది. మహాదానశీల. ఏకశిలానగరదుర్గపు రాతికోటకు లోపలిభాగమున రాతిమెట్లు కట్టించినది. దుర్గమును విస్తరింపఁజేసి సప్తప్రాకారపరివృతముగఁజేసిన చక్రవర్తిని, ప్రభువు హృదయమున నేదో బరువు పెట్టిన ట్లైనది. సప్తపర్ణివంక కే చూచుచున్నాడు. చూచుచుండగనే చివరియాకు తానైనాడు. చివరియాకున తన స్వరూపము ముద్రించినట్లగుపడినది. అహా! యీసంవర్తిక యెంతలేతగానున్నది! ఇట్టే తునిగిపోవునా యన్నట్లున్నది. ప్రభువు మఱల చూచినాడు. ఏమియు కనపడలేదు. సప్తపర్ణికూడ కనిపించలేదు. గాఢాంధకారమే మిగిలినది. ప్రభు వొక్కమారుగ నదరిపడిలేచినాడు. ఆయనచేయితగిలి మధుకలశము నేలపైఁబడి చప్పుడైనది. ప్రభువు కన్నుఁదెఱచినాడు. ఎదురుగ కాంచనసప్తపర్ణి ధగధగలాడుచున్నది.

శ్రీ

ప్రభువు కన్నుఁదెఱచినాడు. ఎదురుగ సప్తపర్ణి ధగధగలాడుచున్నది. ఆసప్తపర్ణి బంగారపుకాంతులు ప్రభువుకన్నులఁదాకి మహాగ్రీష్మమధ్యాహ్నపు మండుటెండను జిమ్మినట్లై గరగరలాడినవి. ప్రభుకన్నులాకాంతులను బట్టఁజాలకపోయినవి. కన్నుమూసినట్లుగ మూసి

నాడు. తాను కన్నుఁదెఱచినట్లు సప్తపర్ణికాంతులు తనకన్నులఁగొట్టిన ట్లాయనకే తెలియదు. తా నసలు కన్నుదెరచెనా? లేక కలయందే సప్తపర్ణి దీప్తినిచూచెనా? ఏమో తెలియనిస్థితియం దున్నాడు. ప్రభువు మేల్కొనినాడా? నిద్రించినాడా? మేల్కొనియే నిద్రించుచున్నాడా? లేక నిద్రించియే మేల్కొనినాడా? ఏమియు నవగత మగుటలేదు. ఆయన నిద్రపోవుటలేదనుట కాయన పద్మదళవిశాలములై విస్ఫారితము లైన కన్నులేసాక్షి. వెంటనే మేల్కొనలేదనుటకుఁ బరిశీలించినచో నాయన నిశ్చలములైన కనినికలేసాక్షి. పరిశీలన మొనర్చువా రెవ్వ రునులే రచట. ఆయన మేల్కొనియే కలగనుచున్నాడు. కన్నుఁదెఱచు కొని కలగనుట యెట్లనవచ్చును. అదిజాగ్రన్నిద్రాస్వప్నావస్థలకు విభిన్న మైన యొక విచిత్రావస్థ. ప్రభు వట్టియవస్థయందే వాస్తవమువోలె కనిపించుచు వాస్తవముగాకుండ వాస్తవమునకు దగ్గరగ నడచుచున్న ట్లున్న యొకానొక విచిత్రసత్యదృశ్యమును తిలకించుచున్నాడు. సప్తపర్ణి సప్తప్రాకారపరివృతమైన తమదుర్గమువలె కనిపించినది. ఏడాకులు నేడు ప్రాకారములవలె కాండము దుర్గమువలె నగుపించినది. ప్రభువు నిశ్చల ముగఁ దదేకదృష్టిగ చూడ్కులునిలిపి సప్తపర్ణి నవలోకించు చున్నాడు. ప్రాకారావృతదుర్గ మనెడిభావము పీడకముందె మఱల సప్త పర్ణి మారి కన్పించినది. సప్తపర్ణి సప్తర్షిమండలమువలె రూపొంది నది. సప్తపర్ణములు సప్తర్షులవలెను, రుద్రమదేవి యరుంధతివలెను దర్శన మొసగినది. ఏడుఆకులు నేడుచెఱువులకువలెనైనవి. రామప్ప, లక్కవరము, పాకాల, జగత్కేసరి, చౌండసముద్రము, సబ్బిసము ద్రము, ఎఱుకసముద్రము. ఏమిచెఱువులు! అమృతపూర్ణములు. ప్రభువు మనమున నప్యక్తముగ పాకాలచెఱువునుగూర్చిన యొక సాహసికపుగాథ మెఱసినది.

మహాక్షామ దేవత దేశమును దన కరాళదంష్ట్రావినిర్గతహాలాహలజ్వాలా కీలల దగ్ధ మొనర్చుచున్న దినములు. ఏవంకఁజూచినను అనావృష్టిదోషమున భూమి నెఱియలువిచ్చి, దరిద్ర దేవీశిథిలాంగకములవలె, బ్రతికి చెడినవాని హృదయవేదనలఁబోలి భయంకరముగ దుస్సహాముగ నున్నది. ప్రజలు నేత్రగతప్రాణులై యుబికివచ్చు గ్రుడ్లతో వికారముగ నుండిరి. మచ్చునకైన పచ్చమొక్క కనరాకుండ నెడారివలె నైనది. అట్టిస్థితియందు గణపతిదేవుడు సభచేసి మహాజ్యోతిష్కుల, మంత్రవేత్తల రప్పించెను. క్షామనివారణ, ప్రజాజీవసంరక్షణ, సస్యోత్పత్తి మార్గముల నరయువారిని ప్రార్థించెను. ఒక మహాజ్యోతిష్కుడు మంత్రవేత్త, లగ్నముఁ గట్టినాఁడు. సమయము, స్థలము నిర్దేశించి ప్రభువుతో, నొక సాహసికుడు, ధైర్యవంతుడు నయిన సేవకు నర్ధరాత్రమునఁ దన వెంటఁబంపుమని కోరినాడు. ప్రభువు నట్లేయనినాడు. నిర్దేశింపఁబడిన దినమున నర్ధరాత్రమున జ్యోతిష్కుడు సేవకుని కొకతట్టను మట్టితో నిండినదాని నిచ్చి తనవెంటఁ దానుపోయినంత మేఱకు, మన్ను గుప్పిళ్ళతోఁ బోయుచు రమ్మనినాడు. సేవకుఁడు వల్లెయనెను. అమవసనిసి. కన్నుపొడుచుకొన నేమియుఁ గానవచ్చుటలేదు. బ్రాహ్మణుని యడుగుజాడలఁబట్టి నడచిపోవుటతప్ప యాసేవకుని కేమియు బోధపడుటలేదు. బ్రాహ్మణుఁడాతని కొక కట్టడిచేసెను. తాను పూర్తియైనది యనునంత వరకు నెట్టిప్రమాదస్థితి యడ్డునను వెనుదిరిగిచూడరాదు. ఇరువురు పోవుచున్నారు. వెనుకనుండి క్రూరమృగములు గర్జించుచున్నటుల, హోరుగాలి వీచుచున్నటుల, భూమిబ్రద్దలై విచ్చుకొనుచున్నటుల ఫెళఫెళార్భటులుగ నశనిపాతము లగుచున్నటుల, మహాసైన్యవాహిని దండెత్తివచ్చినటుల, భయంకరముగ ధ్వనులు పుట్టసాగినవి. బ్రాహ్మణుడు పోవనేసాగెను. సేవకునికి భయమైనది. వెనుతిరుగరాదని శాసనము, అనుసరింప నేవలయును. ముప్పాతికవంతుగడచిరి. అంతకంతకు

ధ్వనులు భయంకరములై మిన్నుముట్టసాగినవి. సేవకు డోపలేక పోయెను. బ్రాహ్మణుడు, ధ్వనులు మిన్నంటుచున్నకొలఁది మహానంద మగ్నమానసుఁడై తేలిపోవుచున్నట్లు ముందునడచుచున్నాడు. ఇంతలో మిన్నువిరిగి నేలకూలినట్లు, బ్రహ్మాండము బ్రద్దలై కల్పాంతకాల సమయమున ప్రళయరుద్రుని శంఖధ్వానమువంటిదైన మహాగర్జన యైనది. సేవకుఁడు నిలువెల్లచలించి వెనుదిరిగినాడు. ధ్వనియాగిపోయి నది. తట్టలోమట్టి యింకను కొంతమిగిలిపోయినది. అకస్మికముగ నాచీకఁటిలో సేవకుని చెంపపై నొక విద్యుదాఘాతమువోని చపేటము వడినది. బ్రాహ్మణుని నేత్రములు నిప్పుక లుమిసినవి. కటికచీకటిలో నట్టి నిర్జనప్రదేశమున నాయన నేత్రములు మహారుద్రభూమిలో మండు చున్న రెండుకాష్టములవలె భయముఁ గొల్పుచున్నవి. ఆయన నిలు వెల్ల వణకి నిలువలేక కూలబడినాడు. తలనేలకువేసి కొట్టుకొనినాడు. ఆయన తనపడినప్రయాస, ప్రయత్నము విఫలములైనంతగ క్రుంగి పోయినాడు.

మఱునాడు గణపతిదేవుడు కొలువుదీర్చినాడు. మహామంత్ర వేత్త, జ్యోతిష్కుఁడు నైన బ్రాహ్మణుడు బృహస్పతివలె వచ్చినాడు. ఆపాదమస్తకము శాంతమూర్తియైన యాయన నేత్రము లగ్నిగోళముల వలె మండుచు నాయనమొగమున శాంతరౌద్రరసములు వియ్యమొందు చున్నవా యన్నట్లున్నవి. ప్రభువు మనమున కలగుండువడినాడు. జేయి జరిగిన యుదంత మాలకింప నుత్సుకులైన ప్రజాసందోహముచే సభ క్రిక్కిరిసి యున్నది. బ్రాహ్మణుఁడు లేచి ప్రభువు మొగమై యసినాడు. "ప్రభూ! నాపడిన శ్రమయంతయు వృధమై పోయినది. నాశాస్త్ర మర్యాద కవమానము జరిగినది. ఒక పిరికివాని మూలమున సామ్రాజ్య మునకు ముప్పు వాటిల్లినది. అంతటి భీరు నేలపంపితిరి? నేనిప్పు డేమి

చేయవలయునో తోచుటలేదు. నా ప్రయాస ఫలోన్ముఖ మగు నంతకే ఆ భీరువు నాయాస నిరర్థకము చేసినాడు. ఇక ప్రయోజనము లేదు. శుష్క ప్రయాసము, శూన్యఫలము నైనది.''

ప్రభువు మనము విచలిత మైనది. వదనమున దైన్యము తోప బ్రాహ్మణుని మొగమై నమస్కరించి యనినాడు — 'స్వామీ! తాము మహానుభావులు. తమకున్న ధైర్యము మాకు లేదు.' ప్రభువుల కన్నుల నేదో రహస్యము దాగియున్నట్లు నాడుచున్నట్లున్నది. ఆయన కంది యెఱ్ఱవారియున్న చెక్కిలిమీఁద తేలిన నాలుగు వ్రేళ్ళును రహస్య భేదనములై మెఱసినవి. బ్రాహ్మణునినోట మాట రాలేదు. నిర్వాక్కు నధీనుడు నై మొగము వెలవెల పోవ, 'ప్రభూ! లౌకికములైన సూక్ష్మ విషయ పరిశీలనాబుద్ధి నధిగమించుచు మా యలౌకిక మతివిభవమును మన్నింతు రనుకొందును' అనెను.

ప్రభువాశ్చర్య చకితుండై యనినాడు. "తమరు శీఘ్రకోపులు. అందును మహోత్కృష్టమగు ప్రజాహిత కార్యముపట్ల విఘ్నహేతు వైన వాని కామాత్రపు శిక్ష వేయకుండు టొక శిక్ష యగును.''

వారి సంభాషణ ప్రజానీకమున కర్థమగుట లేదు. బ్రాహ్మణునికి మాత్రము తాను మహారాజునం దపచారము చేసిన బాధయు ఫలసిద్ధి కాని బాధయు మిళితమై మనస్సును కలవర పెట్టుచున్నవి. నాటి సాయంకాలము వారిరువురు సాకాలకు తాము నిన్నటి నడిరేయి యరిగిన చోటునకుఁ బోయిరి. ప్రభు వచ్చుట నిదివఱకు విశాల మైన బయలును చూచెను. కాని యిప్పుడు ఆ విశాలమైన బయలున గుండ్రముగ నుత్తరము మొదలుకొని పడమరదిక్కువఱకు నొక, పర్వతపంక్తి వెలసి యున్నది. ఆ పంక్తి పడమటిదిక్కునకు వచ్చుసరి కాగిపోయినది. ఆపర్వతములు మొత్తమేడు. ఎనిమిదవకొండ లేదు.

మధ్యఁదటాకముఁ ద్రవ్వించవలయును. మఱి పడమటి దిక్కునఁ గొండ లేదు. అది వెలితిగ నున్నది. ప్రభువు విస్మితుడై బ్రాహ్మణునివంకఁ జూచెను.

బ్రాహ్మణుడు :— ప్రభూ! మీరు వెనుకకు తిరుగుటఁ జేసి కలిగిన విఘాతమిది. లేకున్న నీదిక్కునఁగూడ కొండ యుండెడిది. అట్టి యదృష్టము మనకు లేదు. మీరు వినిన యాధ్వను లీకొండలు భూమి నుండి యుద్భూతము లగుచున్నప్పుడు గలిగినవి. ఏమైన నేమి యిది యిట్లైనది. ఆ యెనిమిదవకొండయే యున్నచో మన ప్రయత్నము సఫల మయ్యెడిది.

ప్రభువు :— ఇప్పుడు మరల లగ్నము కుదురదా?

బ్రాహ్మణుడు :— లేదు, ఇక నిది యింతే.

ఇరువురు నటనుండి వెడలిపోయిరి. ప్రభువక్కడనే గొప్ప తటాకమును త్రవ్వించి పడమట నొక భయంకరమైన కట్టవేయించెను. తటాకము నొడ్డున నొకశిలాశాసనము వేయించెను. ఆ తటాకము నూనేటి నకీ నీరముచే పోషింపఁబడుచు సస్యవృద్ధికి దోహదమగుచున్నది. ఆ గణపతిదేవు డెంతటి ప్రభువు? ఆ బ్రాహ్మణుని మతివిభవ మెంతటిది? అట్టిబ్రాహ్మణులు తనరాజ్యమున నున్నారా?

ప్రభువు నిద్రించుచునే యున్నాడు. ఆయనమనోదర్పణమున సహస్ర స్తంభమంటపము ప్రతిబింబించినది. దాని స్తంభనిర్మాణమే విచిత్రము. ప్రతి స్తంభమునకు మొదట పీఠ ముండును. ఆపై విచ్చిన పద్మాకృతిగ జెక్కినశిలాఫలక ముండును. దానిపై నట్టిదే శిల బోరగిలఁబెట్టినట్లుగ నుండును. మరల కొంత స్తంభము, మరల నదేవిధముగ నుండును. స్తంభముమీఁద లతలు, తీగెలు, హారములు మున్నగునవి చెక్కబడి

నవి. ప్రతి స్తంభమున, ప్రతి చిన్న చెక్కడపు నగిషీయందును విమానమును చెక్క మరువలేదు. విమానము కాకతీయశిల్పపు ప్రధాన లక్షణము. కాకతీయశిల్పము సర్వము విమానమును మూర్తికట్టించుటలో, విన్యసించుటలో పర్యవసించుచున్నది. నాల్గు స్తంభములు. ప్రతి కోణమునకును మొదటినాల్గు స్తంభములు చతురస్రముగ నుండును. రెండు స్తంభములు దూరముగనుండి మొకటి నాల్గింటిలో కలియకుండ నుండును. ఏడవ స్తంభము పెద్దది. అది యీ యారింటిలోఁ బెద్ద దగును. ఆ స్తంభము మరియొక యారు స్తంభములతో గలసి యేడవ దగును. ఆ యేడవ స్తంభముమీఁద సంధానశిలాఫలక మమర్పఁబడి యుండును. చూచుచుండగనే రాజునకు సంధానితమైనకోణము సప్తపర్ణివలె మూరి కన్పించినది. రాజు కన్ను లింతలుచేసుకొని విస్మయముతో చూడసాగెను. అది యనంత సప్తపర్ణులవలె కనిపించినది. ప్రభువు చకితుఁడై కన్నులు నులిమికొని మరల జాగ్రతగ చూచినాడు. ఒక్కడే సప్తపర్ణి కనుపించినది. ప్రభువున కింకను నిద్దుర వదలలేదు. ఆయనకన్నులయెదుట ఆపాదలంబమానముక్తకేశములు గలది, వికటదంష్ట్రా ఒహిరాగతరసనాసిష్యందలలజ్జాం, కరాళవక్త్రవిస్ఫారితారుణాత్రిలోచనః నిర్గతప్రళయాగ్నిశిఖాచ్ఛటాదీప్తులు కలది, వికటాట్టహాస, కపాలమాలాధారిణి, నిరలంకారరూపిణి, శ్యామలాంగి, రౌద్రముఖి, రణోన్మత్తభద్రకాళీమూర్తి రక్తసిక్తదేహ, ప్రత్యక్ష మైనది. అష్టభుజములు కలది. పునుక, నిశుంభుని శిరస్సు, గద, అక్షమాల, పద్మము, చంద్రహాసము, ఛురిక పరశువులు కలిగినది. ప్రభువు భక్తివినమితాంగుడై దేవి నవలోకించుచున్నాడు. భద్రకాళీదేవి యేడుచేతులు సప్తపర్ణముల వలె కనుపించి యెనిమిదవచేయి కనిపించలేదు. ప్రభువు, అమ్మవారి యెనిమిదవ చేయి కనుపించనందులకు భయ మందినాడు. అది తన కపశకునమువలె నున్నది.

ప్రభువు మేల్కొనినాడు. ప్రొద్దుపోయినది. లేచి సౌధోపరి భాగమునకుఁ బోయి యాకసమును చూడసాగినాడు. చైత్రమాసము. ఉత్తరదిశ. సప్తర్షిమండలము ఆకసమున నడ్డముగనున్నది. వసిష్ఠుడు, మధ్యను గలిగిన మూడునక్షత్రముల వరుస పైకి వెడలుచున్నట్లున్నది. ప్రభువు కొంతతడవు వట్లే చూచుచు నిలబడినాడు. ఇంటిలోనికివచ్చి మరలఁ దల్పముపైఁ వ్రాలి యాలోచింప మొదలిడినాడు. ఎదురుగ బంగారపుసప్తపర్ణి మణిదీపపుమిలమిలలో రక్తవర్ణ యగుచున్నది. ప్రభు విట్లనుకొనినాడు. "ఈ బంగారపు సప్తపర్ణికి నెనిమిదవయాకు చేయించవలయును. ఎనిమిదవ చెఱువుఁ ద్రవ్వించవలయును. ఎనిమిదవప్రాకారము కట్టించవలయును. అప్పుడు తనవంశము సహస్రస్తంభమంటపమువలె నభివృద్ధి నందవలయును. ఏమైనను ఇట్లుచేసి తీరవలయును. ప్రభువుకన్నుల సప్తపర్ణియే నిల్చియున్నది.

## 3

ప్రభువుకన్నుల సప్తపర్ణియే నిలిచియున్నది. ఆయన సప్తపర్ణిని గురించియే యూహచేయుచున్నాడు. ఎంతచూచినను ఆశ్చర్యము వదలుటలేదు. తృప్తి కలుగుటలేదు. ఏమిసప్తపర్ణి! ఎట్లుచేసిరి? చేసిన శిల్పి యెవడు? అతఁడొక మహాశిల్పి కానోపును! గణపతిదేవుని కాలమున చేసినారు. ఆ గణపతిదేవుడు వశిష్ఠుడాయేమి? ఒక్క గణపతిదేవుఁ డేమిటి! తన పూర్వులందరు నొక్కొక్క వసిష్ఠునివలెనున్నారు. లేకున్న సహస్రస్తంభమంటపమును నిర్మించిన రుద్రదేవుడు, పాకాల చెఱువును త్రవ్వించిన గణపతిదేవుడు, సప్తప్రాకారములు కట్టించిన రుద్రమదేవి వసిష్ఠులు కాక వేరెవరు? ఎంతటి ధీశాలులు! ఈ సప్తపర్ణి తన మాతామహుడు గణపతిదేవుని కాలమునఁ జేయబడినది. ఈ వేఁడా

కులు బంగారముతో చేయఁబడినవి. అవి గాలి కల్లలనాడును. ఆకు తునిగి పోదు, చిరిగిపోదు. ఇంత సన్నని యాకు లెట్లు నిల్చినవి? అట్లు నిల్చి యుండుట కాబంగారమున నేమిలోహము కల్పినాడు? చాల విచి త్రముగనున్నది. నిజముగ నిట్టి యాకులు నిర్మించిన శిల్పి పరమాద్భుత ప్రతిభాశాలియై యుండును? ప్రభువున కెంతకును నాలోచన తెమలుట లేదు. తాను మరల నట్టియాకును తయారుచేయింపవలయును. ఈ సప్త పర్ణిని అష్టపర్ణినిగ చేయవలెను. అట్టిశిల్పు లుండిరా యని! మంత్రిని పిలిపించవలెను. తనదగ్గఱ శివదేవయ్య లేడే మరి! తనమంత్రు లందరు శివదేవయ్యవంటి మేధావులు కారు. శివదేవయ్య ధీవిశేషబలము మీఁద తన మాత రుద్రమదేవి సామ్రాజ్యము వర్ధిల్లినది. సురక్షితముగ తన కరగతమైనది. ఆ శివదేవయ్యయే లేనిచో నాయన మతివిభవమే లేనిచో తన కీనాడు రాజ్యము సంప్రాప్తించెడిదే కాదు. కాదు. కాకతీయ సామ్రాజ్యమే రూపుమాసెడిది. రుద్రమ, సింహాసనము నధివసించినది కాని, నిజముగ రాజ్యమేలినది శివదేవమంత్రి. ఆయన యంతటి రాజ నీతిజ్ఞుడు, కూటనీతిజ్ఞుడు, యుద్ధవిద్యానిపుణు డాయనయే. అట్టి చతురు లైన మంత్రులు తనకు లేరు. తన కసలు మంత్రు లున్నారా యని! సేనానాయకులున్నారు. వారందరు పరాక్రమమున నిధులు కాని మేధాసంపత్తియందు కారు. అట్టివారు తన కేమని చెప్పగలరు? తన నగరమందు పదిహేనువందల శిల్పిగృహము లున్నవి. మహాశిల్పులు, స్థపతిభాస్కర్యవిద్యలందు పారముట్టినవా రున్నారు. వెయ్యిస్తంభ ములమంటపమునం దింకొక స్తంభమును చేయుమనిన చేయగలరు. రామప్పగుడిలో నొక స్తంభము కట్టుమనిన కట్టగలరు. కాని యటు వంటి క్రొత్తవానికి మరల పథకము వేయుమన్నచో వేయలేరు. శిల్పులు రెండురకములుగ నుందురు. జన్మతః శిల్పులు. ఆచరణచేత శిల్పులు కొందరు. శిల్పిశబ్దసార్థక్యము ప్రతిశిల్పియందును కన్పట్టదు. శిల్పి స్రష్ట

యంతటివాడు. స్వతంత్రముగ, దేవతారూపకల్పనచేసి, వానిని విన్య సించి స్థూలరూపమున కనుపింపఁజేయువాఁడే నిజమయినశిల్పి. వాఁడే నిజమైన ప్రతిభాశాలి. అట్టి ప్రతిభాసంపన్నుని మూర్తికల్పనల నాధారముగచేసి, వాని ననుసరించుచు ధ్యానశ్లోకములఁ బఠించుచు శిల్పమున సిద్ధహస్తు లగుచున్న శిల్పులు నిజమునకు కర్మకారులవంటివారు కాని శిల్పిశబ్దవాచ్యులు కారు. వీరు వృత్తిచేత శిల్పులుగాని జన్మచేతను బుద్ధిచేతను గారు. జన్మతః ప్రతిభాశాలియైనశిల్పికి ధ్యానశ్లోకములవల్లించవలసిన యవసరము కూడ లేదు. అట్టిశిల్పి సర్వతంత్రస్వతంత్రుఁడు. అట్టిశిల్పి పెట్టినది భిక్ష మిగిలినశిల్పులకు. కేవలము శిల్పమే కాదు. సంగీతము సారస్వతము వీనియందుకూడ నిట్లే. శిల్పమున రూపకల్పన యెట్టువంటిదో సంగీతమున స్వరకల్పన, కావ్యమున రససిద్ధి యంతటివి. ఒకగాయకుడు, ఒకకవి, ఒకశిల్పికిని ఒక మహాగాయకుడు, ఒక మహాకవి, ఒకమహాశిల్పికిని జాల భేదమున్నది. శిల్ప మన కేవలము బొమ్మచెక్కుటగాదు. అట్లే సంగీత మన పాటపాడుట, కవన మన పద్యమల్లుటయును గాదు. బొమ్మచెక్కుటలో నెంతయైన నేర్పుచూపించవచ్చును. అట్లే పాటపాడుటయందు, రాగము తీయుటయందు కనపరుపవచ్చును. పద్య మల్లుటయందు శబ్దముల నెన్నుకొనుటచే కూర్పుచే సమాసముచే నలంకారముచే నెంతయైన శోభ నగపరుపవచ్చును గాని, వీనికి పరిపూర్ణత చేకూరదు. అపూర్ణముగనే యుండిపోవును ఒకమహాసౌధనిర్మాణబుద్ధిచేతగాని, యొకమహాద్భుతమయిన కట్టడమునకు పథకము వేయుట చేతగాని మహాశిల్పియొక్క ప్రతిభ బయటపడుచున్నది. మహాకార్యమునకు పథకమువైచి, దానివలన రససిద్ధిని కలిగించుటలో మహాకవియొక్క మహత్త్వము గోచరించుచున్నది. సంగీతమున స్వరకల్పనచేసి బ్రహ్మానందమును గూర్చుటచేత గాయకుని సామర్థ్యము జ్వలితమై భాసిల్లుచున్నది. అట్టి ప్రతిభాశాలులు జన్మించు టరుదు.

మిగిలినవారికి వారుపెట్టినది భిక్ష. అట్టిమహాత్ములు యుగమున కొకరుగ జన్మింతు రన్న నతిశయోక్తి కాదు. వారిని యుగపురుషు లనవచ్చును. బహుజన్మార్జితపూర్వపుణ్యసంచయముచే గాని యట్టిమహత్త్వ మబ్బదు అట్టి మహాత్ములు తలచినది, యాక్షణమ మూర్తికట్టి తేజరిల్లును. ఒక యులికదలికచేత శిల్పమున భావభేదమును, ఒక రాగచ్ఛాయా మాత్రమున బ్రహ్మానందమును ఒకపద్యమునందు రససిద్ధిని కల్పించ గల సిద్ధహస్తులు, వారే తపస్సంపన్నులు. అట్టి సిద్ధహస్తులు తన రాజ్యమున లేరు.

రేయి వేగినది. కార్యములఁ దీర్చికొని ప్రభువు మంత్రుల నాలోచనా మందిరమునకు రాఁ గబురుపెట్టెను. సగరాధ్యక్షుడైన నాగయ గన్నమంత్రి, ఇందులూరి అన్నయమంత్రి, ఇందులూరి రుద్రుడు, సాహిణి మారుడు అశ్వదళాధిపతి విచ్చేసిరి. ప్రభువు నాగయగన్న మంత్రి మొగనై యనినాడు— 'నేను మిమ్ముల నెందులకు పిలువనంపి తినో మీకుఁ దెలియ దనుకొనెదను. మనసప్తపర్ణిని అష్టపర్ణిని చేయ వలయును. అది యెట్లు పొసగును? అట్టి శిల్పు లెచ్చట నున్నారు?'

గన్నయమంత్రి మోమాశ్చర్యచకితమైనది. మిగిలిన మంత్రులవంక జూచినాడు. వారు నట్లే కానుపించిరి. పది నిముసముల దనుక నెవరు మాటాడలేదు. ప్రభువున కేమియు పాలుపోవుటలేదు. తానే నిశ్శబ్దమును చీల్చుకొనుచు ననినాడు. —— 'ఏమట్లు నిరుత్తరు లగుచున్నారు? అది యంత యసాధ్యమైన కార్యమనియా? లేక...'

నాగయగన్నమంత్రి:— లేక యేమియును లేదు ప్రభూ! నిజముగ నది యసాధ్యమైన కార్యమే యగును. నా యూహపోయినంత మేర కట్టి శిల్పులు లే రని నాభావము.

ఇందులూరి అన్నయ్య :— ప్రభూ! ఆ యాకులచేత నది పరమా శ్చర్యకర మైనది. దాని నేశిల్పి చేసెనో కాని మరల నటువంటియాకు నింకెవరునుఁ జేయఁ జాలరని నా దృఢాభిప్రాయము.

రుద్రుడు :— అవును ప్రభూ! ఆ యభిప్రాయము సర్వథా సత్యము.

ప్రభూ! మన దేశమున నానాటికి శాస్త్రసృష్టి తగ్గుచున్నది. శాస్త్రము నభ్యసించుటయందు శ్రద్ధ సన్నగిల్లుచున్నది. ఆరాధనా బుద్ధి నశించుచున్నది. గణపతిదేవప్రభువు కాలమునాటి శిల్పి చేసినదా సప్తపర్ణి. అప్పటి శిల్పి కేవల మా విశ్వకర్మ ప్రతిమూర్తి. కాని శతాబ్దములోపల శిల్పకుటుంబముల కెంతేని యథఃస్థితి సంభవించినది.

నాగయ :— ప్రభూ! మన యాశ కొనసాగు నాశ లేకుండ నున్నది. అంతటి పరమాద్భుతమైన బంగారపుటాకును తయారు చేయ గల శిల్పి మన నగరమున కాకపోయిన నెక్కడ నైన నుండెనా యని నా సందియము,

ప్రభువు మోమున చిఱుచెమ్మటలు ముత్తియములవలె మొలక లెత్తినవి. ఆయన నేత్రాంతముల చిఱుకోపపు టెఱుపుజీర గోచ రించినది. భ్రుకుటి యొకింత ముడివడి కల్యాణతిలకాకృతియై ఫాలమున స్థిరసంకల్పపు చిహ్నమువలె మెఱసినది. ఆయన యొక నిట్టూర్పు నిగి డించి వామహస్తపుతర్జనిచే క్రీబెదవిని తాటించుచు ననినాడు. "ఏమైనను సప్తపర్ణి సప్తపర్ణిని చేయవలయును అది నాస్థిరసంకల్పము నానికి తిరుగుండరాదు. అప్పుక యట్టియాకుల నురల తయారుచేయగల శిల్పి రాగలడని నా విశ్వాసము. లోకము గొడ్డుపోయినదా యేమి? మన రాజ్యమునఁ గాకున్న వేరొక దేశమునుండియైన వచ్చితీరును. సప్తపర్ణి యష్టపర్ణి యయి తీరవలయును; నాకు నిద్రపట్టవలయును.

మంత్రు లందరు నివ్వెరపోయిరి. ప్రభు వింకను చెప్పుచునే యున్నాడు. ఆయన చెప్పుకొనిపోవుటలో ఒకయావేగము, ఒకత్వర, ఒక బాధాలేశము గోచరించుచున్నవి. అచటివారు వినుచున్నదియు లేనిదియు కూడ పట్టుటలే దాయనకు.

ప్రభువు :– 'అటువంటి యాకును చేసినవానికి చక్రవర్తి తన అర్ధసింహాసన మిచ్చును. కనకాభిషేకము చేయును ' అని ప్రచురింపుము.

ఇట్లని ప్రభు వటనుండి లేచి వెడలిపోయెను. మంత్రుల కేమి చేయుటకును పాలుపోవుటలేదు. ప్రభువు చెప్పిన నిబంధనను ప్రచురించి ప్రకటించినారు. వారములు నెలలు గడచుచున్నవి. ఎవ్వరును రాలేదు. అస లెవ్వరికి నచటికి వచ్చుటకు ధైర్యము చాలుటలేదు. ఆ సప్తపర్ణి యెటులుండునో చూచుటకుకూడ నెవరును కోరలేదు. అది రాజాంతః పురమందిరమున నున్నది. ఆ చూడదలచిన శిల్పి మహాశిల్పి యని తేలినపిమ్మటగాని దానిని చూడ ననుజ్ఞ నియ్యరు. రెండుగజముల పొడవున గజము వెడల్పున విరుగకుండ చినుగకుండ నుండు నటువంటి యాకు నొకదాని నాశిల్పి మొదటచేసి చూపించవలెను. అప్పుడు సప్తపర్ణిని జూపింతురు. అంతట సప్తపర్ణి యాకులమీది శిల్పము నాశిల్పి చేయవచ్చును. అట్టియాకును చేయుశిల్పి కనిపించుటలేదు. ఆకునకుఁ గావలసిన బంగారము కోటలోనుండి యిత్తురు. అనవసరముగ కాలము వృథావ్యయము చేయుచో చక్రవర్తి వారిని శిక్షించును. అందుచేత నెవరును తూగిరాలేదు.

## ౪

పాకాలచెఱువు. ప్రాతరారంభవేళాపరిరమ్యబాలభాస్కరసుకోమలారుణకిరణచ్ఛటాసంహతిప్రసారముచే తటాకము మధురలజ్జారుణిమామండితమైన పూర్వదిక్సతీవదనముపోలె సొగసు లుమిసినది.

పాటలవర్ణసంయుక్తరక్తచ్ఛాయాపరిదీప్తకవోష్ణార్కాంశుమాలాద్యుతి తటాకపునీటిపైఁ బారాడి తటాకము నెత్తుటిమడుగువలె నైనది. ధవళరాగమిశ్రితసువర్ణాఢ్యమభానుజాలము తటాకపు చిఱుతరంగపు కదలికలలో గోదుమవన్నె త్రాచుపాములై మిలమిలలాడినది. మణికాంతుల వెలిగ్రక్కినది. ఒక్కయెడ బంగరునీరై పెఅసినది. వేరొక్కయెడ రక్తపుమడుగై విరిసినది. మరొక్కచో పాలపుంతయై దరిసినది. ఉదయాదిత్యసహస్రకిరణచ్ఛవి తటాకమునందంతటను పలువిధములుగ విచిత్రముగ యథేచ్ఛముగ విహరించినది. ఆతటాకమునొడ్డున నొక పురుషుఁడు పూర్వదిశాభిముఖుఁడై ధ్యానమగ్నుడై కన్నులరమూసికొని నిలబడియుండెను. ఆయనమొగమున బ్రహ్మతేజస్సు దాగిలిమూతలాడు చున్నది. బ్రహ్మతేజస్సుకంటెగూడ నధికముగ నాయన మొగమున దేవతాత్వపు చిన్నెలు గనుపించుచున్నవి. చిన్నెలేకావు, కేవలమాయన యొకదేవతావిగ్రహమువలె నున్నాడు. పరమసౌందర్యవంతుడు. తీర్చిదిద్దిన యవయవములు. స్రష్ట మచ్చునకై చేసిన సజీవసుందరవిగ్రహమువోలె నున్నాఁడు. ఆజానుబాహువు. సువిశాలనేత్రములు. సమదీర్ఘమైన నాసిక. సమోన్నతమైన నిటాలము. మిగులఁబండిన గజనిమ్మపండువన్నె కలవాడు. పొడుగైన యజ్ఞోపవీతము. సింహతలాటములు, మణికుండలములు, దర్భముడి యుంగరము, ముడికొదిగిన పిలకజుత్తు, మెడలో రుద్రాక్షమాల, గోచిపోసికట్టిన పట్టుబట్ట, బుజమున నంగవస్త్రము, మొగమున విభూతిపై తీర్చిదద్దిన తిలకరేఖ కలవాడు. ఆయన మొగమున చిరకాలమునుండి బహుదేవతారూపభావనచేసిన జాతియొక్క లక్షణము గోచరించుచున్నది. ఉదయోన్ముఖరాగరంజిత తీక్ష్ణభానుని సహస్రకిరణదీపులాయన మొగముపై కైగ్రాకి ఫాలమున ముద్దుపెట్టి దేహమున గిలిగింతలు కూర్చినవి. ఆదీప్తియందాయన దేహము బంగారమువలె తళతళ లాడినది. ఆదీప్తియాయన ఫాల

మున స్థాన మేర్పఱచుకొన్న ట్లుయున్నది. ఆయన కన్నులువిచ్చి చుట్టును కలయఁజూచినాడు. మనోహరమైన దృశ్యము. చుట్టును నేడు కొండలు, మధ్య తటాకము. ఎనిమిదవవైపు కొండలేదు. అది కొరఁతగ నున్నది. అటుకూడ నుండవలసినదే. మరి లేదేమి? ఆయన కన్నులు మరల నర్ధనిమీలితము లైనవి. ఆయన భ్రుకుటి యొకింత ముడివడినది. ఆయన ఆ తటాకపు నిర్మాణపద్ధతిని భావింపఁ దొడఁగినాడు. ఆయన మహాపండితుడు. మహాజ్యోతిష్కుఁడు. ఆయన మనస్సును వ్యగ్ర మొనర్చి చూచినాడు. ఆయన మనోముకురమున నెనిమిదవకొండ దగ్గరికి వచ్చునరికి మట్టికట్ట నెత్తినిపెట్టుకొనిన రాజు వెనుదిరిగిన దృశ్యమగుపించినది. ఆయన మరల నట్టి లగ్నము కుదురునా యని చూచినాడు. వెనుక వంద యేండ్లు. తరువాత వంద యేండ్లు. మధ్య మరల లగ్నము కుదరలేదు. ఆయన తనలో తానే 'ఛీ' యనుకొనినాడు. అచ్చటనే కూర్చుండిపోయినాడు. మూడుజాము లైనది. ఎండవేడిమి భరింపరానిదిగ నున్నది. ఆయన లేవలేదు. అటులనే కూర్చుండెను. మంచినీరమైన త్రాగలేదు. మన నేదో బాధను జెందుచున్నట్లున్నది. కన్ను లెఱ్ఱవారి భోజనముసేయమి లోతునకుపోయినవి. అంతకంతకు ప్రొద్దు వాలుచున్నది. బ్రాహ్మణుఁడు లేచి తటాకమున కాలుచేతులు కడిగికొని నీరు గండూషించి యుమిసి నడచి పోఁదొడగినాడు. చీకటిపడినది. ఆయన పోవుచునే యుండెను. మధ్యలో నొక యూరు సమీపించినాడు. నాడు శుక్లసప్తమి. నవోదితశుక్లపాకరశీతభానువులు జగమెల్ల సంచరించినవి. బింబము యామినీఫాలమువలె, కిరణజ్యోత్స్న యామె యనురాగదృక్ప్రసారమువోలె తోచినవి. ఆయన యొకపర్యాయ మాకసమువంకఁ జూచినాడు. చంద్రజ్యోత్స్న కాకతివంశకీర్తిసస్యమున కేతాము లెత్తుచున్న ట్లున్నది. ముందునకు సాగినాడు. ఎదురుగ నెవరో వచ్చుచుండుట చూచి యాగెను.

వ్యక్తి :— ఏమిదొరా! నిలువబడిపోయితివి!

పురుషుడు :— ఈ యూరిపే రేమియో తెలియఁగోరి నీరాక కెదురు నిల్చితిని. చెప్పెదవా?

వ్యక్తి :— గిరిదుర్గము దొరా!

పురుషుడు :— గిరిదుర్గమా!

వ్యక్తి :— అవును దొరా! అట్లు విస్తుపోయెద వేమి? మా కాకతి రాజ్యపు సప్తప్రాకారములలో నిది మొదటి ప్రాకారము.

పురుషుడు :— అయినచో నిది గిరిప్రాకార మన్నమాట. గిరి దుర్గమందు వేమి?

వ్యక్తి :— మేమట్లే యందుము.

పురుషుడు :— అయినచో ప్రాకారమేది?

వ్యక్తి :— ప్రాకార మనగ నగరిచుట్టును చుట్టియుండెడి ప్రాకారము కాదిది. ప్రకృతిసిద్ధముగ నున్నగిరు లుండును. గిరికిని గిరికిని మధ్య గల భాగమున ప్రభువు సేనానివహముల నుంచును. శత్రుబలముల నిర్జించుచు వారు ప్రాకార సంరక్షకులుగ నుందురు.

పురుషుడు :— సరి తెలిసినది.

ఇరువురు నెవరిదారిని వారు పోయిరి. ఆయన కొంతదూరము గడచినాడు. వెన్నలలు సాంద్రములై మృదువులై భూమిని కౌగలించుచున్నవి. మార్గమధ్యమున దూరదూరముల గిరిసంచయములు పెట్టని గోడలై కట్టని ప్రాకారములై వెన్నెలలో బ్రహ్మరాక్షసులవలె భయము గొల్పుచున్నవి. భూమిపై వానినీడలుపారి చీకటిముద్దలవోలె కనుపించ

సాగినవి. చాలాదూరము గడచినాడు. మరల నొకయూరు పొడకట్టినది. ఆయూరిపేరు కంచెకోట. కంచెకోట యనఁగ మైళ్ళకొలదిగ వ్యాపించి యున్న కండకములయందు శత్రుసేన లేతెంచు మార్గముల నవరోధించుటకుగ భేధించకుండ పరిపోషించుచున్న రక్కెన, వాకుడు, తుమ్మముండ్లతీగెలు. బాటయందు మొగలి మొదలగు తరులతానందోహములు గలవు. అది యట్టిబాటయని రాజసైనికులకుతప్ప నితరరాజభటులకునైతము తెలియదు. వారు దండెత్తివచ్చుచో నామార్గమున జిక్కువడి ముండ్లలో నంత మొందవలసినదే. అట్లు పల్లవుభూముల కంచెలులేనిచోటుల సేనలచేత పరివృతమై సంరక్షింపఁబడుచున్న దా ప్రాకారము. ఆయన యట్టికంచెదారులఁ జూచినాడు. వెన్నెలలో నామార్గములు ధవళకాలారుణవర్ణ మిశ్రితములై వైతరణీనదివోలె మిగుల భయము నొదవించుచున్నవి. తాను మున్నెన్నఁడు నిటు వచ్చినవాడుకాడు. ప్రాకారశబ్దమును కోట యని వాడుట, అసలా ప్రాకారనిర్మాణవైచిత్రి, సామ్రాజ్యసంరక్షణానురక్తి, సర్వమును చిత్రములై గానుపించినవి. వెన్నెల చిక్కనై ముదిరి బలిసి మందముగ కాయుచున్నది. చల్లని మలయమారుతము వీవసాగినది. ఆకసమున రాజు చంద్రికలు వెన్నంటి కొలువ తీవిగ మందగమనుఁడై సంచరించుచున్నాడు. కాకతీయసామ్రాజ్యమునకు పదిమైళ్ళదూరమున వలయాకారముగ నిరువదియొక్కమంది పాళెగాండ్రు కలరు. వార లందరకు తలకొకగ్రామము. పాళెగానికొకనికి వేయిమంది సైనికు లుండిరి. వారు తమతమ సైన్యములతో నెల్లప్పుడు రాజ్యరక్షణవిషయ మేమరక యతిశ్రద్ధగ పరిరక్షించుచుందురు. ఆ పాళెగాండ్ర గ్రామములవలయమున కేకనామము రాజప్రాకారము. ఆయన దానినిఁ గడచి నడువసాగెను. అనుమకొండపురములోనికిఁ బ్రవేశించినాడు. సహస్రస్తంభమంటపములోని కేగి యచట కూర్చుండినాడు. వెన్నెలలో నామంటప మందలి శిల్పము మిక్కిలి శోభించు

చున్నది. శిల్పమునందలి ప్రతియొక్క చిన్నవగిషీయును స్పష్టముగ గనుపించుచున్నది. ఆ మంటపము కాకతిరుద్రుని ముద్దకట్టిన శిల్పాభిమానమును చాటుచు మెరయుచున్నది. ఆయనలేచి మంటపమును చుట్టివచ్చినాడు. రుద్రేశ్వరాలయమును, దానిముంగలి మహానందిని సందర్శించెను. శిల్పసంపదనంత నతిశ్రద్ధగ పరిశీలన మొనర్చి వచ్చి కూర్చుండి యాలోచనచేయ మొదలుపెట్టినాడు. చాల బడలికగొని యున్నాడు. కాని నిద్దరపట్టుటలేదు. సహస్ర సంభమంటపనిర్మాణమును గురించి యూహచేయుచున్నాడు. రాత్రి రెండుజాములు దాట వచ్చినది. సప్తమినాటి వెన్నెలలు అబ్బుకొనలేని మహీహోమః సిరిసంపదలవలె సన్నగిలఁజొచ్చినవి. చంద్రుడు కళాహీనుడై యస్తమింపఁ బోవుచున్నాడు. చూచుచు డగనే కాళిమ యలముకొనినది. ఆయనకు నిద్రదూరమైనది. కూర్చుండి యాలోచింపఁ దొడగినాడు.

ఆయన చోళచాళుక్య ప్రభువులనాటి శిల్పాచార్యుల సంతతిలోనివాడు. ఆయన ముత్తాతపేరు జక్కనాచార్యుడు. ఆయన మధుర, కంచి, చిదంబరముల యందలి మహాశిల్పముల నిర్మించిన మహాశిల్పి. శిల్పికుటుంబములయం దాయనపేరు తెలియనివారు లేరు. ప్రతిశిల్పియు చెక్కుటకై శిలనుస్పృశించుటకుముం దాయనను తలంచికాని ప్రారంభింపరు. ఆయనయెడ శిల్పుల కంతటి గౌరవపురస్సరమైన యభిమానము. ఆయన మహాశిల్పనిర్మాత. కేవలము విశ్వకర్మయంతటివాడు. కావుననే యాయన శిల్పిహృదయముల దేవతయై వెలసినాడు. అట్టి యా మహాపురుషుని పేరే యీయనకు పెట్టినారు. ఆముత్తాత జక్కనాచార్యుఁ డెంతటి లోకోత్తరుడైన శిల్పియో యీజక్కనాచార్యుడు నంతటి లోకోత్తరమైన శిల్పప్రతిభ కలవాడు. కాని కాలము మారినది. ఆయనకు నీయనకు మధ్య మూడువందలయేండ్లు గడచినవి. రానురాను

కాలమునకు శక్తి క్షీణింపదొడఁగినది. విద్యచేత, ప్రతిభచేత యీజక్కన తన ముత్తాతయంతటివాఁడు, కాని యదృష్టముకలిసి రాలేదు. భాగ్యము కాలము నాశ్రయించుకొని యుండును. ఆనాటి ప్రజలు ప్రభువులు వేరు. శిల్పమునెడ వారికిగల మర్యాదాభిమానములు వేరు. ఈనాఁడు వేరు. ఆనాఁడు జక్కనకు బ్రహ్మరథము పట్టినారు. కనకాభిషేకములు సల్పినారు. ఎంతయేని మర్యాద చేసినారు. నేఁడట్లుగాదు. తన మహత్త్వమును గుర్తించువారెవరును లేరు. ఎవరి యదృష్టము వారిది. అది యదృశ్యమై యుండును. ప్రతిభ దృశ్యముకావలెనన్న దానికి పరిస్థితులనుకూలించవలయును. పరిస్థితు లనుకూలించనిచో, నవకాశములు కలుగనిచో నెంతటి ప్రతిభయైన యంతర్లీనమై మ్రగ్గిపోవలసినదే. ఒకమహాప్రతిభావంతు డున్నచో నాప్రతిభను గుర్తించి వెలికి తీసుకొని రాఁగల మతిమంతు లుండవలయును. లేనిచో నేమున్నది? ఒక దేశమున మహామంత్రి కాఁదగిన ప్రతిభాబుద్ధులు కలిగిన యొకఁడు జన్మించును. ఆ దేశమునకు స్వతంత్రరాజ్యము లేదు. అప్పు డాతని సర్వప్రతిభయును నణఁగియుండును. ఒకమహాకవి యుండును. ఆయన మహత్త్వమును తెలిసికొనుటకుఁ దగినబుద్ధిమంతు లుండిననే కద యాకవి ప్రతిభ బయటపడునది. అధికారము లన్నియు అల్పహస్తములై యుండుటచే నిట్టివి కలుగుచుండును. ఆ యధికారుల కేమియు తెలియదు. తెలిసినట్లు నటింతురు. వారికిఁ దెలియకపోయినను పదవీగర్వమున నన్ని విషయములలో జోక్యము కలిగించుకొందురు. వారిమూలమున నిజమైన ప్రతిభాశాలుల కవకాశములు కల్పింపబడకుండుట, ప్రతిభావంతు లవమానితులగుట, వారి మహత్త్వమును గుర్తించకుండుట, తెలివిగలవారి పరిపాలన లేకుండుట, యిట్టి వన్నియు రాజ్యమస్తంగతమగుటకు చిహ్నములు. ప్రభువులు విద్యాపోషకులుకానిచో ప్రతిభాశాలుల గతి యేమగును? నిజముగ నావిక్రమార్క చక్రవర్తియే

లేనిచో కాళిదాసుని ప్రతిభ యేమయ్యెడిది? ఆ హర్షవర్ధనుడు తన యాస్థానమున గౌరవించనిచో బాణు డేమయ్యెడివాడు? రాజరాజ నరేంద్రుడు దర్శించనిచో నాన్నయ్యభట్టే మిసేసెడివాడు? ఆ రామచంద్రుడే లేకపోయిన వాల్మీకి యేమివ్రాసెడివాడు? తన ముత్తాత యంతటికీర్తిని గడించెనన్న నాటికాలము వేరు. నాటిప్రభువు కళాభిమానము వేరు, నాటికి రాజ్యముల నింత యల్పాధికారములు లేవు. నిజముగఁ దాను నంతటి ప్రతిభావ్యుత్పత్తులుగలవాడు. కాని తనకు తన ప్రతిభను వెలార్చుటకు తగిన యవకాశములు గలుగలేదు. ఆ యవకాశమునకయి యోరుగంటి కతఁడు వచ్చుచుండెను. కాని యా మహా గణకుని బుద్ధిలోఁ గాలమే తన కనుకూలమైనట్లు కనిపించలేదు. ఇక రాజుమాట యేమో!

జక్కనాచార్యుడు సహస్రస్తంభశిల్పమంటపనిర్మాణ పద్ధతిని గురించి యూహసేయుచునేయున్నాడు. ఆ శిల్పమంటపముయొక్క నిర్మాణమును భావించుటలో, దానికి పథకము వేయుటలో నున్న నేర్పు స్తంభములయందు చెక్కినశిల్పమునందు కనుపించుటలేదు. అసలు నిర్మాణమునందే తప్పున్నది. రెండు దళముల కొక స్తంభము నాధారముచేయుటయు, ఆ స్తంభ మీదవ స్తంభ మగుటయు; ఆ యూహయే తప్పు ఎనిమిదవ స్తంభము లేదు. ఏదళమున కాదళమునకు నెనిమిదవ స్తంభములేదు. ఏడవ స్తంభమే పరమావధిగా గనుపించుచున్నది. ఈ యేడవ స్తంభమును పరమావధిగా చేయుటలో నిశితమైన బుద్ధి కనుపించుటలేదు. సప్తసంఖ్యపై నాధారమొనర్చుట బాగుగ లే దనుకొనినాడు.

రాత్రి యతిక్రమించుచున్నది. అక్కడనే క్రింద మేనువాల్చి యంగవస్త్రముఁ గప్పుకొని శయనించినాడు. కలత నిద్దురపట్టినది.

మిగిలిన రేయెల్ల స్తంభనిర్మాణమును కలగనుచు నాయన తెల్లవార్చెను. ఆయన మరల నడకసాగించినాడు. సూర్యోదయాత్పూర్వమే కాకతిప్రాకారమును జేరుకొనినాడు. ఇరువదియొక్క పాళెగాండ్రకు నిరువదియొక్క శక్త్యాలయము లున్నవి. ఆ యిరువదియొక్క శక్తులను, ఆదిశక్తియొక్క యిరువదియొక్కరూపములై యిరువదియొక్క నామములతో వెలసినవి. ఆ వలయాకారముగనున్న పాళెగాండ్ర గ్రామముల యందున్న నీ దేవ్యాలయవలయమును కాకతిప్రాకారమందురు. ఈ ప్రాకారము సుశిక్షితులై సాయుధులైన భటులచేఁ గాపాడబడు చున్నది. ఈ కాకతిప్రాకారమునకు ప్రధాన ద్వార మనుమకొండ యందలి భద్రకాళీదేవ్యాలయము. జక్కన యా భద్రకాళియాలయమునకు వచ్చి యచ్చటి భద్రకాళీతటాకపు నిర్మలోదకముల సంధ్య వార్చి గుడిలోనికిఁ బోయినాడు. అమ్మవారి యెదురుగ నేలపైఁ గూర్చుండి జపము సల్పినాడు. దేవి ప్రత్యక్షమైనది. ఆమె యెనిమిదవ హస్తము పైకెత్తబడి యా హస్తమునందు రక్తసిక్త ఖడ్గమున్నది. జక్కన్న చకితుడై మరల సంభాళించుకొని యమ్మవారిని మరల స్తోత్రము చేసినాడు. కాని లాభము కలుగలేదు. తల్లి శాంతింపలేదు. జక్కన్నకేమో భయమైనది. కన్ను తెరచినాడు. ఎదురుగ భయంకర భద్రకాళీమూర్తి కన్నుల చంద్రమల్లెలఁ జిమ్ముచు వికటాట్టహాస మొనర్చుచు దర్శన మొసగుచున్నది. ఆయన ప్రక్కన దేవ్యాలయ పురోహిత బ్రాహ్మణుడు నిలబడి యున్నాడు.

బ్రాహ్మణుడు :— బాబూ! ఒక్కమాట. తమ రిట్లు విచారదీనులై యుండుటకు కారణ మేమి? వచ్చిన యప్పటినుండి చూచుచున్నాను. మీలో నేదో వ్యాకులత గోచరించుచున్నది.

జక్కన్నకు తన విషయ మీయన యెందు కడుగవలె ననిపించి నది. మాటాడలేదు. అమ్మవారి వంకకే చూచుచున్నాడు.

బ్రాహ్మణుడు :— మాటాడరేమి బాబూ! నాకేమో భయ మగుచున్నది. అమ్మవారు ప్రతిదినమును రక్తాంగియై కలలో కనిపించు చున్నది. మీబాధ నాకు చెప్పరా! మీరెవరు?

జక్కన్న బ్రాహ్మణుని మొగము జూచినాడు. ఆయన మొగ మున నాప్యాయత యుట్టిపడుచున్నది. ఆయనతో మాటాడకుండ నుండలేకపోయెను.

జక్కన్న :— నేనా! ఔను, నేను పనిమీదనే వచ్చితిని. ప్రకటన విని వచ్చితిని.

బ్రాహ్మణుడు :— అయినచో సప్తపర్ణి సంపూర్ణము జేయుటకై వచ్చితివా బాబూ? రామప్పగుడిలో నొక స్తంభము మిగిలిపోయినది. దానిని కూడ కట్టవలయునట, నాయనా! నీవు చాలచిన్నవానివలె నున్నావు. అట్టి యసాధ్యమైన కార్యమునకు గడంగితి వేమి? నీవయ స్సెంత? బాబూ?

జక్కన్న :— ఇరువదియెనిమిది.

బ్రాహ్మణుడు :— ఇరువదియెనిమిదా?

జక్కన్న తల యూచినాడు. ప్రక్కన కూర్చుండియున్న పురో హితుని కుమారుడు పసివాడు. ఎక్కములలో 'నాలిగేళ్ళిరువదియెని మిది' యనిబిగ్గరగా కంఠమెత్తి చదువసాగెను. అది వినగనే జక్కన్న యదిరి పడినాడు. జక్కన్నకేమో ధైర్యము చాలకుండ నున్నది. అక్కడనుండి లేచినాడు. పురోహితుని వెళ్ళుట కనుజ్ఞ వేడినాడు.

ఆయన యిష్టకామ్యసిద్ధి యగున ట్లాశీర్వదించినాడు. జక్కన్న యచటి నుండి బయలు దేరినాడు. రామప్పగుడికి పోవలెను. సాయంత్ర మగు సరికి మల్లంపల్లి గ్రామమున చేరినాడు. రూపొందిన దేవతామూర్తివలె నున్న యాయన సర్వప్రజల నాకర్షించు శక్తి కలవాడు. జక్కన్న యొక యింటిముంగిలి యరుగుపైఁ గూర్చుండి విశ్రాంతిఁ దీసుకొనఁదొడగెను. లోనుండి యొక బ్రాహ్మణుడు వచ్చి జక్కన్నను గౌరవించి మర్యాద చేసినాడు. ఆయన యొక విశ్వబ్రాహ్మణుఁడు. భోజనాదికములు పూర్తి యైన తరువాత బ్రాహ్మణు డనినాడు. "స్వామీ! తమ రెవరు? తమ నామధేయ మేమి?

జక్కన్న :— నా పేరు జక్కన.

పేరు వినుచునే బ్రాహ్మణు డదరిపడి లేచి, 'మీకు జక్కనాచార్యు లేమగుదురు?' అనినాడు.

జక్కన్న తన ముత్తాతకీర్తికి తలక్రిందులై యనినాడు. "ఆయన మా ముత్తాత. ఆయన పేరే నాకుఁ బెట్టిరి.

బ్రాహ్మణుడు తనయిల్లు పావన మైనదని మురిసినాడు.

బ్రాహ్మణుడు :— అయినచో తమ రెచ్చటికి పోవుచున్నారు?

జక్కన్న :— రామప్పకు పోవలెను. అక్కడ కొలదిగ పను లున్నవి.

వారిరువురు శిల్పవిషయముగ చాలసేపు భాషించిరి. జక్కన్న మరునాడు [illegible] బయలు దేరినాడు. ప్రొద్దుగ్రుంకువేళకు ములుగు చేరుకొనినాడు. అచ్చటిప్రజలు జక్కన్నను మిక్కిలిగ గౌరవించినారు. మంచి యాతిథ్యము దొరికినది. ఆ రేయి యచట గడిపినాడు.

రామప్ప కచటినుండి పది క్రోశములు చుట్టుతిరిగి పోవలెను. రామప్ప చెఱువుఁజుట్టి దశమినాటి రాత్రికి రామప్ప దేవాలయమునకు చేరెను. దేవాలయపు గోడలమీఁద శిఖరముమీఁద శిల్పము ముద్దలుముద్దలుగ చెక్కఁబడినది. జక్కన్న పూర్తిగ నొక్కదినమంతయు ప్రధానదేవాలయపు బహిర్భాగపు శిల్పమును పరిశీలించుటయందే గడపినాడు. ఆలయపుఁ గుడ్యములనిండుగ నృత్యశాస్త్రమునకంతయు రూపేర్పరించి యమోఘముగ చెక్కినారు. వివిధములైన భంగిమములు, ముద్రలు, హస్తములు నృత్యపద్ధతులు విచిత్రముగ వానియందు పొందుపరచిరి. ఆశిల్పముఁ జూచినఁజాలును, శాస్త్రము నిక వేఱుగ చదువనక్కరలే దనిపించును. అచ్చట విన్యసించిన యా నృత్యశాస్త్రము జాయపనాయకునిచే రచియింపబడినది. అచటి శిల్పులు శృంగారరసమును తమశిల్పమున విస్తృతముగ వాడుకొనినారు. పలువిధములైన శృంగారక్రీడలు, గంధర్వదంపతీవ్యాజమున శృంగారరసమును యథేచ్ఛముగ విన్యసించినారు. శిల్పమునకు నృత్యశాస్త్రమునకును విడదీయరాని బంధ మున్నది. శిల్పశాస్త్రమంతయు నృత్యశాస్త్రమును ప్రతిమారూపముగ రూపొందించుటలో పర్యవసించుచున్నది. ప్రతిశిల్పియు తప్పక నాట్యశాస్త్రవేత్తయై యుండితీరవలయును. రామప్పదేవాలయము విషమబాహుదేవాలయము. బహుముఖములుగనున్న దేవాలయపు కట్టడములలో నిది యొకరకపు కట్టడము. రుద్రేశ్వరాలయము కూడ విషమబాహుకట్టడమే. విషమబాహుదేవాలయమునకు మొదట నష్టకోణముగ నొక ఫలకమును నిర్మించి దానిమీఁద దేవాలయమును కట్టుదురు. ఈ ఫలకము మెట్లుమెట్లుగ భూమినుండి నాల్గడుగులు పయికుండును. ఈ మెట్లు రెండువరుసలుగ నుండును. ప్రధానద్వారమున కిరువంకల స్తంభములుగ చెక్కఁబడిన యేనుగులు వాని మీఁద శరభమృగములు నతిమనో

హారములు. దేవాలయవిమానపు పై భాగ మంతయు కోణములు తేరిన గుబ్బలచే శోభించుచున్నది. విమానపు కట్టడము శుద్ధ, మిశ్ర, సంకీర్ణాదిగ పలురకములుకలదై యున్నది. రామప్ప దేవాలయవిమానము శుద్ధము. కాకతీయశిల్పమున ప్రధానముగ కానవచ్చునవి విమానము, లతలు, హారములు మొదలగునవి. దాక్షిణాత్య శిల్పమునందువలె దేవతా విగ్రహములు కావు, అట్లని యసలు లేవని కాదు. వాని ప్రాధాన్యము తక్కువ. దాక్షిణాత్య దేవాలయములమీద విగ్రహవంతమై వెలసిన శిల్పము కాకతీయ దేవాలయములమీద ప్రకృతిచిత్రములై వర్ధిల్లినది. అచటి శరభమృగములు, నేన్గులు సౌందర్యమును పుణికిపుచ్చుకొనినవి. శిల్పమంతయు శ్రావణప్రారంభ వేళానవనీలనీరదచ్ఛాయాపరిరమ్యము లైన నీలిశిలలయందు మలచబడినది. అటువంటి రాయి కాకతి రాజ్యపు పర్వతప్రాంతమునలేదు. అది యెచటినుండి తెప్పించిరో మరి, ఎంత ప్రయాసమైనదో! అప్పటిప్రభువు లంతటి శిల్పాభిమానులు అంతటి యమోఘమైన శిల్పమును విన్యసింపఁజేసి శిల్పుల నమరజీవు లుగ చేసిన చక్రవర్తులు. వారి యాదరణమే లేనిచో నీశిల్ప మంతయు నేమయ్యెడిదో! శిల్పులు గతించినారు. ప్రభువు లస్తమించినారు. కాని శిల్పములు చిరస్థాయిగ వారికీర్తిపతాకయై నిలిచి వారి శిల్పాభి మానమును శిల్పనైపుణిని వేనోళ్లఁ జాటుచున్నవి!

జక్కన్న దేవాలయాంతర్భాగమునకేగి స్వామి దర్శనముఁ జేసుకొని నందీశ్వరునికి నమస్కరించి సకల శిల్పపరీక్ష నారంభించెను. దేవాలయాంతర్భాగమంతయు శిల్పము నభిరామమై యొప్పుచున్నది. కుడ్యములందు నీలశిలానిర్మిత దేవతామూర్తులందుకబడినవా యనునట్లు చెక్కబడినవి. కుడ్యము లోతునకుండి విగ్రహములు పైకివచ్చి కేవ లము ప్రత్యేకముగ నిలబెట్టబడిన ట్లున్నవి. దేవాలయపు పైకప్పు

లోపలిభాగమున కూడ శిల్పము చెక్కబడినది. ఆ కప్పు నిర్మాణము విచిత్రముగ నుండును. అది తొమ్మిది శిలాఫలకములవలన నగుచున్నది. మొదట నలుపలుకలుగల్గిన యొక మహాశిలమీఁద విచ్చిన సహస్రదళ పద్మమును చెక్కుదురు. చుట్టును వివిధములగు చెక్కడపు నగిషీలను చెక్కుదురు. మిగిలిన నాలుగు ఫలకములు త్రికోణాకారముగ నుండి శిల్పసంయుక్తమై యుండును. సాధారణముగ నాప్రధానమైన మహాశిలాఫలకము నల్లరాతిదై యుండును. మిగిలిన కోణఫలకములు నున్నని యెఱ్ఱరాతివై యుండును. ఒకొక్కప్పుడు మహాశిల యొక్కపై కోణశిలలు నలుపుగ గూడ నుండును. ఈ శిలాఫలకములను స్తంభములపై కెక్కించి రాతిచే చెక్కబడిన చీలలచే బిగింతురు. స్తంభనిర్మాణ మెచ్చట నొకేరీతిగ నుండును. పైకప్పు లోపలిభాగమునందలి మహాశిల యందలి సహస్రదళకమలశిల్పమునకు సూటిగ క్రింద నేలమీఁద గూడ నట్టిదే మరియొక కమలము చెక్కబడినది. స్తంభములపై నమర్పఁబడిన రాతిదూలములపై నలువైపుల శైవగాథలు చిత్రించబడినవి. సముద్రమథన మత్యంతసుందరముగ చిత్రించబడినది. ధూసరవర్ణవికటజటామకుటములు గలవారు, కరాళదీర్ఘసితదంష్ట్రికా వినిర్గతక్రోధమయవికటాట్టహాసము కలవారు, ఒహుప్రయాసవశాపగత బాహుబలులై క్రోధాగ్నికీలల విరజిమ్ముచున్న యరుణనేత్రములు కలవారు, దీర్ఘదేహులు, కాలకాయులు, ఎగచికట్టిన దోవతులవారు, శ్రమాంబుపరిసిక్తదేహులు, తమోగుణప్రధానమూర్తులు నైన వీరు లొకవంక, సునీలనాతిదీర్ఘసుందరకేశబంధములవారు, చాంద్రీసుకుమారసుస్నిగ్ధ మందహాసములవారు, శ్రమూలసకించిదరుణానిమేషనేత్రాంతానఁరతప్రసవస్మృదుసితాపాంగరోచిస్సులవారు, సమవపువులు, హరిద్రాస్వచ్ఛపాండువర్ణమిశ్రితారుణసుందరశరీరులు, ఆపాదలంబిత కౌశేయములవారు, పరిశ్రమజాతములైన చిట్టిముత్తియములు వోలిన

శుక్లబింబములవారు సత్త్వగుణప్రధానమూర్తులు నయిన వీరు లోకో పంక, మధ్య సుదీర్ఘదేహుడు మహాసత్త్వమూర్తి, చంద్రికాసమధవళాంగుడు, రత్నమౌళి యయిన నాగప్రభువు వాసుకి మందరమహాపర్వతమును చుట్టికొన్నాడు. సహస్రముఖములనుండి నరుగులు గ్రక్కుచున్నాడు. విషాగ్నికీలలు లెగయుచున్నవి. మందరపర్వతముచుట్టు నో అడుగులిగి మధ్యభాగము సన్నగలిగి చానియేర్పడినది. వాసుకినిం గవ్వపు త్రాడుగ మందరనగము నాధారముగ పాలకడలిని దేవదానవులు త్రచ్చిరి. సహస్రఫణములు రాక్షసహస్తములం దున్నవి. పుచ్ఛభాగము దేవతలు పట్టిరి. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, వాణీగిరిజలు, ప్రేక్షకులై నిలిచినారు. మథనము జరిగినది. దశదిశలు పిక్కటిల్లు మహాధ్వానము లైనవి. జగమెల్ల కదలిపోయినది. చిలుకంగా చిలుకంగా మహాకాలాకృతి యెగయుచున్న ధూమరేఖలుగలది, గర్భాంతరితవిషాగ్నికీలలుగలది, ఆకాశవ్యాప్తభీకరాకారముగలదియు నగు నొకానొక యస్పష్టపు మహాతిమిరరూప మావిర్భవించినది. బ్రహ్మవిష్ణు లాదిగాగల సర్వదేవదానవులు తల్లడిల్లి మహాదేవుని దిక్కై జాలిచూపులు చూచి వేడనారిరి. స్తోత్రముం జేసిరి. రుద్రుండు వారి కభయమిచ్చి నిలిచి యామహాకాలకూటవిషమూర్తిని దక్షిణహస్తపు టరచేత నిల్పినాడు. శాంతమూర్తి, గజచర్మధారి, త్రిశూలపాణి దానినిం బట్టి మ్రింగినాడు. గిరిజకన్నుల కెంపుజీర తొంగి చూచినది. మహేశ్వరుని దిక్కుంజూచినది. దేవతలం జూచినది. భర్త కన్నుల నేమి దర్శించినదో కాని యామె కన్ను లంతలో గంగ రావిపూవులైనవి. గరళ మింకను కంఠముదాటి చనలేదు. అది యట్లు జరిగిన ప్రమాదము. పార్వతి కంఠమున నిల్పు మన్నది. పరమేశ్వరు డట్లు నిలిపినాడు. ఆయన కంఠ మావిషాగ్నిశిఖాపరితప్తమై కాలకంఠమైనది. ఆపదలు తీరినవి. మరల చిల్కిరి.

కడలి సుధాస్వచ్ఛడిండీరముల వెలిగ్రక్కినది. అమృతము తెట్టెలు గట్టి, ఫేనమై తట్టనొరసి కర్పూరపుముద్దలవోలె కనుపించినది.

హిమాచలసానువులందు దేవదారువనీమధ్యమున పరమశివుడు తపస్సు మొదలుపెట్టినాడు. హిమగిరికన్య ఆయనకు సర్వోపచారములు చేయుచున్నది. ఒకనాడు దేవతలచే ప్రార్థింపబడిన మన్మథుడు, గిరిజ శేఫాలికామాలిక శివుని కందిచ్చువేళ, శివుడు కను లరవిచ్చువేళ, కనిపెట్టి పూవుటమ్ము నేసెను. శివుని మనము చలించినది. శివుడు కనులు విచ్చినాడు. ఎదురుగ నఖశిఖాపర్యంతసుకోమాలాకృతి, అరవిచ్చుకనుదమ్ముల తుదలందేలు తెలిచూపులు కలిగినది, మధుకలజ్జాసమన్వితానురాగవశ కించి దరుణరంజితకపోలభాగ, కొలదిగ సెలవిసాగ నవ్విన యతి నవ్వు సొగసులుగలది, ఫాలభాగస్థానిర్వచనీయ మహాశక్తిచిహ్నములు కలదియు నగు పార్వతిం జూచినాడు. ఆయన మనస్సు తత్కాలమున జెదరినది. హిమగిరితనయ మోముపై నల్లకలువలద్వయము నిమేషకాలము నిలిచినవి. వెంటనే సంబాళించుకొనినాడు. యోగదృష్టిని తన మనోదౌర్బల్యమునకు కారణ మూహించినాడు. మూడవకన్ను దెఱచినాడు. ఆమంటకు గిరికన్య మూర్ఛవోయినది. ఆమంటలో నాళీకపాదుడు మనోహరమంజులమూర్తి సౌందర్యము ముద్దగట్టినవాడు, నిత్యయౌవనుడు, మన్మథుడు నిలువెల్లమండి బూదియై కూలినాడు.

దేవాలయ మంతయు శైవగాథాపరిపూర్ణ మైనది. శివలీలల నమోఘముగ విన్యసించినారు. ప్రతిచిన్నవిషయము నతిశ్రద్ధగ గమనించుచు మలచినారు. జక్కన్న గర్భగుడిలోనికి పోయెను. అచట ద్వారమున కాకతిశిల్పమునకు భిన్నమైన యొక లతయొక్క చెక్కడమును చూచి యది యెవరిదై యుండు నని తలపోసి చివర కది

యిక్ష్వాకుల శిల్పముగా నెఱిఁగినాడు. గర్భాలయద్వారమునకు మెట్ల నిర్మాణము కూడ విచిత్రముగ నున్నది. మెట్లు మూడువరుసలై వలయాకారముగ నున్నవి. మూడువలయములును నొకదానికంటె నొకటి చిన్నవై నీలాశిలానిర్మితములై యున్నవి. జక్కన్న గుడిదాటి బయటికి వచ్చినాడు. గుడికి పశ్చిమభాగమున నొక మంటప మున్నది. ఆమంటపమున నారు స్తంభము లున్నవి. ఏడవ స్తంభమును కట్టవలెను. రెండుదళము లున్నచో రెంటిని కలిపి యేడవ స్తంభము కట్టవచ్చును. కాని యక్కడ నొకే దళ మున్నది. దానికి సప్తమ స్తంభావశ్యకత యేనో మరి ! జక్కన్న యాలోచింపసాగినాడు. ఏడవ స్తంభము కట్టి యేమిచేయవలెను ? కట్టి దేనితో సంధానించవలెను ? అసలా స్తంభ మీదళమున నెట్లు కలియును ? చాల తడవు చింతించినాడు. కట్టవచ్చు ననుకొనినాడు. పథకముకూడ వైచినాడు. అక్కడనుండి లేచి రామప్పచెఱువుకు బయలుదేరినాడు. చెఱువువద్దకు చేరువకు వెన్నెలలు వచ్చినవి. అదియొక మహాతటాకము. నేత్రాభిరామముగ నున్నది. దానియొడ్డున నొక రుద్రాలయ మున్నది. ఆ యాలయముననున్న శిల్పమంతయు నెఱ్ఱరాతియందు చెక్కఁబడినది. చెఱువుమొదట నొక మండప మున్నది. నాటిరాత్రి జక్కన్న పండువెన్నెలలో శిల్పపరీక్ష సేయుచు యోజించుచు కూర్చుండిపోయెను. ఎప్పుడు కునుకుపట్టెనో యేమో మెలకువ వచ్చుసరికి సరుణోదయాత్పూర్వసమయమునందలివైన తొలి తెలి వెలుఁగు రేకలు చెఱువునందు యుద్ధారంభసమయమున పదునువెట్టగా మెఱయుచున్న కత్తులవలె ప్రతిఫలించి తళతళ లాడినవి. జక్కన్న కాల్యములు నిర్వర్తించుకొని బయలుదేరినాడు.

X

జక్కన్న మూఁడుదినముల కోరుగల్లు నగరమును ప్రవేశించి నాడు. ఆయన సప్తమప్రాకారమునొద్ద బయలుదేరి సరిగ నేఁడు దినము లైనది. అనఁగ నది యేడవరోజు. జక్కన్న ముందుగ వెలిపాలె మును ప్రవేశించెను. వెలిపాలెమున నస్పృశ్యజాతులవారు నివసింతురు. అచ్చట సంతలు గలవు. అందు స్త్రీలు సర్వముల్లైన వస్తువులను అమ్ముచుందురు. జక్కన్న ఆ వెలిపాలెమును గడచి మోహరివాడ లోనికిఁ బ్రవేసించుటకై చుట్టు నున్న యగడ్తను దాటి వంకదారిగుండ వారణఘటాఘోటకశకటికాభటకోటిసంకుల మైన రాజమార్గమును దరియవచ్చినాడు. మోహరివాడ బాహ్యకటకము నందున్నది. ఇది మట్టిగోడకును రాతిగోడకు మధ్యభాగమునం దున్నది. మట్టిప్రాకారపు ప్రధానద్వారమును సమీపించి లోనికిఁ బోఁదొడఁగినాడు. అచట కాపున్న సైనికభటు లాతనిని లోనికిఁ బోకుండ నిలువరించిరి. జక్కన్న ముందునకు పోబోయినాడు. భటుల కేమి చేయవలెనో తోఁచుటలేదు. ఆయనరూపమున మహిమ గోచరించుచున్నది.

ఒకభటుడు :— మీరెవరు మహానుభావా ? అట్లనుజ్ఞ లేనిదే పోరాదు. మీరెవరో తెల్పి యెందులకు వచ్చితిరో తెలియఁబరచినచో నేమైన చేయగలము. లేనిచో నింతియే.

రెండవభటుడు :— స్వామి ! తా మెవరో సెలవీయరాదా ?

జక్కన్న పరమాభిమాని. ఆతనకు తన్ను భటు లట్లడుగ నిలిచి మాట్లాడుటయే యపకీర్తిగ నగపించినది. కాని రాజసంబంధ మైన విషయము, మాటాడక తీరదు. అయినను వా రేమి చేతురు ! కేవలము వారు భటమాత్రులు,

జక్కన్న :— నా పేరుతో మీ కేమిపని?

భటుడు :— పేరు చెప్పక పోయిన మానె పోనీ మీ వచ్చిన పనిఁ దెలుపుడు.

జక్కన్న :— నేను శిల్పాచార్యుడను తెలిసినదా?

భటుడు :— తమకుఁ గోటలో నే పని? సెలవిత్తురా?

జక్కన్న :— కోటలోని బంగారపు టరఁటిచెట్టునకు మరొక బంగారపు టాకును చేయుటకు వచ్చితిని.

భటు లందరు విచారపడినారు. ఇంతటి రూపవంతుడును పిచ్చివానివలె నున్నాడే. ప్రకటన చదివి కూడ నాయన యాకుఁ జేయుటకు వచ్చిరన్నచో నాయన నిజముగ మతిభ్రమ కలవాడై యుండు నని వారు తలపోసిరి. అట్లు వచ్చుట చచ్చుటకా బ్రతుకుటకా యనుకొనినారు. ఈతనితో మన కెందుకు పోని మ్మనుకొని దారి విడిచినారు. ఏ పుట్టలో నే పా మున్నదో. జక్కన్న కవమాన మైనంత బాధ కలిగినది. ప్రధానద్వారముదాటి లోనికి బోవ నారంభించినాడు. జక్కన్న యూరంతయు తిరుగ సాగినాడు. పల్నాటి వీరగాథలను పాడుచున్న వేటకాండ్ర నవలోకించినాడు. ముందునకు నడచి యచట నందనమాలికాసహస్రసందానితమైన యేకవీరాదేవి దేవళమును జొచ్చి హ్రీంకారమధ్యప్రీడాశూన్యకటీరమండల మైన ఏకవీరాదేవిని దర్శించినాడు. ఈఏకవీర పరశురాముని తల్లియైన రేణుకాదేవి యవతారము. తరువాత ముమ్మడమ్మగుడి నుపలక్షించెను. జక్కులవారియొక్కయు మైలారు భటులయొక్కయు జాతరలు సల్పుటలు గాంచెను. మైలారుభటులు మహాసాహసికులు ఘోరవీరశైవమతావలంబులు. వారు శివప్రీతికై నయనోత్పాటన, శిరశ్ఛేదబీజచ్ఛేదాది

విపరీత కార్యములకై నను వెనుదీయనివారు. చముడేశ్వరీశక్త్యాలయము, బౌద్ధవిహారము, ముసానమ్మగుడి, పాండవులగుడి తిలకించినాడు. మధ్యాహ్నపుటెండ మండిపోవుచున్నది. జక్కన్న యెదురుగ నున్న మహాభైరవస్వామికి నమస్కరించి స్వయంభూకేశవస్వాములకు మ్రొక్కినాడు. ప్రతాపరుద్రధరణీవిభుని మోసాలయందలి గడియారము పదునాల్గు గడియలు కొట్టినది. మధ్యాహ్నము పన్నెండుగంట లైనది. అంత దనుక నూరెల్ల తిరిగినాడు. వేశ్యవాటియంతయు మిక్కిలి కోలాహలముగ నున్నది. వేశ్యాంగనాసమూహము చిత్రచిత్రవర్ణముల వసనముల ధరించి విచిత్రాభరణముల దాల్చి నానావిధ పరిమళద్రవ్యముల మేన నలందుకొని మన్మథసేనవలె మార్గమువెంట బోవుచున్నారు. వారికి ముందుగ మంగళతూర్యనినాదములు సన్నాయి డోలు ఢక్క మర్దళాది నానావిధ వాద్యవిశేష ఘోషలు మిన్నంటునట్లుగ మ్రోయించుచు వాద్యగాండ్రు నడచుచుండిరి. ఆవెనుక దాసదాసీజనము పసుపు కుంకుమలు పూలు మిఠాయిలు కలిగిన పళ్ళెరములను కర్పూరతాంబూల కరండములు పట్టుకొని నడచుచుండిరి. ఇంకను వెనుక కొందఱు జనులు వివిధాంబరాలంకృతులు రా సాగిరి. జక్కన్న యా సమూహమును జూచినాడు. ఆయుత్సవ మేమో తెలియలేదు. దేవదేవీ విగ్రహము లేవియును లేవు. పెండ్లి యూరేగింపు కాదది, మ రేమై యుండును? ఆయనప్రక్కన నడచుచున్న యొక పెద్దమనిషి నదియేమని యడిగినాడు. అది చిత్రశాలా ప్రవేశమహోత్సవ మని యాయన చెప్పినాడు.

జక్కన్న :— ఈ చిత్రశాల యెవరిది?

పెద్దమనిసి :— మాచల్దేవిది.

జక్కన్న :— మాచల్దేవి యెవ్వరు?

పెద్దమనిసి :—

శా. ద్వీపాంతంబున నుండి వచ్చితివె భూదేవా! ప్రశాంతం మహా
పాపం సర్వజగత్ప్రసిద్ధసుమనోబాణాసనామ్నాయ వి
ద్యోపాధ్యాయప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెరుంగనయ్యెదవె మాచల్దేవి వారాంగనన్!

ఆమె యీనగరమునందలి వారవనితలయందఱయం దగ్రగణ్య. కావలసినంత రాజాదరణ మున్నది. ఆమె తనకొరకు ప్రత్యేకముగ నీచిత్రశాల నిర్మింపఁజేసికొనినది. ఆ చిత్రశాలామహోత్సవ మీనాడు జరుగఁబోవుచున్నది. ఆ యూరేగింపదియే" అని ఆయన దారిన యాయన పోయెను.

జక్కనకీ విషయ మాశ్చర్యముఁ గల్గించినది. వారవనిత కొక ప్రత్యేక చిత్రశాలయును ప్రవేశమహోత్సవమునా? ఆయన కంతయుఁ బరమాద్భుతముగ నున్నది. తానుగూడ నుత్సవదర్శనోత్సుకమతియై వారివెంటఁ బోవఁ దొడఁగెను. ఆయుత్సవముసాగి యొక సుందరమైన మంటపపు బహిర్భాగమున నాగినది. మంటపమునం దంతకుముందే ప్రవేశోత్సవమునకు వలయు సర్వసంభారములు సమృద్ధముగ నమర్పబడియున్నవి. ఉత్సవము వెంట వచ్చిన జన మంతయు మంటపమునందు యథోచితాసనముల నుపవిష్టులైరి. నూత్న చిత్రశాలను దర్శించు నపేక్షయు, సంభావనాపేక్షయుఁగల్గివచ్చిన బ్రాహ్మణబృందముచే, మంటపము క్రిక్కిరిసి యున్నది. మంటపమష్టాస్యము. మంటపమునకు బహిరంతర్భాగములనం దంతటను శిల్ప మనల్పముగ విరాజిల్లుచున్నది. మంటపాంతర్భాగమున మండపమునకు నడుమ చిత్రచిత్రములుగ చిత్రించఁబడి సుందరములై జలపూరితములై మామిడి మండ లుంచబడిన మూఁడు ఘటాకృతిగల సువర్ణకలశము లుంచబడినవి.

అచ్చటి నేలయందంతటను రంగవల్లులను దీర్చిరి. సాంబ్రాణి, అగురు, కర్పూరము కాచపాత్రికలయందుంచి మంటపమున నచ్చటచ్చట నిలిపిరి. వానియందుండి వెలువడిన ధూమరేఖలు మంటపమున చిఱుమబ్బుల సృష్టించుచు నచ్చటి శిల్పమును గంధర్వలోకమునందలి శిల్పమువలె కన్పించునట్లు చేయుచుండెను. మంటపముచుట్టును పెద్దవైన తాటియాకుల పందిళ్ళు వేయబడి మామిడితోరణములు, తామరపూలు, కలువమొగ్గలు పాదరసపుబుడ్లు కట్టబడి మనోహరముగనున్నది. శుభముహూర్తము సమీపించుచున్నది. మాచల్దేవియింకను రాలేదు. బ్రాహ్మణులు తొందరపడుచున్నారు. అచట ప్రజలందరు ద్వారదేశస్థిరీకృతనేత్రద్వయవీక్షణము కలవారైరి. వారవనితాజనము దాసీసకరము తొక్కట పడుచు ప్రధానద్వారబంధమున నల్లకలువల తోరణములగట్టినట్లు దృష్టుల నేకీకరించిరి. దూరమున మాచల్దేవి యొక పాలకినెక్కి వచ్చుచున్నది. ఆమె వెంట నిరువదిమంది పరిచారికలు ఏకవర్ణవస్త్రధారిణులు పాదచారిణులై యరుదెంచుచున్నారు. ఆమె వచ్చి పాలకిదిగినది. పదిమంది పరిచారిక లెజ్జనీరెత్తి పట్టిరి. కాలు కడిగిరి. ఆమె లోనికి ప్రవేశించినది. అప్పటికే సమయము మించిపోయినది. బ్రాహ్మణులు గృహప్రవేశసమయమంత్రములు పఠించిరి. చక్రవర్తి యింకను రాలేదు. శుభఘటికలు దాటిన ప్రయోజనములేదు. మాచల్దేవి కేమియు తోచుటలేదు. మనస్సునకేదో బాధకలిగినట్లైనది. బ్రాహ్మణులు సమయము సమీపించుచున్నదనిరి. ఆమె మొదలుపెట్టననుజ్ఞ నిచ్చినది. మాచల్దేవి ఆ మూడు ఘటముల పూజించినది. పురోహితబ్రాహ్మణుడు లేచి యా మూడు ఘటములలోని నీరము నొకదానియందు సమీకరించి పుణ్యాహవాచనమంత్రముల పఠించి యా మంత్రించిన జలమును మంటపము నలువైపుల చిలుకరించెను. ప్రవేశవిధి పూర్తి యయినది. అటుతరువాత మాచల్దేవి భూరిసంభావ

సల నిచ్చి బ్రాహ్మణబృందమును సత్కరించినది. తమ జాతివారందరకు విలువైన పుట్టములు ధరింప నొసంగినది. బీదల కన్నదాన మొనర్చ బడినది. ప్రవేశమహోత్సవము నాటికి పూర్తియైనది. అది యట్లు మూడు దినములు జరుగును. చూడవచ్చిన వారంద ఱాకరాకరే విడలిపోయిరి. జక్కన్న మంటపము నంతయును పరిశీలన మొనర్చ లేచి బయలుదేరినాడు. మాచల్దేవి మనస్సు చక్రవర్తి రాననందులకు పరిపరి విధములైన భావనల పొందుచున్నది. ఆమె మహారాజు రాకను నిరీక్షించుచు ప్రధానద్వారము వైపునకు నడచినది. ఆమెకు మధ్యన జక్కనాచార్యు డెదురైనాడు. ఆమె యతనిని జూచి యట్టె నిలబడిపోయినది. ఆమె తన యిరువది మైదేండ్ల జీవితమున నింతయందమైన పురుషు నెచ్చటను చూడలేదు. అమె యెత్తిన రెప్పవాల్చక చిత్రించిన చిత్రమువలె నిలబడి యాతని ముఖమునే వీక్షించుచున్నది. జక్కన్న తన దారి కెదురుగ వచ్చిన మాచల్దేవిని జూచి యామె సాక్షాత్తు శిల్పము మూర్తి దాల్చి నిల్చినటుల భావించి నాడు. ఆమె నఖశిఖాపర్యంత మాయనదృష్టి నిగిడినది. ఆమె వియచ్చారిణియైన గంధర్వభామిని, పసుపుపచ్చని కౌశేయము గోచి పోసి కట్టినది. రక్తవర్ణపు పట్టురైక ముత్తియములు కుట్టబడిన దానిని లేతనబ్బురంగు వలిపమును మేలిముసుగు ధరించినది. విచిత్రముగ వేణీబంధ మమర్చినది. ఆమె యా వేణీబంధముపై నొకవంక కే విక సించి గాన్పించునట్టి వితత మను పూలసూలను ముడిచినది. కర్ణముల ఆవేద్యముల నుంచినది. బాహువులకు బంధనీయములను పాదములకు హైంద్వములను నడుమునకు బిళ్ళల మొడ్డాణమును మెడయందు గుమ్మడి గింజలదండ, కాసులపేరు, త్రిసరమును, నక్షత్రమాలికను ధరించినది. పదివ్రేళ్లకు నుంగరము లుంచినది. సోగదేరిన కాటుకకన్నులు కలది. నాతిదీర్ఘమై హ్రస్వముకాని సముసుందరమైన నాసిక కలది. ప్రవా

ళోష్ఠను, ఫాలమున మెఱయుచున్న పద్మాకృతిగ పెట్టబడిన తిలక రేఖలదానిని, చామనచాయ మేనుకలదానిని, జగన్మోహినీ మూర్తిని జూచి వెఱగందినాడు. అనిమేషుడై యామె నవలోకించుచున్నాడు. వారి నేత్రములు నాల్గింటి కేకత్వ మబ్బినది. వారియొడల్లు వారికే తెలియని స్థితియందున్నారు. తమ్మెవరైన నట్లు చూచుచో నెట్లుండును. ఏమనుకొందు రను ప్రశ్నల కచట స్థానము లేదు. సమయము దొర్లుచున్నది. ప్రక్క ద్వారమునుండి చక్రవర్తియైన ప్రతాపరుద్రుడు వచ్చినాడు. జక్కన్న మాచల్దేవుల నాయన యట్టిస్థితి యందు జూచెను. వారి కాయన రాకయే తెలియుట లేదు. పరస్పరాలోకనాకుతూహలావిష్టమతులైన వారిరువురకును బాహ్యజ్ఞానము నశించినది. జక్కన్న కన్నులనిండ మాచల్దేవి. ఆమె కన్నులనిండ జక్కన్నయు నైనారు.

చక్రవర్తి యొక క్షణమాత్ర మట్లె నిలబడి, వారిని జూచినాడు. వారిలో నేమాత్రపు కదలికయు లేదు. చక్రవర్తి కనుగొలంకుల కెంపుజీరలు పరువు లెత్తినవి. ఆయన యొక్కసారి జక్కనను జూచినాడు. వెనుతిరిగి పోయినాడు. జక్కన్న మాచల్దేవిమనమున విచిత్రభావనలకు తావొసగినాడు. ఆమె కాయన మానవమాత్రునుగ కనిపించుట లేదు. దివిజలోకసంభవునివలె నున్నాడు. అగ్నిదేవుని వంటి తేజోవిభవము కలవాడు. అతని నేత్రములయందలి నైర్మల్యము నాలోచనాశక్తి యామెను ముగ్ధ మొనర్చినవి. అతని మోమున దోబూచు లాడుచున్న బ్రహ్మతేజోమిళితమైన దేవతాత్వపు చిన్నెలామెకు నాశ్చర్యమును భీతిని గలిగించినవి. ఇట్లొకరి నొకరు చూచుచున్న జక్కన మాచల్దేవులలో నొకరి కింకొక రెవ్వరో తెలియదు. వారెవరో తెలిసికొనవలయు నన్న యూహాలే లేవు వారికి.

జక్కన్నకు తనమనస్సులోఁ బరిణతమైయున్న స్త్రీదేవతామూర్తి రూపొంది తనయెదుట నిలిచిన ట్లుండెను. మాచల్దేవికి తన మనస్సులో భావనాసక్తమైన పురుష దేవతామూర్తి రూపొంది తన యెదుట నిలిచిన ట్లుండెను. జక్కన్నకు అట్టి స్త్రీమూర్తిని తాను చెక్కవలె ననిపించినది. మాచల్దేవికి అట్టి పురుషమూర్తిని తన చిత్రశాలలో నుంచవలె ననిపించినది.

ఇంతలో నిద్రటికి సమాధి జారిపోయినది.

ఆమె మనస్సాతనియందే లగ్నమైయున్నది. జక్కన్న కామె గంధర్వభామినివలె నున్నది. ఆమె యాయతసితోత్పలశ్యామలాంగి సౌందర్యపుత్తళిక. ఆమె నేత్రాంతములనుండి కాముకీజనసహజాలసదృష్టులు సోగలై జాలువారుచున్నవి.

వారిరువురి మధ్య పదినిముసములు గడిచినవి. ఇరువురు ఒకరికొకరు నదృష్టపూర్వులు. ఇరువురు మౌనమూర్తులు. ఒకరికొకరు తెలియబఱచుకొనుటలు జరుగలేదు. పరస్పరవిలోకనానందముగ్ధులగువారి కిరువురకును ఒకరియం దొకరికి చిరకాలపరిచితి యున్నట్లు భాసిల్లినది.

మరికొంతసేపటికి నీసమాధి పూర్తిగా జారిపోయినది.

జక్కన్న హఠాత్తుగా వెనుదిరిగి నెమ్మదిగ నడచుచు వెడలినాడు. అపుడు మాచల్దేవికి చక్రవర్తి రాలేదన్న సంగతి జ్ఞప్తికి వచ్చినది. పరిచారికల నడిగినది. వారిలో నొకరిద్దరు చక్రవర్తి వచ్చెనని శిల్పములను చూచుచుండెనని చెప్పిరి. మాచల్దేవికి మనస్సులో నేదో తనకు గల శిల్పభావనాసర్వస్వము ఫలించినట్లు తృప్తి యొకటి తోచుచుండెను. ఆతృప్తి యామెకన్నులను ధగధగ లాడించుచుండెను.

## ౬

నాడు చిత్రశాలాప్రవేశ మహోత్సవపు చివరిదినము. ఉత్సవము జరుగుచునే యున్నది. మంటపముచూడవచ్చిన జనసమూహముచేఁ గ్రిక్కిరిసి యున్నది. అందలి శిల్పసంపదను సందర్శించి యానందించి శ్రోత్రసంగతు లేవైన నున్నచో వాని నలవరచుకొనుటకై రెండు మూడు వేల శిల్పులువచ్చి చూచువారు పోవువారుగ నుండిరి. ఆమంటప మున శిల్పము రెండురకములుగ నున్నది. ఒకటి కుడ్యగతశిల్పము. రెండు శిలాగతము. కుడ్యగతమైన శిల్పమంతయు కృష్ణగాథామయమై యొప్పుచున్నది. సాయంసమయవేళా కళింగజాతీరవృక్షాగ్రవినిర్గత సుమధురవంశీనాదవశతన్మయీభూతార్ధ నిమీలితనేత్రాపాంగారోచిః పుంజములవారు, స్నానసమయపరివర్జితవస్త్రసంచయులు, వ్రీడాశూన్య కటీరమండలలు, జఘనదఘ్నోరుదఘ్నవక్షోదేశదఘ్నవారి స్థితులు నొందఱు గోపికలు చెట్టపట్టాలుగ కాళిందీనీరమున జలక్రీడ లాడ దొడఁగిరి. వర్షాప్రారంభవేళానవనీలజలధరములవోని మేని తళతళల వాడు, శారదయామినీలసత్తారకానివహములవంటి కడగంటిచూపుల వాడు, మధుమాస మాకందతరుశాఖికానవకోకిలాప్రథమకూజితము వలె తియ్యనయిన వేణునాదము కలవాడు నయిన కృష్ణస్వామి తన చిఱుమువ్వల కుణుకుణునిక్వణము పైడిగంటల కలకల ధ్వనులవలె నొప్ప వృక్షశిఖరాగ్రమునుండి దిగివచ్చి తీరమున నిలబడినాడు. గోపీ వస్త్రముల నపహరించినాడు. గోపికల కా చిన్నకృష్ణరూపమున శృంగారభావములు తెలలుసూపినవి. వారు కామవికారలైరి.

పూర్ణిమానిశ. యమునా తీరమున అర్ధరాత్రమున కృష్ణ విరహిణియై రాధిక విషాదగీతిక నాలపించుచున్నది. దిక్కులన్నియు నిశ్శబ్దములుగ నున్నవి. ఆమె విషాదగీతి యమునా తరంగములపైఁ

బారాడి కృష్ణునికి చాత్యమును తెలిపినది. కృష్ణుడు వేణువునూది నాడు. రాధ కన్నులు వికసించినవి. కన్నులింతలు చేసుకొని చూడ సాగినది. కనకాంబరధారి, వనమాలి, శిరోగ్రభాగస్థమయూరపింఛము వాడు, తెలిముత్తియముల కర్ణాభరణములవాడు, కస్తూరితో తీర్చి దిద్దిన త్రిరేఖలు కలిగిన తిలకమువాడు వెనుకనుండివచ్చి రాధను కౌగిట చేర్చి పెదవి చుంబించినాడు.

రతీమన్మథరహఃక్రీడలు, గౌతమాశ్రమము నందైన అహల్యా సంక్రందన మన్మథ సల్లాపము, తారాశశాంకుల ప్రేమ కథనము, పారిజాతాపహరణము షోడశసహస్రగోపీపరివృతుడై సల్పిన జలక్రీడలు మొదలైన వెన్నో శృంగారచిత్రముల నతినైపుణ్యమున మలచినారు. కుడ్యగత శిల్పమంతయు శృంగారరసప్రధానమై యున్నది.

శిలాగతశిల్పము భైరవస్వామి ప్రముఖులు గణపతి వీరభద్రుడు మొదలైన శైవదేవతా సంబంధమై యొప్పుచున్నది.

మంటపపు ప్రధానద్వారమున కిరువైపుల త్రిభంగ్యాకృతిగ నిల బెట్టబడిన యక్షయక్షిణీవిగ్రహములసమానములై మెఱయుచున్నవి. జనము వచ్చుచునే యున్నారు. గురుకుండలములవారు, ఆనాభిలంబ మాన యజ్ఞోపవీతములవారు, ఫాలభాగమున విభూతి రేఖలవారు, గోష్పాద పరిమాణ కేశములవారు, బంగారు కడియములుంగ్రముల వారు, రొంటిదోపిన వెండిపొడుము కాయలవారు నల్లురు ప్రసిద్ధశిల్పా చార్యులు మంటపములోనికి వచ్చుచున్నారు. వారు నల్లురొక్కొక్క శిల్పమును పరిశీలించి చూచుచు నడచుచున్నారు. ఐక్కన్నకూడ వారివెంట నడచుచున్నాడు. కొంతసమయము గడచినది. ప్రతాపరుద్ర చక్రవర్తివచ్చినాడు. చక్రవర్తి మహాపురుషునివలె కనిపించినాడు. కాని చక్రవర్తికుండవలసిన యలంకరణాదులు లేవు. నల్గురుశిల్పులు ఆయనకు

నమస్కరించినారు. జక్కన్న ఆయనయే చక్రవర్తియని యనుకొనలేదు. నమస్కరించలేదు. ఆ నల్గురి శిల్పుల యందొకశిల్పి యచ్చటి శిల్పవిభవమును మిగుల ప్రశంసించుచు నచ్చటియొక విఘ్నగాథనుగూర్చి యనినాడు. "జాతవేదీ! చూచితివా! ఈకాళియమర్దన ఘట్టమెంత సహజముగ లలితముగ చెక్కినారో! నాగరాజైన కాళుడు తన జిహ్వాంచలములనుండి విషాగ్నికీలల నుమియుచుండుట, ఆపైని తాండవకృష్ణునిలో కొత్తసౌందర్యాకృతి. ప్రక్కల నాగరాజు భార్యలు నూరు పర్యంత భాగోరగాకృతులు నచ్చటినుండి శిరోదేశపర్యంత మానవాకృతులు! బహురమ్యముగ నున్నదీశిల్పము!"

జాతవేది:— ఔను ప్రజాపతీ! నీవనిన ట్లది రమ్యాకృతియె యగును. ఆవిఘ్ననాయకుని చూడుము ఆవిగ్రహమును చెక్కుటయందెంత నేర్పును కనబరిచినాడో! గజముఖుడైనను అత్యంతసుందరుడుగ నున్నాడు.

ప్రజా:— సమవర్తి దేనినో దీక్షగ పరిశీలించుచున్నా డది యేమిటో!

సమవర్తి:— మనసప్తార్చికి నీ గిరిరాజసుతావిగ్రహము మిగుల నచ్చినది. అత డదేపనిగ నావిగ్రహము నవలోకించుచుండుటచే జేసి నేను కూడ చూడనరిగితిని. నిజముగ నది సాక్షాత్తు సజీవమూర్తియై మనయెదుట నిలబడియున్న ట్లున్నది.

నలుగురును, నావిగ్రహమును దరియజేరిరి. జక్కన్న వారిప్రశంసలను వినుచునేయున్నాడు. ఆయనయు నాశిల్పములను వారుపరిశీలించిన యంత జాగరూకతతో పరిశీలించెను కానివారితో సంభాషణ కలుపలేదు. తనదారి తనదిగ తనకు వారితోడి సంబంధ మే మున్నట్లు మూకీభావముగ నూరకొనెను. కాని వాడు మిక్కిలి కోపియాడు

చున్న యీ దేవీ విగ్రహమునందాతని కేదో శిల్పగత దోష మగుపించినది. వారిప్రశంసలవిని యూరకొనజాల కిట్లనినాడు. "మీరంతగ మెచ్చుకొనుచున్నారు. దానియందంత శిల్పనైపుణి యేమున్నది? పై పెచ్చు దోషములు కూడ నున్నవి."

వారినల్గురకీ జక్కన్నమాట లాశ్చర్యమును కోపమును కల్గించినవి, వారు దోషములను చూపుమని యాతని నడిగిరి.

జక్కన్న :- ఈవిగ్రహము నిర్మించినవానికి విగ్రహనిర్మాణము సరిగ తెలియదనుకొందును. దేవివిగ్రహ మష్టతాళ ప్రమాణగతమై యుండ, విగ్రహము పై భాగము మూడుత్రస రేణువు లెక్కువగనున్నది. అసలిచ్చటి శిల్పమునం దంతటదోషములుబహుముఖీనములై యున్నవి. ఆ కిన్నరవిగ్రహము నవతాళప్రమాణమైయుండ నెనిమిది తాళముల యయిదులిఖ్యముల కొలతనే యుపయోగించినాడు. మరియొకచోట శిలాగత దోషమును జూపించి యావిగ్రహమునకు శిల్పము పనికిరాని గర్భిణీ శిల నుపయోగించినా డనెను. పుంస్త్రీ శిలలలో నేవిగ్రహమునకే శిల వాడవలెనో యిచ్చటి శిల్పులకు తెలియలేదనెను. వీరభద్రవిగ్రహమున కూర్ధ్వభాగము గొప్పదై కిందుభాగము జబ్బుగ నున్నదనెను. దేవి విగ్రహములకు స్తనమునకు స్తనమునకు మధ్యగల దూర మిరువదియొక్క యంగుళులై యుండ యిరువదియే యుంచెననెను. వీరాసన యోగ్యమైన యొకవిగ్రహమును సిద్ధాసనస్థునిగ జెక్కెననెను. భుజంగినీ ముద్రయందుండవలసిన స్త్రీవిగ్రహమునకు అశ్వినీముద్ర వైచినాడు అనెను.

జక్కన్న విమర్శించినంతసేపును నల్గురు శిల్పుల కోడలు దహించుకొనిపోవుచున్నది. నిజము తేల్చుకొనదలంచి జక్కన్న చెప్పిన రీతిగ నావిగ్రహముల గొలిచి పరీక్షించి యవి యాయన చెప్పిన ట్లుండు

టను కనుగొని యాశ్చర్యచకితులైరి. వీరి సంభాషణ యగుచున్నంత సేపును ప్రభు వచటనే యుండెను. వచ్చిపోవువారు వచ్చిపోవుచునే యున్నారు. ప్రభు వీవంకనైన చూడలేదు. జక్కనమాత్ర మాయన వంకకే చూచుచున్నాడు. జాతవేది జక్కన్నను 'నీ వెవర' వని నాడు. జక్కన్న తన కథ నంతయు వినిపించినాడు. వారికి కోపము చల్లారినది.

సమవర్తి:— మీా రేమిపనిమీాద వచ్చినారు? మీారు జక్కనాచార్యుని ప్రపౌత్రులని మాకు తెలియనే తెలియదు. కావుననే యట్లు చూచుచుండగనే శిల్పగతదోషముల చదివివైచితిరి.

జక్కన్న :— సప్తపర్ణిని అష్టపర్ణినిగ జేయుటకై వచ్చితిని.

ఈమాట విని వారునల్వురు జక్కన్నను మిక్కుటముగా గౌరవించినారు. చక్రవర్తికొఱకై మంటపమునలువైపుల దృష్టి పఱపినారు. ఆయన యంతకుముందే వెడలియుండెను. వారు జక్కన్న కాయనయే చక్రవర్తియని చెప్పినారు. జక్కన్న కాశ్చర్యమై యనినాడు. "ఆయన చక్రవర్తియా? అయ్యో! నాకాయన చక్రవర్తియని తెలియనేలేదు. మరల చక్రవర్తి దర్శన మంత సాధ్యమైన పనిగాదు. నగరాధ్యక్షుని యనుమతి తెప్పించుకొనగాని యాయనను చూచుటకు వీలులేదు." జక్కన్న కేమి చేయుటకును పాలుపోవుట లేదు. వారల సలహాల నడిగాడు.

ప్రజాపతి :— తమరు ముందుగ మాచల్దేవి దర్శనము చేయుకొంతేని యవసరము.

జాతవేది:— ఆమె సుముఖియైనచో మీాకు రాజసందర్శనము త్వరలో కలుగును.

జక్కన్న మాటాడలేదు. వారిమాట లన్నియు వినియువిన నట్లుగ నూరికొనినాడు. ఆయన తన మనస్సున మాచల్దేవిని చూడ వలెననుకొనినాడు. ఆ మాచల్దేవి యెవరు ? అస లామె యెట్లుండును. ఆవిడకు చక్రవర్తిపై నెంతయధికారమున్నది ! ఔ నెంతయు లేకున్నచో నింతటి చిత్రశాల నిర్మింపబడినది ? ఈ చిత్రశాల యొక్కటిచాలును ; ఆమెకు చక్రవర్తియెడగల చనవునకు నిదర్శనమాత్రముగనున్న దనుటకు. నగరాధ్యక్షుని యనుజ్ఞకన్నను నెక్కుడైనదా యీామె పరిచయము ? రాజ్యమున నాటదాని కింత ప్రాశస్త్యమున్నదా ? నిజముగ నంతియేనా ? కాకున్న వీరందరు నిట్లేల చేయుమందురు ? ఆమె నిజముగ నంతటిదే యయి యుండవచ్చును. జక్కన్న మాచల్దేవిని గురించి పరిపరివిధముల తలపోసినాడు. తాను, ఏమైనను, ముందామె దర్శనముచేసి తీరవలయు ననుకొనినాడు, కాని యీాయుత్సవములో నామె దర్శనము తనకు కలుగునో కలుగదో ! ఆమెయున్న స్థితినిబట్టి రాజదర్శన మెంత దుర్లభమో మాచల్దేవిదర్శనము నంత దుర్లభమే. ప్రక్కనున్న రాజును తాను తెలిసికొనలేకపోయినాడు. దూరముగనున్న మాచల్దేవిని తాను తెలిసికొనగలడా !

౭

అది యొక మహాసౌధము. చిత్రచిత్రములై యలంకారములచే మిక్కిలి శోభించుచున్నది. సింహద్వారము మనోహరముగ నున్నది. ద్వారమున కిరువైపులగల నాల్కలుచాచి పంజాలనెత్తిపట్టి లంఘించు టకు సిద్ధముగ నున్నట్లున్న సింహాకృతులు గంభీరములై సజీవప్రతిమల వోలె భయము గొల్పుచున్నవి. పెద్ద యినుపకవాటములు కలదా ద్వారము. ద్వారమున కిరువంకల వంక కిరువురు చొప్పున మొత్తము

నలుగురు భటులుండిరి. మొగలిపూపొట్టలోని లేతచిన్ని రేకుల తెలుపుదనముఁబోని తెలుపులైన తొలివెలుగువాకలా భవనమునకు మరింత ధావళ్యమును చేకూర్చుచున్నవి. అది నగరాధ్యక్షుఁడైన నాగయగన్న మంత్రి ప్రాధము. జక్కన్న నగరాధ్యక్షుని దర్శనముచేసి చక్రవర్తిని సందర్శించుట కాజ్ఞ సంపాదించదలచుకొని వచ్చినాడు. కావలిభటు లాయనను వచ్చినపని యేమని ప్రశ్న చేసినారు.

జక్కన్న :- అది మీకెందులకు ? నాగయగన్న మంత్రిగారి దర్శనము కావలెను. ఆయనతో మాటాడవలసియున్నది.

భటు :- అది యేమయ్యా ! వచ్చినపని యడిగిననే యింత గడుసుగ మాటాడుచున్నావు ? ఆపని యేదో చెప్పినచో నరిగి పోవుదువా ?

2 వ భటు :- అంత రహస్యమైన విషయమా ?

3 వ భటు :- నాగయగన్న మంత్రి కీయన నలపాలు తక్కువగ నున్నవి కాబోలు.

జక్కన్న కోడలు మాడుకొని పోవుచున్నది. తనకీయూరు వచ్చి నప్పటినుండియు నిట్లేయేవో యపశకునములుగ నవమానములుగ నున్నవి. తాను పనిమీద వచ్చినాడు. కార్యార్థి తాను. నెమ్మది తెచ్చుకొని యనినాడు. "నేను సప్తపర్ణిని అష్టపర్ణిని చేయుటకు వచ్చినా నని చెప్పండి." భటులు—"అయినచో సమయము చూచి నివేదింతుము, కూర్చుండు మని." జక్కన్న యచట నొకరాతిదిన్నెపై కూర్చుండినాడు. ఆతడు తనలో నిట్లనుకొనినాడు. తనకిదేమో సంశయాస్పదముగనున్నది. తనవచ్చినపని పూర్తి కాజాలదా ? అసలీ ప్రకటన చూచి యింతమంది శిల్పు లూరకుండఁ దగుదునని తానే యేలరావల

యును ? కాకున్న చక్రవర్తి స్వయముగఁ గంటబడినప్పుడు తాను గుర్తు పట్టలేకపోయినా జేమి ? అన లదే దురదృష్టముగ నున్నది. జక్కన్న మనస్సు పరిపరివిధముల పోవుచున్నది. రెండుజాముల కొక భటుడు వచ్చి జక్కన్న నొక స్వలంకృతమైన గదిలోనికి తీసికొని పోయెను. అచ్చట నొక యాసనమునం దొక సుదీర్ఘదేహుడు సుతీక్ష్ణ దృక్ప్రసారము కలవాడు విలువమైన చీనాంబరముల ధరించినవాడు కోసలు దీరిచి మెల్లివైవబడిన కోరమీసములవాడునైన ఒక పురుషుని చూచి జక్కన్న ఆయనయే గన్నమంత్రిగ ననుకొనెను. గన్నయ్య జక్కన్నను చూచినాడు. జక్కన్న యాతనివంకకై యేదో చెప్ప బోయినాడు. మాట నోటనే యున్నది. గన్నయ్య వెను దిరిగెను. వా రిరువురిమధ్య సుమారు రెండుగంటలు గడచినవి. ఆయన యొక్క మాట మాటాడలేదు. తానేదో పనిమీద వెళ్ళిపోయినాడు. జక్కన్న యటులనే గన్నయ్య మఱల వచ్చునని ప్రతీక్ష సేయుచుఁ గూర్చుండి పోయినాడు. ఆయన మఱల రాలేదు. ప్రొద్దు తిరుగువఱ కచ్చటనే యున్నాడు. భటు లెప్పటికప్పు డిదిగోవచ్చు నదిగోవచ్చునని గడపిరి. చివరకు చక్రవర్తి దర్శనమునకు వెళ్ళెను, నాటి కిక రాడని తేలినది. జక్కన్న కాదినము పగలెల్ల భోజనము లేదు. పచ్చిమంచినీరైనఁ ద్రాగలేదు. ప్రతీక్ష సేయుటయందే గడచినది. అక్కడనుండి లేచి యూరివెంట బయలుదేరినాడు. సాయంకాలము కావచ్చుచున్నది. జక్కన్న శిల్పివాడయందు తిరుగుచున్నాడు. శిల్పివాడయం దంద రును విశ్వబ్రాహ్మణులు. పదిహేనువందల శిల్పిబ్రాహ్మణ కుటుంబము లున్నవి. వారందఱకు శిల్పము చెక్కుట నిత్యము జరుగు పని. వారు శిల్పగతైకజీవులు. పదియేండ్లబాలుడు మొదలుకొని నూరేండ్ల ముదుసలివఱకు ఉలిచేతబట్టి యేదో శిలపై నేదేని శిల్పమును చిత్రించు చునే కానుపింతురు. సాధారణముగ ప్రతి శిల్పికిని ప్రత్యేకముగ

న్నొక శిల్పమందిర ముండును. ఆమందిరము వంశపరంపరగ తండ్రినుండి కొడుకునకు, కొడుకునుండి మనుమనికి సంక్రమించుచుండును. శిల్పి కుటుంబములం దాదువారుకూడ శిల్పము చెక్కు టక్కడక్కడ కాను పించును. జక్కన్న యావాడ కుండ నడచిపోవుచున్నాడు. ప్రతియింటి లోనికి చూచుచు పోవుచున్నాడు. చాలావరుసలు గడచి చివరి వరుసను సమీపించి ఆవరుసనుండి నడువఁదొడఁగెను. ఆవరుసయందు కొంత దూర మేగినపిమ్మట జక్కన్న యొక యింటిముం దాగిపోయినాడు. ఆ యింటియం దొక కుఱ్ఱవాడు విగ్రహమును చెక్కుచున్నాడు. అత డతిశ్రద్ధగ దీక్షగ విగ్రహమువంకనే దృష్టినిలిపి చెక్కుచున్నాడు. ప్రతి యొక్క యులితాకుడునకు నీలశిలాఖండములు నలిపేళ్ళవలె నెగిరి పడుచున్నవి. వీరభద్రునిదివలె నున్నది. మహాభయంకరాకారము. ఛాదాపుగ విగ్రహము చెక్కుట పూర్తియైనది. ఉలిపిడిమీఁద గడ్డము నాన్చి విగ్రహమువంకకు చూచుచున్నాడు. ఆ బాలుని మోమున నావిర్భవించిన స్వేదబిందువులు తామరాకునందలి నీటిబిందువులవలె మెఱయుచున్నవి. నాల్గుచేతులు, శూలము చాపము డమరుకము కమండలువు, సిగ కమరిన కేశగుచ్ఛము, మెడలో రుద్రాక్షమాల. జక్కన్న కా కుఱ్ఱవానిని చూడగనే ముద్దయినది. లోనికిఁబోయి యాతని కెదురుగ నిలిచి కొంతతడ వాతనిని ఆవిగ్రహమును చూచి వాడు. కొంతసేపటికి బాలశిల్పి తలయెత్తి చూచినాడు. ఎదురుగ జక్కన్న రూపొందిన దేవతాతేజమువోలె నిలబడియున్నాడు. అతని మనస్సున జక్కన్నను చూడగనే యొక గురుభావ ముద్భవించినది. వెంటనే లేచి నమస్కరించినాడు.

బాలశిల్పి :— స్వామీ! తామెవరు? తమ్ముఁజూడగనే నాకు భగవత్సాక్షాత్కార మైనట్లున్నది.

జక్కన్న కట్టువాని భుజముతట్టి యనినాడు "నాయనా! నేను నీవంటి శిల్పికుటుంబములోనివాడనే. పద. నీశిల్పమును చూచివత్తము. మరచితిని. నీపేరేమి నాయనా?"

బా. శి:- స్వామి యందురు.

జక్కన్న:- స్వామి! ఎంతముద్దయిన పేరు! నిజముగ నాకుమారుని యంతటి యందగాడవు. మీతల్లిదండ్రు లెక్కడ?

స్వామి మోమున విన్నదనము పొడసూపినది? "మాకా భాగ్యములేదు? స్వామి కనుకొనల తిలప్రాయములైన కన్నీటిబొట్లు పొడసూపి చూచుచుండగనే ముత్తియములంతై జాలువారినవి.

జక్కన్న యాతని నోదార్చి అనినాడు — "మాకు" అనగా

స్వామి:- నాముద్దు చెలియలు 'చండి' యున్నది. — స్వామి చండిని కేకవైచినాడు. చండి వచ్చినది. వచ్చుచునే జక్కన్నను చూచినది. ఆమె కనులలో నేవో తీయని తలపులు గూడుకట్టుకొనినవి. జక్కన్న చండిని చూచినాడు. శరత్కాలమునందలి సంజ మొగమున నాడిన చిన్ని తొలిమొయిలుకన్నెవలె నున్నది. మొగలిపూపొట్టలోని తొలి లేతరేకువలె నున్నది. నిడుదలైన కనుదమ్ములు విశాలమైన ఫాలము ఒకింతహ్రస్వమైనను సుందరమయిన నాసిక కొనదేరి ముద్దులు గులుకుచున్న చిబుకము క్రీబెదవి కొలదిగ వంగి మలయాళ దేశపు సుందరివలె నున్నది. సన్నని దేహము గలది. ఆమె కన్నుల లోని యాకర్షణ యతిచిత్ర మయినది. ఆమెను చూచిన చాలు; నామెను ప్రేమింపనివా రుండరు. స్వామి కన్నియు తల్లిగుణము లబ్బినవి. చాల నెమ్మనయినవాడు. వాని ముఖమున నెల్లపుడు ప్రసన్నత తాండవించుచుండును. అతని మొగమున బాలికాసౌంద

ర్యము మిళితమై మనోహరముగ నుండును. చండియం దట్లుగాదు. చండి పురుషభావముల కాటపట్టు. ఆమె మాటయం దొకింత పౌరుషము మృదుకాఠిన్యము కానుపించును. ఆమె నడవడి ఊహలు సంభాషణ సర్వమును పౌరుషప్రధానములై యుండును. స్వామి యాడుపిల్లయై యామె మగవాడైన నెంతబాగుండునని వారితల్లిదండ్రు లనుకొనెడివారు. స్వామి చండిని తన చిన్నతమ్మునిగ భావించును. చండి యనిన శిల్పివాడయందంతటను చాలాప్రేమ. వారి కీమె చిలిపితనము చిలిపితన మనిపించదు. ఆమె పదునారేండ్ల యువతి. ఆమెకు తాను యౌవనవతి సౌందర్యవతి యైన బాలిక యనుభావమే లేదు. ఆమెయు అన్నవలె షికారు వెడలును. పనులు చూచును. బొమ్మలు చెక్కును. చిత్రములను గీయును. చండి భోజనముల నమర్పబోయినది. స్వామి జక్కన్నను తమ శిల్పమందిరములోనికి గొంపోయి యచ్చటి శిల్పమును చూపించెను. జక్కన్నకు స్వామి చెక్కిన శిల్పమున చేయి తిరిగినతనము కనిపించినది. ముందుముం దున్నతికి పోగల డనుకొనినాడు. జక్కన్న యచటి యొక శిలాప్రతిమను చూపించి యిది యేమనినాడు.

స్వామి :— ఇది ప్రియావిరహియైన గంధర్వుని ప్రతిమ. దీని యందు విషాదభావము తేవలె ననుకొనినాను. కాని కుదురలేదు.

జక్కన్న స్వామి చేతినుండి యులిని తీసుకొని యావిగ్రహమున లీలగా నొకదెబ్బ వైచినాడు. విగ్రహమున నద్భుతముగ విషాదభావము పొడసూపినది. స్వామి దిగ్భ్రాంతుడై జక్కన్న కాళ్ళపైబడి నమస్కరించినాడు. మీరెవ్వరో తెలుపుడని ప్రార్థించినాడు. జక్కన్న తన సంగతిని చెప్పలేదు. స్వామి జక్కన్నను మిగుల గౌరవింపదొడగినాడు.

జక్కన్న స్వామియింటనే నివసించుచున్నాడు. జక్కన్న అన్న, స్వామి తమ్ముడు. జక్కన్న తండ్రి, స్వామి కొడుకు. జక్కన్న యుజ

మాని, స్వామి సేవకుడు. చండిమాత్ర మెప్పుడును బాలికయే. చండికి జక్కన్నయం దొకవిధమగు ప్రేమవికారము. స్వామికి జక్కన్న సాక్షాత్తు విశ్వకర్మ. జక్కన్నకు స్వామిలోనున్న శిల్పప్రతిభ మహా ప్రేమస్థానము. చండి యొక మధురహాసరేఖ.

నెల దినములు గడిచినవి. జక్కన్న చక్రవర్తి దర్శనము చేయ లేదు. అన లాప్రయత్నమే చేయలేదు. స్వామి జక్కన్నతో నిట్లుచెప్పి నాడు. "ఇందులూరి యన్నయామాత్యునకు నాయందు మిక్కిలిప్రేమ. ఆయన చక్రవర్తికి పినతల్లి భర్త. ఆయన సింహాచలమున నుండును. ఆయన యిచటికి నెలదినముల కొకసారి వచ్చును. ఆ వచ్చినప్పు డాయ నతో చెప్పి ఆయన ద్వారమున దర్శనముచేయు నవకాశమును కల్గింతు నుగా." అని. జక్కన్న వల్లెయనినాడు. వారు దినమెల్ల శిల్పవిషయ ములు తర్కించుకొనుట, సాయంకాలముల వాహ్యాళులు వెడలుటలుగ నున్నది. చండికూడ వారిరువురతో కలసి పోవును.

నెలదినముల యీమధ్య యూరియం దెన్నియేని వింతలు పుట్టి నవి. చండి యెప్పుడు నింటిలోనే యున్నటు లుండును. కాని యూరి లోని వార్తలన్నియు సంగ్రహించుకొని తెచ్చును. చక్రవర్తి మాచల దేవి యింటికి వెళ్ళుట మానివేసినాడు. వారిరువురకు మధ్య నేవో కలతలు పుట్టినవట. ప్రభువు మాచల్దేవిమీద కక్షుబూనెనట. మాచ ల్దేవి మరింకెవరినో ప్రేమించినదట. అందువలన రాజున కామెపై నలుక వచ్చినది. ఆప్రేమించిన యాతః డొక శిల్పియట. చక్రవర్తి యొక నాడు మాచల్దేవి యెవరితోడనో మాటాడుచుండగ చూచెనట. చూచుటకు నూహించుటకు అందని విషయములగూడ చెప్పుకొన సాగిరి. చండి యీవింతవార్తల నాలకించినది. కొంపదీసి యాశిల్పి జక్కన్న కాదుగద యనుకొనినది. కాని వారితో చెప్పలేదు.

ఈవార్తలు లోకు లూరక కల్పించినారు. కాని వానిలోననే కొంత నిజ ముండు టాశ్చర్యకరముగ నున్నది.

ఉన్నటు లుండి స్వామి యనినాడు. — 'అన్నా! మాచల్దేవి దర్శనము చేయరాదా?'

జక్కన్న :— ప్రస్తుతము ఆవిడకు రాజునకు పడుటలేదని చండి చెప్పుచున్నదిగదా!

స్వామి :— ఆ శిల్పి యెవరో! — స్వామి మోమున నొక విచిత్రమైన మార్పు పొడకట్టినది. అది యంతలోనే మాయమైనది. ఆ మార్పు జక్కన్న యరమోడ్పుకనులఁ జూచినాడు.

మఱొకవారము గడచినది. ఊరిలో వార్త లల్లే ముదురు చున్నవి. జక్కన్న మరల నగరాధ్యక్షునిదగ్గరకు బోయినాడు. మరల దినమెల్ల నాయన ముంగిలియందు పడిగాపులుగాయగా బహు ప్రయాసమీఁద నాయన దర్శన మైనది.

జక్కన్న :— నే నిప్పటికే యొకసారి మీయొద్దకు వచ్చితిని. తా మప్పుడు చక్రవర్తి దర్శనమునకు బోయినారు. నేను తాము చేసిన ప్రకటన చూచి సప్తపర్ణిని అష్టపర్ణిని చేయుటకై వచ్చినాను. చక్రవర్తిని చూడవలె నని తమ యనుజ్ఞకొఱకై వచ్చినాను.

నాగయగన్నమంత్రి విన్నంతసేపును పెడమొగ మిడినాడు. ఇప్పు డెదురై యనినాడు. — 'నీ యంతట నీవు బంగారమును కొని యాకునుచేసి ముందు మాకు చూపించినచో అప్పుడు చక్రవర్తి దర్శనము చేయింతుము.'

జక్కన్న :— మీ ప్రకటనయం దట్లులేదే మరి!

నాగయ :— మేమిప్పు డిట్లు చెప్పుచున్నారము. మీకిష్టమున్నఁ జేయుడు లేనిచో మానుడు. అదియునుగాక నీవంతటి శిల్పి వని మా కెట్లు తెలియును. మా నగరమందలి ప్రముఖ శిల్పుల పరీక్షల కాఁగ జాలినచో నప్పుడు నీవిషయ మాలోచింతుము.

జక్కన్నకుఁ గోపము వచ్చినది. ఇట్లనినాడు.—

“మీశిల్పులకు నేమియు తెలియదు. వారికి శిల్పశాస్త్రమున భాస్కర్యమున ప్రథమసూత్రములే రావు. వారి కసలు విగ్రహాపు కొలతలు తెలియవు. భావభేదములు తెలియవు. మీ శిల్పుల శిల్పమునిండ దోషములు బహుముఖీనములై యున్నవి.” అని.

నగరాధ్యక్షుని కన్నులు జేవురించినవి. “అయినచో నీవందరి కంటె నంత గొప్పశిల్పివా యేమి!” అని ఆయనవంక కేని చూడకుండ వెడలిపోయినాడు. జక్కన్న కాయన మాటలలో నొక యహంకృతి, ఒక యపహాసము గోచరించినవి. తిరిగి యేమియు ననలేదు. విషణ్ణమతియై తిరిగివచ్చినాడు.

౮

జక్కన్న కొక రెడ్డిసేనానితోఁ బరిచయము కలిగినది. ఆయన పేరు నాగిరెడ్డి. ఆపరిచయము ముఖపరిచయము గాఢపరిచయములకు మధ్య నున్నది. నాగిరెడ్డి తనయింటి ముందర నొక శిల్పమయ మైన కేళాకూళి నిర్మింపించవలె ననుకొనినాడు. అది చాల క్రొత్తపద్ధతిలో నుండి యతిసుందరముగ నుండవలెను. చాలదినములుగ నాయన మనస్సులో నీభావమున్నది. ఆయన పలుమారులు తన స్నేహితులతో గూడ ననినాడు. ఒకనాటి ప్రసంగమున నొక స్నేహితు డిట్లనినాడు —

"నాగిరెడ్డీ! మననగరిలో స్వామి యని యొక బాలశిల్పి యున్నాడు. అతడు వయస్సున చిన్నవాడైయయ్యును శిల్పబుద్ధిచే వృద్ధునంతటివాడు. ఆతని నడిగితి రేని యీ మీ కోరిక సఫలము కావచ్చును. ఆతడు చాల మతిమంతుడు. అపూర్వకల్పనాచతురుడు."

నాగిరెడ్డి యిది విని సంతోషించినాడు. ఒకనాడు రెడ్డిసేనాని యొక్క పరిచారకు డొకడు స్వామి యింటికి వచ్చినాడు. అత డిది వరకు స్వామిని చూడలేదు. అతడు వచ్చినప్పుడు స్వామి యింటివద్ద లేడు. చండి తన చిత్రశాలలో గూర్చుండి యేదో చిత్రమును సేయు చున్నది. జక్కన్న యింటిముంగలి వసారయం దుపవిష్టుడై యేదియో యోజించుకొనుచున్నాడు.

పరిచార :— అయ్యా!

పిలుపు విని జక్కన్న యులికిపడి పరిచారకుని చూచెను.

పరిచార :— నాగిరెడ్డిగారు తమతో చెప్పుమనినా రండీ. ఏమనంటే, వారి యింటిముందర నొక కేళకుళియట. అదేమో నాకు తెలియదు. నిర్మించవలె నట. మీతో చెప్పి రమ్మనినారు.

జక్కన్న సరే ననినాడు. పరిచారకుడు 'చిత్తము' అని వెడలబోయినాడు. జక్కన్న వానిని చేసన్నచే నాపి, లోనికిఁ బోయి, యొక పలకను దెచ్చి దానిమీఁద నొక కేళకుళిబొమ్మ వైచి యాతని కొసగి తీసికొనిపోయి రెడ్డిగారికి చూపింపు మనినాడు. సేవకుడు వల్లె యని వెడిలిపోయినాడు.

జక్కన్న యింటిలోనికి పోయినాడు. ఎవ్వరును కనుపించలేదు. అన్న యెటకో పోయి యింకను రాలేదు. చెల్లె లేమయినట్లు?

ఇల్లంతయు కలయజూచినాడు. ఎక్కడను కనిపించలేదు. సరాసరి చిత్రశాలలోనికి పోయినాడు. అక్కడ చండి యేదో చిత్రము గీయుచున్నది. జుట్టు విరియబోసికొని యున్నది. ఒకచేత రంగులపళ్ళెము వేఱొకచేత కుంచె నుంచుకొని యామె దీక్షగ రంగులు గద్దుచున్నది. నిశ్శబ్దముగ నున్నది. ఆ గదినిండ నెచ్చటచూచినను చండి చిత్రించిన చిత్రములే యున్నవి. జక్కన్న వెనుకనుండియే చూచుచున్నాడు. చిత్రము పూర్తియైనది. చేతిలోని కుంచియు పళ్ళెమునందుంచి చండి తన యెడమచేతియంగుళులచే ముంగురుల పైకెత్రోయుచు చిత్రము చూచుచున్నది. జక్కన్న యాచిత్రమును చూడగనే దిగ్భ్రాంతుడైనాడు. అది తన చిత్రము. తన చిత్రము చండి చిత్రించినది. ఏమి ఆ చిత్ర రచనానైపుణి! భేద మేమియు లేదు. తా నంతటి యందగాడన్న మాట. ఈమెయే పురుషుడైనచో నీమె ప్రతిభ యనంతమై పట్టరాకుండ నుండెడి దనుకొనినాడు. చండి యింకను చూచుచున్నది. సాయంకాలపు టెరెండ కిటికీగుండ నామెఫాలమునం గేశములం గన్నులం బ్రసరించి వింతసోయగము గూర్చినది. జక్కన్న కామె యొక్క మధుర భావమువలె కనిపించినది. జక్కన్న నెమ్మదిగ పిలిచినాడు — "చండీ!" చండి కెవో పట్టునల్లైనా టొకింత జారుచున్నది. మోమున సిగ్గుల తెరలు ముంచుకొని వచ్చినవి. జక్కన్నను చూడగనే యామె తల వంచినది. ఆమె నేత్రాంచలముల నానందము వెల్లువలై విరియుచున్నది. పదునారు సంవత్సరముల బాలకుని వలె పెరిగిన చండి కీనాడు జక్కన్నను చూచిన తొలిదినమున తానుగూడ నొక యాడుపిల్ల యను భావము కలిగినది. వికారమునకు గురికాని యామె మన స్సానాడు వికారము నందినది. నాటిరేయి నిద్దురయే పట్టలేదు. ఆమెహృదయమున జక్కన్న మూర్తియే నిలిచియున్నది. నాటినుండి జక్కన్న యామె కారాధ్య దైవమైనాడు. తాము ప్రతిదినము సాయంవాహ్యాళి వెడలువేళ

భోజన సమయమందలి శిల్పమును గూర్చిన తర్కమును చేయు వేళల, యావేశపూరితమై కించిదరుణమైన జక్కన్న మొగము నవలోకించును. పాఠము నేర్చుకొను సమయమున భావగర్భితముగ తనవంక చూచు టలు తానా చూపుచివరల సౌందర్యమును గ్రోలుటలు సర్వములును చండికి మధురములై కన్పట్టినవి. ఆమెకు తనలోని మార్పు ఆశ్చ ర్యమును కలిగించినది. స్వామికి చెల్లెలిలో నేదో మార్పు కనిపించు చున్నది. రాత్రు లందు ప్రొద్దుబోవుదాక నిద్రపోవుటలేదు. బయట వెన్నెలలో తిరుగాడును. తీయని సన్నని రాగములు తీయును. కన్ను లరమోడ్పులుగ ఏకవీరావిగ్రహము ముందు కూర్చుండి ధ్యానించును. స్వామి కిదియంతయు విచిత్రము. తన చండి అల్లరిపిల్ల, కొంటెపిల్ల. ఇట్లు మారినది. లీలగ పసిబట్టినాడు. చెల్లెలితో నేమియు ననలేదు. అంత కంటె తనకు కావలసిన దేమున్నది? కాని యిది, యీ ప్రవాహము రెండువైపుల నుండవలెను గద యనుకొనినాడు. జక్కన్న నేకాంతముగ చూచుటకుం జండికిది తొలిసారి. జక్కన్నకు కాదు. ఆయన చండిని ఒంటిగ నిదివరకె పలుతడవలు చూచినాడు కాని నేటి యామె యాకృతి మోహనమూర్తి. జక్కన్న హృదయమున శృంగారభావము తలసూపినది. కాని నిగ్రహించుకొని నిలిచినాడు చండికన్నుల తీయని యూహలు కదలాడి యవి విచిత్రకాంతులై నాకులై జాలువారి నవి. వా రిరువు రటులనే నిలబడి యున్నారు. స్వామి వచ్చినాడు. చండి నెమ్మదిగ గదివిడిచిపోయినది. జక్కన్న కలనుండిపోవుట కెను నిముసములు పట్టినది.

తరువాతి కొన్ని దినములు గడచినవి ఒకనాడు మునుపటి పరి చారకుడు మరల వచ్చినాడు. జక్కన్న యింటిలో లేడు. స్వామి యాతని నెవరవని యడిగెను. సేవకుడు తాను సేనాని నాగిరెడ్డిగారి

సేవకు డని యాయన పంపిన యొక పత్రమును తీసి స్వామికిచ్చి చేతులు కట్టుకొని నిలబడినాడు. స్వామి యాపత్రమును పరిశీలించి చూచినాడు. దానియం దిట్లున్నది. " బాలశిల్పి స్వామిగారికి తా మిదివరకు గీచి యిచ్చిన నమూనా చాల నచ్చినది. కావున తమరు వెంటనే పని ప్రారంభింపవలెను. "

ఇట్లు

సేనాని – నాగిరెడ్డి.

చూడగనే యాశ్చర్యము పొందినాడు. స్వామి కిదియంతయు నర్థము కాలేదు. తా నిది వర కేమి గీసి యిచ్చినాడు! ఎంత యోజించినను జ్ఞప్తికి వచ్చుటలేదు. చండి నిదివర కెవ్వరైన మన యింటికి వచ్చి జక్కనాచార్యు నేమైన నడిగినారా యని ప్రశ్నించెను. ఆమె నాకు తెలియ దన్నది. ఆనాడు సాయంకాలము తాను నాగిరెడ్డి యింటికి వెళ్ళినాడు. అయన దర్శనమునకు కొంత వేచి యుండవలసి వచ్చినది. నాగిరెడ్డి వచ్చినాడు. స్వామికి నమస్కరించి గౌరవించినాడు.

నాగిరెడ్డి :– అయ్యా! తాము నాదగ్గఱకు వచ్చినపనియేమి?

స్వామి :– తా మెదో శిల్పమును చెక్కు మనిరట. ఈవేళ మీ యాజ్ఞాపత్రము వచ్చినది. అది యేమో కనుగొని పోవలెనని వచ్చితిని.

రెడ్డి :– ఆఁ! స్వామి యనువారు మీరేనా? ఔను. కొల దినముల క్రిందట నా సేవకుఁచే మీకు వర్తమాన మంపితినే. మీరు కేళకుళి చిత్రమును గూడ పంపితిరి కద!

స్వామి యాశ్చర్యమునకు మేరలేదు. 'నేనా పంపినది? నా కేమియు తెలియదే?" యనినాడు.

నాగిరెడ్డి యంతకంటె నాశ్చర్యమును పొంది, 'అయినచో నా చిత్రమును తెప్పింతునా?' యనినాడు. స్వామి తెప్పించు డనినాడు. నాగిరెడ్డి యా కేళాకుళి చిత్రమును తెప్పించి స్వామిచేతి కొసంగినాడు. స్వామి దానిని చూడగనే యది జక్కన గీచిన చిత్రమని గుర్తుపట్టి సంతసించి యనినాడు 'అయ్యా! ఈచిత్రము నాదికాదు. నా గురువైన జక్కనాచార్యునిది. ఆయన యొక మహాశిల్పి. ఆయనగీచిన గీత చెక్కిన చెక్కడు మహాద్భుత చిత్రములై రూపొందును. ఆయన కేవల మొక దేవతామూర్తి.'

నాగిరెడ్డి:— అటులనా? అయినచో వా రిక్కడనే యున్నారా? వారు వ్రైచినదా యీ చిత్రము? ఎంత సుందరముగ నున్నది!

స్వామి:— ఆయన వచ్చినప్పటినుండియు నూ యింటనే యున్నారు.

నాగిరెడ్డి:— ఆయన యెక్కడ నుండి వచ్చినారు?

స్వామి:— మన ప్రభువు చేసిన ప్రకటన చూచి సప్తపర్ణిని అష్టపర్ణిని చేయుటకై వచ్చెను. ఇప్పటికి రెండు నెల లయినది. ప్రభువు దర్శనమే కాలేదు. మీ రొక సాయము చేయవలెను.

నాగి:— ఏమది? నా చేతనైనచో తప్పక చేతును

స్వామి:— ఆయనకు చక్రవర్తి దర్శనము చేయించవలెను. మీ కెంతయైన పుణ్యముండును.

నాగి:— అదికాదు. అది చాల కష్టసాధ్య మైన విషయము. ఇక్కడ మన ప్రభుత్వమున వెలమవారి యధికారము కమ్మవారి యధి

కారము ప్రబలి యున్నది. ప్రభువు వారిపై మక్కువ కలిగియున్నాడు. వారది చూచుకొని విజృంభించుచున్నారు. మా రెడ్ల గొడవయే పట్టించుకొనువారు లేరు. ఏ ముఖ్యములైన కార్యములు తటస్థించినను ప్రభువు వారలనే రప్పించును. మంత్రాంగము చేయును. వారినే పనులకు బంపును. బిరుదులిచ్చును. వేతనములు నభివృద్ధిగావించును. మే మసలు లెక్కలోనికే రాము. న్యాయమున మా స్థితి యిట్లున్నది. మామాటలెవరు మన్నింతురు? అయినను నా యోపినంతవరకు యత్నింతును. నగరాధ్యక్షునితో చెప్పుదును."

స్వామి మెటులనో యొకలాగున చక్రవర్తిదర్శనము కలిగిన చాలు ననినాడు తా నింటికి పోయినాడు.

దినములు గడచుచున్నవి. నాగిరెడ్డి యొకనాడు నాగయగన్న మంత్రియింటికిం బోయినాడు. రాజకార్యములు చూచుకొని సెలవు తీసుకొను నదనున నాగయ యొంటిగనుండుటం జేసి జక్కన్న విషయము ప్రస్తావించినాడు. ఆయన మాటాడలేదు. మరునా డీసంగతి నగరము నందలి ప్రముఖ వెలమ కమ్మసేనానులకు తెలిసినది. వారికందరకు నాగిరెడ్డిమీద చాలకోపమువచ్చినది. క్రమముగ ముప్పిడినాయకుడు, త్రిపురాంతకుడు అంబదేవుడు మొదలుగాగల సేనానులందరకు తెలిసినది. నాగయమంత్రిపట్ల రెడ్డియొక్క చొరవకు వారు కినిసిరి. నగరాధ్యక్షునితో నుత్తరప్రత్యుత్తరములు నడచినవి. అందుమూలమున జక్కన్నకు చక్రవర్తిదర్శనము మరీదుర్లభమైనది. రెడ్డిసేనాని చెప్పినాడు గనుక పనులు చేయరాదను భావ మొకటి, గడుసుగ జక్కన్న మాటాడె నని నగరశిల్పుల నధిక్షేపించెనని కీర్తివెలయించినాడని యిన్నిరకములుగ జక్కన్నకు చక్రవర్తిదర్శనము మరింతదూరమై పోయినది.

౬

ఒక రోజున స్వామి జక్కన్నతో మరల మాచల్దేవి దర్శనము చేయరాదా యనినాడు. జక్కన్న యటులనే కాని మనమిద్దరము కలసియే పోదమనినాడు. స్వామి తాను రా నిరాకరించినాడు. జక్కన్నకు కారణము తెలియదు. అడిగినచో మాటాడడు. అతని మోమున వైవర్ణ్యముతోపం దాను రా నిష్టము లేదనినాడు. జక్కన్నకు స్వామి తనకేదో చెప్పక దాచుచున్నాడను భావము కలిగినది. రానందులకు కారణము చెప్పుమని వేడుకొనినాడు. నాదగ్గరనే నీదాపరికమా? ఇంతేనా మన మైత్రి యని గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నించినాడు. చివరకు కథ తేలినది. స్వామి యిట్లు చెప్పినాడు. "అన్నా! అది యంతయు నొక పెద్దగాథ. అది వినునంత యోపిక నీకు లేదేమో!"

అతని కన్నులం దేలవర్ణ్యము తొంగిచూచినది. ఒక వేడినిట్టూర్పు విడిచినాడు. జక్కన్న స్వామిని బుజ్జగించి యనినాడు. "నాయనా! ఇంతలో నిట్లయితి వేమి? ఆగాథ యేమో నాకు చెప్పుటకు సందేహించుచున్నావా? నీకు నాయందు నమ్మకము లేదా? నీబాధ నాకు బాధకాదా? ఏదీ యిటుచూడు. అయ్యో! కన్నులనీరు గూడ వచ్చుచున్నదే! అది యేమయ్యా! నాతో చెప్పుము."

స్వామి కొంత యూరడిలి యనినాడు. "అన్నా! ఇక విను. ఈమె యున్నదే మాచల్దేవి! ఈమెది ఇందులూరు. మాయూరును అదియే. వారియిల్లు మాయింటిప్రక్కనే యున్నది. నేను చెప్పినచో నీవు నవ్వుకొందువేమోకాని అన్నా! నేను చిన్నప్పుడు చాల అందముగ నుండి ముద్దుగ నుండెడివాడను. ఆమెకును నాకును నేడేండ్ల వారడి. ఆమె నన్నెప్పుడు నెత్తుకొని ముద్దు లాడెడిదట. నేను నాకు నేడెనిమిది యేండ్లు వచ్చువరకు వారి యింటనే పెరిగితిని. నాకు పదియేండ్లు వచ్చు

సరికామె సంగీతనాట్యములయం దారితేరినది. ఆమెపై చక్రవర్తి కను గ్రహము కలిగి ఓరుగల్లు వచ్చుట జరిగినది. అప్పటినుండి నాకావిడ యనగా ప్రేమ యుండెడిది. ఆవిడ ఓరుగంటినుండి యేడాదికి రెం డేండ్ల కొకసారి ఇందులూరు వచ్చుచుండెడిది. తాను చిన్నపు డెత్తి ముద్దాడిన వాడనను ప్రేమచే నే ననగ ప్రేమ చూపెడిది. దగ్గఱకు పిలిచి మాటలాడునది. నాకావిడయం దమితమైన కామభావము కలిగి నది. ఆభావము నాకున్న ట్లామెకు తెలియదు. ఇట్లుండగ నొక సారి యామె ఇందులూరు వచ్చినది. అప్పటికి నేను పదునేనిమిది యేండ్లవాడను. అనగా నిప్పటికి రెండేండ్లక్రిందటి మాట. ఆమె యొక నాటి సాయంకాల మూరి యందలి చెఱువొడ్డునకు వాహ్యాళి వచ్చి నది. నేను గూడ బోయితిని. ప్రసంగవశమున నా కోర్కె నామెతోఁ దెల్పితిని. ”

జక్కన్న యూత్రముగ వినుచున్నాడు. “ఆ తరువాత నేమై నది ? ” యనినాడు.

స్వామి :— వినుమటి. ఆమె నవ్వినది వెడలిపోయినది. నా కేమనుకొనవలెనో తెలియలేదు. ఆమె మీఁది మక్కువమాత్రము గాఢముగ నున్నది. నురునా డుండబట్టక వారియింటికిఁ బోయితిని. మాచలదేవి నన్నాహ్వానించినది. నేను లోనికిఁ బోయితిని. మాయిద్దరి మధ్య చాల సమయము నిశ్శబ్దముగ గడచినది. చివర కామెను నేన కదలించితిని. ఆమె యొక తిరస్కారపూర్వకమృదుహాసము చేసినది మరుక్షణమున తన పేటికనుండి తాను చిత్రించిన చక్రవర్తి చిత్రమును వెలికిఁ దీసి కుంచెతో రంగులు దిద్ద మొదలుపెట్టినది. అప్పు డామె నావంక నొక చూపు చూచినది. ఏమని చెప్పను. నాఱుపు రాకుండ నున్నది. దానిలో నొకజాలి యొకప్రేమ, యొకతిరస్కారము. చక్ర

వర్తిపైని తనప్రేమ సర్వమును భాసిల్లునట్లుగ నున్నది ఇక నాకక్కడ నుండ బుద్ధియైనదికాదు. తిరిగి వచ్చితిని. అప్పటినుండి యామెతో మాటాడలేదు. నేనీ యూరువచ్చి నాశిల్పముక్షేమాభివృద్ధి గావించుకొను చున్నాను. ఎప్పుడైన నెక్కడయిన నామె నాకెదురైనచో మాటాడదు సరికదా యెఱిఁగియున్నట్లు కూడ నటింపదు. నేనీ యూరు వచ్చివేసితి నని యామెకుఁ దెలియును. నా పరోక్షమున మాత్రము నన్నుగుఱించి యాతడు గొప్ప శిల్పియని చాల పైకి రాగలడని చెప్పునట. చండి చెప్పును. నా కసలా చక్రవర్తియనినచో నొడలు కాలిపోవును. ఆయన మూలముగనే నాప్రేమ విఫలమైనది. ” అని చక్రవర్తి శీలమును దూషించినాడు.

జక్కన్న కంఠయు నద్భుతముగ నయోమయముగ నున్నది. స్వామి వెన్ను నిమిరి యనినాడు. – “నాయనా! దిగులొందకుము. నే నామె యొద్దకుబోయి మాటాడుదును. చాల పైకి రావలసిన పిల్లవాడు నీమూలమున పాడైపోవుచున్నా డందును. అందుల కేమనునో చూతము. ”

స్వామి కానవలె దవుననలేదు. మౌనముగ నూఱకుండినాడు.

జక్కన్నకు మాచల్దేవి యింటికిఁ బోవుటకు వీలు కానేలేదు. సమయము దొర్లిపోవుచున్నది. చాలరోజులుగ జక్కన్న చర్యల నెవరో పరిశీలించుచున్నట్లుగ జక్కన్న కనుమానము తట్టినది. అతఁ డెప్పు డింటినుండి బయలుదేరిన నెవరో యాయనను వెన్నంటుచున్న ట్లున్నది. ఆయన కేమియు తోఁచుటలేదు. తనకు రోజులు మంచివి కావనుకొనినాడు. ఒకరోజున సందెచీకటిలో నొకసందుగుండా జక్కన్న పోవుచున్నాడు. ఎవరో తన వెనుకనుండి వెన్నంటి వచ్చుచున్న సవ్వడి యైనది. జక్కన్న యొక్కింత నిలిచిచూచెను. ఆ అడుగుల

సవ్వడియు తగ్గి వినిపించినది. జక్కన్న మటల బయలుదేరినాడు. అడుగుల సవ్వడియు పెద్దదైనది. జక్కన్న యట్లే నిలబడి యూ వచ్చు వాని నాపి, "నావెంట నెందులకు వచ్చుచున్నా వ'ని ప్రశ్నించినాడు. వాడు చెప్ప నిరాకరించినాడు. వా రిద్దరిచుట్టును జనము చేరినది. ఆవచ్చిన జనమున కండర కా వెన్నంటి వచ్చిన వానిని చూడగనే భయమైనది. జక్కన్న అత డెవడో గూఢచారియై యుండు నను కొనెను. తనమీద రహస్యచారుల నేల నుంచవలయునో యంత యవసర మేలకలిగినదో యాతనకు తెలియలేదు. తా నేమంత నేరము చేసినాడు! జక్కన్న వెనుదిరిగి యింటికి వచ్చినాడు. అతని మొగ మంతయు వాడి వివర్ణత నెందియున్నది.

భోజనము కూడ సరిగ జేయలేదు. కొలదిగ నంజినట్లుగ నంజి యటు నిటు త్రోసి లేచిపోయినాడు.

స్వామి :— అన్నా ! అదేమి యట్లు మధ్యలో లేచిపోయితివి ? అన్న మే తినలేదేమి ?

చండి :- అన్నా ! అటుచూడు మాయన మొగము వాడి యున్నది. కన్నులు జేవురించినవి. నా కెదో భయముగ నున్నది.

స్వామి :— పర వాలేమిలే చెల్లీ ! ఆయన యేదో బడలికగ నున్న ట్లున్నది.

నాటిరాత్రి జక్కన్నకు గొలదిగ జ్వరము వచ్చినది. స్వామియు, చండియు మిగుల భయమందిరి. రేయెల్లగ జండి జక్కన్న మంచము దగ్గఱనే కూర్చుండిపోయినది. ప్రొద్దునకు జ్వరము జారినది. నిదుర లేమిచే నెఱ్ఱవారిన కన్నులతో, రేగిన ముంగురులతో, సిగ్గు లేగులాబి వన్నె తిరిగిన కపోలములతోడ జండి జక్కన్న నిద్దురనుండి లేవగనే కను

పించినది. జక్కన్న కన్నులు తృప్తిని వెలికిజిమ్మినవి. చండిని పిలిచి నాడు. ఆమె సిగ్గుపడి తలవంచుకొనినది.

జక్కన్న :— నాతో మాటాడవా?

చండి :— ఎందుకుమాటాడను?

అయినచోఁ దల వంచుకొంటి కేమి?

చండి తలయెత్తినది, — 'నే నేమియు తల వంచుకొనలేదు'

జక్కన్న :— రాత్రియంతయు నిద్దురపోలేదా?

చండి :— ఎందుకు పోలేదు. చక్కగా నిద్దురపోయితిని.

జక్కన్న :— అబద్ధములు చెప్పుట మొదలు పెట్టితివి?

చండి :— నే నేమియు నబద్ధము లాడుట లేదు

జక్కన్న :— అదుగో, మరల నబద్ధము. అబద్ధముపై నబద్ధము. చిలిపితనమునకుతోడబద్ధములు.

చండి కిలకిలా నవ్వినది. జక్కన్నయు నవ్వినాడు. జక్కన్న మనస్సులో నిట్లనుకొనినాడు. 'ఈపిల్ల నా మనస్సును లాగివైచుచున్న దేమి?' యని ద్వారము వైపునకు చూచినాడు. చండి యప్పుడే పరుగిడిపోయినది. ఒక రోజున సాయంకాలాహ్యాళిగ జక్కన్న యొక్కడే వెడలినాడు. జక్కన్న వెడలిన స్థలము సాధారణముగ నెల్లజనులు వెడలుచోటు. కాని నాడెవ్వరి నచటికి రానిచ్చుటలేదు. జక్కన్న కారణ మడుగగా నా డంతఃపురస్త్రీలు వచ్చుచున్నారు కావున నితరు లెవరును రా కూడదని సమాధానము వచ్చినది. జక్కన్న దూరముగ నిలబడి చూచుచున్నాడు. కొంతసేపటి కొక పాలకి వచ్చినది. అందులో నుండి యొకస్త్రీ తొంగిచూచినది. జక్కన్న కా మొగ మెక్క-

డనో చూచిన ట్లున్నది. ఔను. మాచల్దేవి చిత్రశాలాప్రవేశ మహోత్సవమప్పుడు తాను చూచిన స్త్రీ యీమెయే ఆమె యెవరు? ఆమె దూరముగా నుండుటవలన జక్కన్నను చూడలేదు. ఆమె యెవరో రాణివాసపు స్త్రీ యయి యుండును. అప్పుడు మాచల దేవి చిత్రశాలాప్రవేశమహోత్సవమును చూచుటకు వచ్చియుండును. ఆమె యక్కడ తనవంక పరకాయించి చూచినది. తానును చూచినాడు. జక్కన్నకు నాకస్మికముగ నొక సందేహ మొదవినది. ఆమెపైఁ దనకు ప్రేమ యున్నదా? జక్కన్న మనస్సున స్వామి, చండి మెదలినారు. ఆవిడయే మాచలదేవి యై యుండునేమో! యను భావ మాయనకుఁ గలుగలేదు. ఎంతటి రాజాదరణము కలిగినను వారాంగన యంతఃపురస్త్రీ కాజాలదు. ఆవిడ కంత రాజమర్యాద యుండదని యనుకొనినాడు. చీఁకటి దట్టమైనది. ఆ వచ్చినయామె వెడలిపోయినది. జక్కన్న యొంటిగ ప్రొద్దుపోవునంతవర కక్కడనే కూర్చుండిపోయినాడు. ఆయనకు స్వామిగాథయు నాశ్చర్యమును కలిగించుచున్నది. నిజముగ స్వామి యెంతటియందమైన కుఱ్ఱవాఁడు! ఆ మాచాల్దేవి యెటులుండునో మరి! ఆమెకుఁ జక్రవర్తిపై నంత ప్రేమ యున్నదా? అయినచో నామె యెవరినో శిల్పి నెట్లు ప్రేమించినది? వారకాంతా స్వభావ మును పోనిచ్చినది కాదు. ఆయన మనస్సు మరల నన్నా చెల్లెళ్ళ వైపునకు మొగ్గినది. ఇరువురును వసంతకాలపు సంధ్యాపూర్వనవ మల్లి కాకుట్మములు. ఇరువురును రాచిల్కచే కొఱుకులుపొందని రెండు దాడిమీఫలములు. వారికి తాను తోడైనాడు. ఎంతకు నాయన యాలోచనలు తేలకున్నవి. కోటలోని గడియారము రాత్రి పదునొండు సూచించు గంటలు కొట్టినది. జక్కన్న లేచి బయలు దేరినాడు ఇంటికి వచ్చుసరికి ద్వారమున కడ్డముగఁ జండి నిదురముంపు కనులతో నొంటరిగ ప్రతీక్ష సేయుచున్నది. స్వామి

యప్పుడే నిద్రపోయినాడు బయట నంతయు గాఢముగఁ జీఁకటి యలముకొనినది. ఆ చీఁకటిలో చండి రెండుకన్నులు రెండునక్షత్రములై మిఱుమిలలాడినవి.

భోజనముముందర మౌనముగనే గడచినది. తరువాత జక్కన్న తనగదిలోకి పోయినాడు. చండి జక్కన్న ప్రక్కపఱచి తన గదికి పోబోయినది. 'చండీ'—జక్కన్న వెనుకనుండి కేకవైచినాడు. చండి వెనుదిరిగి నిలబడినది.

జక్కన్న :—నీవు నిజముగ నొక దేవబాలికవు.

చండి సిగ్గిలి పైటచెఱఁగున మోము కప్పుకొని యటనుండి చరచర నాగుబాముపలె జారిపోయినది.

నాటిరాత్రి జక్కన్న తృప్తిగ నిద్రపోయినాడు.

౧౦

ఇందులూరి యన్నయామాత్యుఁ డూరిలోనికి వచ్చినాఁడను వార్త బహుముఖీనమై వ్యాపించినది. స్వామి జక్కన్నకీ విషయము చెప్పి యాయన దర్శనము చేయుద మనినాడు. కాని యా దర్శన మంత సులభసాధ్యము కాలేదు. అన్నయ్య మంత్రి యేవో రాచకార్యములయందు మునిగియున్నాడు. ముందు వీరికి దర్శన మిచ్చుటకు నిరాకరించినాడు. పదిరోజులుగ దర్శనము కొఱకాయన సౌధమునకు పోయి తిరిగి వచ్చుటలుగ నున్నది. కాని దర్శనము లభించుట లేదు. స్వామి కేమిచేయవలయునో తెలియుటలేదు. చివరి కొకనాఁ డిక నన్నయామాత్యుఁ డూరినుండి వెడలిపోవు నవగ దర్శన మొసఁగుదు నని కబురంపినాడు. స్వామి జక్కన్న లిరువురకు పట్టరానంత యానందమైనది. వా రిరువురును నన్నయామాత్యుని సౌధమునకు మరల

బోయిరి. అన్నయామాత్యుడు ప్రయాణసన్నాహములో నున్నాడు. ఆయన చుట్టును పలువు రుద్యోగులు రాచకార్యముల సంప్రదింపులకై వేచియున్నారు. వచ్చిన జక్కన్నను స్వామిని సాదరముగ జూచి కూర్చుండ నియమించి అన్నయ తన యుద్యోగులతో సంప్రదించ మొదలు పెట్టెను. అన్నయామాత్యుడు కొంచెము స్థూలముగ నుండి యుక్కువలె నుండును. ఆయన జంఘ లినుప గుదియలవలె నుండును. చిఱుబొజ్జ కలదు. ఆయన ముఖమున కన్నులందున నెల్లప్పుడు వీరరస ముట్టిపడుచుండును. ఆయన ప్రతాపరుద్ర చక్రవర్తికి పినతల్లి భర్త. ఆయన చక్రవర్తికి దక్షిణహస్తము వంటివాడు. ఆయన మాంపూరి రాజుల తనశౌర్యముచే గెల్చి చక్రవర్తిచే రాయచౌహత్తమల్ల బిరుదము నందినాడు. స్థలగిరివనదుర్గ జలకోటమల్ల బిరుదాభిధానుడు. అయిదు లక్షల కాల్బలమున కధిపతియై కళింగు నోడించెను. సింహాచలమునుండి ఓరుగంటివరకును గల రాజ్యమును పాలించుచున్నాడు. కళింగము నందలి మహేంద్రగిరినుండి కృష్ణానదివరకు గల ప్రదేశమునందంతట నారామ తటాక ప్రతిష్ఠల సల్పెను. రుద్రమదేవికి శివదేవయ్య యంతటివాడు కాకపోయినను ప్రతాపరుద్రునికి మంత్రి యని చెప్పుకొనదగిన దీయన యొక్కడే. మతివిభవము శౌర్యము నీయనయందు సమానముగనై యున్నవి. ఎప్పుడును సరిగంచుపంచ లనే ధరించును. ఇతర మంత్రుల కీయనయం దొకింత భయముకలదు కాని చక్రవర్తికి బంధువు దక్షిణహస్తము. ఆయన పైకెంత కఠినముగ నుండునో లోన నంత మెత్తని మనసువాడు. ఆయన నియోగి బ్రాహ్మణుడు. అయినను వైదికము నవలంబించి మీసములు తీసివెచి పిలక జుత్తు పెట్టుకొనినాడు. చెవులకు కుండలములు. రాజోద్యోగు లందరకు నాయన చెప్పినది శిరోధార్యము. జక్కన్న కూర్చుండియే యున్నాడు. అన్నయ్య పని తొందరలో నున్నాడు.

1. ఉద్యోగి :— యుద్ధము తప్పక వచ్చున ట్లున్నది.

2. ఉద్యోగి :— తురకలు దేశము మీదికి దండెత్తివచ్చు సన్నాహములు సేయుచున్నారని నే పంపిన జాంఘికుడు తెచ్చినవార్త.

3. ఉద్యోగి :— ఢిల్లీయందున్న యాగూఢచారి నిన్ననొకవార్త పంపినాడు. మహమ్మదీయులు యుద్ధమునకు వలయు నాయుధములు చేకూర్చుకొనుచున్నారట.

అన్నయ :— ఔను. సమరయాత్ర సాగించవలసియున్నది. మన మును తురకలను నెదుర్కొనుటకు సంసిద్ధులమై యుండవలయును.

1. వ ఉద్యోగి :— అయినచో మనము సైన్యముల ప్రోగుచేయ వలసియుండునుకదా !

2. వ ఉద్యోగి :— మీరు చక్రవర్తితో మాటాడినారా ? వా మన్నారు ?

అన్నయ :— రాజ్యములోనుండి సైన్యమును ప్రోగుచేయవల యును. ఈ యుద్ధమే సిద్ధమగుచో మనపై నెంతయేని బాధ్యతయున్నది. మీరందరు వీలైనంతసైన్యమును ప్రోగుచేసి యెప్పటికప్పుడు నాకు సింహాచలమునకు వార్తలఁ బంపవలెను. మీకీప్రయత్నమున నేమరిక కూడదు. తురకల నీ పవిత్రదేశమున నడుగిడకుండ వెనుకకుఁ దరుమ వలెను.

ఆయన మోము కోపముచేఁ గందగడ్డ యైనది. ఆయనవార్తలు మాత్రము తప్పక తెలియఁబరచు కట్టడిచేసి యా యుద్యోగులకు సెలవొసగి పంపివేసి స్వామి జక్కన్నలవైపు తిరిగినాడు. వారిరువు రాయనకు లేచి నమస్కరించినారు. అన్నయ్యమంత్రి స్వామిని మీరు వచ్చినపని యేమని యడిగినాడు. స్వామి జక్కన్న కథ యంతయుఁ

దెల్పినాడు. అన్నయ యది విని రాజదర్శనముకొఱకై యొక యనుజ్ఞా పత్రమును వ్రాసియిచ్చి వెడలిపోయినాడు.

ఆ పత్రము నగరాధ్యక్షునికి వ్రాసియిచ్చినది. ఆపత్రము చేతఁ బుచ్చుకొని యాయనచుట్టుతిరుగలేక జక్కన్నకాళ్ళు బలపములుకట్టినవి. కాని లాభములేకపోయినది. జక్కన్నమీఁద నిదివఱకే కోపముగ నున్నది నాగయగన్నమంత్రికి. జక్కన్న కేమియు పాలుపోవుట లేదు. ఊరంతయు నూరక తిరిగివచ్చినాడు. తాను వచ్చి రెండునెలలు కావచ్చినది. ఇంతవరకైన దేమియు లేదు. అంతయు నధ్వాన్నముగ నున్నది. ప్రొద్దుక్రుంకినది. వెన్నెలవచ్చినది. జక్కన్న యుత్తరదిశగ నున్న మట్టిప్రాకారపుద్వారమున కొంకింతదూరముగనున్న యొక చిన్ని సరస్సున కాళ్లువైచి నీటిలోప్రతిబింబము చూచుకొనుచున్న యొకస్త్రీ మూర్తిని చూచినాడు. తానున్నదగ్గరనుండి యాకొల నొక నూరు గజములదూరమున నున్నది. జక్కన్న లేచి యాదిక్కునకు నడచినాడు. సమీపించినకొలఁది జక్కన్న కా యువతి పరిచితవోలె కనిపించినది. ఆమె దోసిళ్ళతో నీళ్ళనెత్తి పైకిజిమ్మి వానిని క్రిందబడనీయకుండ మఱలఁజిమ్మి చుట్టును గజముమేఱకు నీటితుంపరలఁ జిందజేయుచు నానందించుచున్నది. ఆమె సరస్సులోనికి రెండడుగులువైచి యొక కలువపూవుచుత్రుంచి తలలోపెట్టుకొనినది. ఆమెదూరమున జక్కన్నను చూచినది. చఱగఱ నీటిలోనుండి పైకివచ్చి యొడ్డున మెట్లపైఁ గూర్చున్నది. జక్కన్న గజముదూరములో నిలబడినాడు. ఆయన కిక వేరుగజెప్పనవసరము లేకపోయినది. ఆమె చిలిపి నవ్వులతోఁగలసి తళతళలాడుకన్నులే యామెను చండిగా పట్టియిచ్చినవి. జక్కన్న వచ్చినదికూడా తెలియనట్లుగ ముగ్ధవలె నటుమొగమై యున్నది. జక్కన్న యామె యిట్టివేళ నొంటరిగవచ్చినదే యనుకొనినాడు. చిఱు కోపము కలిగినది. మఱల ననుకొనినాడు, “నా కీపిల్లపై కోప మెందు

లకు? నేనెందుకు వచ్చితిని? అయిన నామెపై నాకధికార మేమి?"
చండికంక దృష్టినిలిపి చూచినాడు. ఆమె ముసిముసినగవులు నవ్వు
చున్నది. ఆమె మొగమున సమాయికత కొట్టవచ్చుచున్నది. జక్కన్నకు
తన కామపై ననవసరముగ కోపభావము కలిగిన దనుకొనినాడు.
జక్కన్న కంఠవిపుగుకలయందును చండిని చూడగనే మనస్పూరటం
జెందిన ట్లయినది, ఆమెప్రక్కకుంబోయి 'చండీ' యనినాడు. ఆమె
యులికిపడి యనినది, "మీరా! మీరెప్పుడు వచ్చితిరి."

జక్కన్న :— నీవు రెప్పుడు వచ్చినారు?

చండి :— నేను వచ్చి చాలా సేపైనది.

జక్కన్న :— నన్ను నీవు చూడనే లేదా?

చండి :— నాకేమియు తెలియదు.

జక్కన్న :— నీవు నీటిలోనుండి నన్నుచూచి త్వరగ నీవలకు వచ్చితివికాదా?

చండి :— మీరు చూచితిరా? నాకు తెలియదు.

జక్కన్న :— కొంటెతనము మానవు. అన్న యేడీ?

చండీ :— ఏదో బొమ్మ చెక్కుకొనుచున్నాడు.

జక్కన్న :— నీ విట్లొంటరిగ వచ్చితి వేమి?

చండి :— రాకూడదా?

ఆమెంన్నులు మకదహాసమును చిందినవి.

జక్కన్న :— ప్రొద్దుక్రుంకినదికదా. భయము వేయదా యని.

చండి :— నాకాభయము; నాకు భయమెందుకు.

ఆమె పకపక నవ్వినది. జక్కన్న కామె తత్వమంతయు విచిత్ర ముగ నున్నది. ఈమె బాలిక యేనా ?

జక్కన్న :— నీవాడపిల్లవుగదా, ఇట్లు రావచ్చునా ?

చండి :— నేనాడపిల్లనా ?

జక్కన్న కాశ్చర్యమైనది, 'ఏమీ యిటుచూడు, నీ వాడ పిల్లవేకావా ?'

చండి జక్కన్న మొగములోనికి చూచినది. ఆమె యెడలి యందేదో విద్యుత్ప్రసార మయిన ట్లున్నది, ఆమెకన్నులు వ్రాలినవి. అంతలో సిగ్గు తటుముకొనవచ్చినది. ఔను. తా నాడపిల్లయే యను కొనినది. తలవంచికొనినది.

జక్కన్న :— నిముసములో నాడపిల్లవైతివే. నీవు చాల విచిత్ర మైన దానవు. నిన్నర్థముచేసికొనుట చాలాకష్టము. ఇంటికి పోదమా ?

చండి :— నేను మీతో వచ్చితినా ?

జక్కన్న :— నీవు పట్టి యల్లరి దాన వగుచున్నావు. నీయల్లరిని నేను సైరించుచున్నాను కాని మతొకరైనచో నూరకుండరు.

చండి :— ఊరకుండక యేమిచేయుదురు ?

జక్కన్న :— ఏమైనను చేయుదురు. బుగ్గలు నులిమి బూరెలు వండగలరు.

చండి :— పోనీం దాపని మీరే యేల చేయరాదు ?

జక్కన్న :— మీ యన్నతో చెప్పెదను. తెలిసినదా ?

చండి :— అమున నా యల్లరిని సైరించునే మాటి !

జక్కన్న :— ఔ నాయనమాత్రము నీకన్న గాడా!

చండి :— అయినచో మీరు మాత్రము...మీరు మాత్రము!

జక్కన్న :— ఊఁ. నేనుమాత్రము నీ కేమగుదును?

చండి నవ్వియనినది. "ఏమియులేదు. ఆ మఱచితిని. చక్రవర్తి నెప్పుడు చూడబోయెదరు? నన్ను కూడ మీ వెంట తీసుకొనిపోదురా?"

జక్కన్న :— నీ చమత్కారములు చాలునులే గాని చక్రవర్తి దర్శన మెట్లగునో తెలియకుండ నున్నది. చండీ! నా కీయూరు వచ్చి నప్పటినుండియు గ్రహాబలము చాలన ట్లున్నది. అన్నియు నపశకున ములుగనే యున్నవి. ఆ చక్రవర్తి దర్శనమే కావాయెను. చండీ! మీ యన్నా చెల్లెండ్ర యాదరసత్కారమే లేనిచో నే నీపాటి కేమయ్యెడివాడనో!

చండి :— అదే మట్లనెదరు. మేము కానిచో నింకొకరు. మిమ్ము లఁ గాదనువా రెవరుందురు. అది సరిగాని నే నిట్లొంటరిగ వచ్చుట మీ కిష్టము లేదా?

జక్కన్న :— లే కేమి? నాకు నీ వేమిచేసినను నిష్టమే.

చండి :— అయినచో వినుడు. నేడు నా స్నేహితురా లొకర్తుక చెప్పినది. మీరు చక్రవర్తి దర్శనము చేయుటకు వాంఛించుచున్నారా?

జక్కన్న :— నీవొక చిక్కుసమస్యవు. మాటల నటుల త్రుంచి మాటాడుదు వేమి? చక్రవర్తిని చూడవలయుననియే కదా రెండు నెలలనుండి బాధపడుట!

చండి :— చక్రవర్తిని నే చూపింతును.

జక్కన్న :— పొమ్మా. నీతో మాటాడను. నీహాస్యము హద్దుల నతిక్రమించుచున్నది సుమా !

జక్కన్నకుఁ గోపము వచ్చి లేచిపోవ దొడఁగినాడు. చండియు నాతని ననుకరించి యనినది. “నేను ప్రతిదినమున నర్ధరాత్రముల మేల్కాని మీ మనోవేదనల నర్థము చేసికొన్నాను. పలుమారుల యందైన చూపలువరింతల వింటిని. నాహృదయము మీమెడ యంత మెత్తనిది కాకపోయినను ద్రవించినది. అప్పటినుండి నేను చక్రవర్తి దర్శనము విషయమై యోజించుచుంటిని. అది నేటికి నా చెలికత్తె ద్వారా తెలిసినది.

జక్కన్న :— ఆమె కెట్లు తెలియును ?

చండి :— ఆమె మాచలదేవి పరిచారిక. ఆమెకును నాకును నిక్కడికి వచ్చిన రెండేండ్లనుండియు చెలిమి. ఆమె పేరు భైరవి. చక్రవర్తి సాయంతనముల దన పూఁదోటయందలి సౌధమున గవాక్షమున కెదురుగఁ గూర్చుండి తోటను చూచుచు గడపునని యామె చెప్పినది. అట్టివేళ మీరచటికేగి చూడుడు. అదియే మార్గము. లేకున్న మనకు నాజ్ఞాపత్రములతో సాగెడి వ్యవహారము కాదు. ఏమిజరుగునో చూతురు. సాహసింపవలయును. ఈవిషయమును చెప్పుట కా భైరవి నన్ను కొలనిరొడ్డునకు రమ్మనినది.

జక్కన్న చండిని మనసులోనే యభినందించినాడు. అట్లు చేయుటయే మార్గ మనుకొనినాడు. వా రిరువు రింటికి వచ్చినారు.

మరునాడు సాయంకాలము జక్కన్న రాజోద్యానములోనికి వెళ్ళినాడు. ప్రభువు గవాక్షమునొద్దఁ గూర్చుండి యుండెను. జక్కన్న దాని కెదురుగ నిలబడి ప్రభువు నాలోకించుచున్నాడు. ప్రభువు దృష్టి

జక్కన్నపైఁ బడినది. పరకాయించి చూచినాడు. ఆయన కన్నుల లోని కావిరి వచ్చినది. జక్కన్న ప్రభువు తనవంకకే చూచుట గాంచి నమస్కరింపఁ బోయినాడు. కాని యంతలోనే గవాక్షపు తలుపులు ధడాలున మూయుబడినవి. జక్కన్న యటులనే చాల తడవు కూలబడినాడు. ఆయనను గూర్చి యోజించినవారు లేరు. కొంత సేపటికి కిరువురు భటులు వచ్చి జక్కన్నను దుర్భాషలాడి యచటినుండి వెడలనడచిరి. జక్కన్న మరల స్వామి యింటికి వచ్చినాడు. కాని యతడు తానొక బందిఖానాలో నున్నట్లుగ బాధ పడుచున్నాడు. అన్నా చెల్లెండ్రెంతయయిన జాగ్రత్తగా సంతోషకరములగు మాటలఁ జెప్పి తృప్తిపరుపఁ జూచుచున్నను జక్కన్నలో మార్పేమియు లేదు.

జక్కన్న యొకనాడు నాగిరెడ్డితో బోయి తనస్థితిఁ జెప్పుకొని నాడు. ఆయన యాచోకీలు తీసినాడు. కాని యేమియు నవగతమగుట లేదు. మొదలు చివరలు తెలియుట లేదు. ఆయన యనినాడు— 'అయ్యా! మీస్థితియే నాకును బట్టినది. ఈరాజ్యమున వెలమవారి కున్న పలుకుబడి రెడ్లకు లేదు.'

జక్కన్న :- మాటి మాటి కట్లనుచున్నారు! వారి కంత ప్రాధాన్య మిచ్చుటకు ప్రభువునకు ప్రత్యేకముగ వారియందు గల దయాకారణము లేవి?

నాగిరెడ్డి :- రెండేండ్ల క్రిందట నీయూరిలో నాకుల చంద్రయ్య యను బ్రాహ్మణునియింటను, దేవాలయమునను దొంగలు పడి యమ్మ వారి యాభరణముల నపహరించి యా బ్రాహ్మణ దంపతుల హింసిం చిరి. ఆసమయమున నీబ్రాహ్మణుఁ లేమియు చేయలేకపోవుటఁ జేసి ప్రభువులకు బ్రాహ్మణులపై కోపము వచ్చినది. గణపతిదేవుడు బ్రాహ్మణుల కధికారము లిచ్చి రాజ్యమును నిర్వీర్యమును చేసినాడను

దురభిప్రాయము గల వాడై చక్రవర్తి యప్పుడు బ్రాహ్మణుల తొలగించి పద్మనాయకుల వెలమల నొప్పించి వారి నాస్థానముల నిల్పిరి. అప్పటినుండి మాస్థితికూడ సన్నగిల్లినది. వారికి గర్వము హెచ్చినది.

తలచయిన నాగిరెడ్డి జక్కన్నల కలయికల ఫలితముగ నాగిరెడ్డిమీద గూడ గూఢచారుల ముద్ర కనిపింపసాగినది నాగిరెడ్డి ప్రతియదుగు నెవరో పరీక్షించుచున్నటు లున్నది.

ఒకనా డున్నటు లుండి జక్కన్న సాయంవాహ్యాళి వెడలినప్పుడిరువురు భటులు బంధించి తీసుకొనిపోయిరి.

## ౧౧

చీకటి పడినది. జక్కన్న నుంచిన కారాగారము మిగుల నిరుకై గాలిరాకుండ గబ్బిలములచే గప్పబడి దుర్వాసనాయుతమై యున్నది. గాలి యాడుటలేదు. ఒడలంతయు నుడికి పోవుచున్నది. జక్కన్న నొక్కని నొక చిన్నగది యందు బంధించిరి. సేవకు డొక చిన్న యాముదపు ప్రమిదను దానిలో నొక చిన్న వత్తిని వైచి దివ్వెను వెలిగించి లోననుంచి కొంత యాహార మొకపాత్రయందుంచి తీసికొని వచ్చి యాగదియందుంచి గదికి తాళమువైచి వెడలిపోయినాడు. జక్కన్న కా సేవకుడు వచ్చుట దీపమును నాహారమును నచట నుంచి పోవుట తెలియదు. అత డచ్చట నున్నాడే కాని యాతని మన స్సెదో కలతవారి యున్నది. ఆతనిని బంధించిన యాచెరసాల యొకవిశాలమైన యావరణలో నున్నది. ఆవరణమునకు జుట్టును బలమైన ప్రహరి కట్టబడియున్నది. ఎట్టిపరిస్థితులయందును బంధితుడు తప్పించుకొనిపోవ నవకాశము లేదు. ఆ ప్రహరిగోడమీద గాజుపెంకులు శూలములవలె

నతుకబడియున్నవి. జక్కన్న గదియందలి గవాక్షమునుండి చూచుచున్నాడు. గవాక్షమునుండి సన్నని గాలిపొలు యొక్క డప్పుడప్పుడు లోనికిఁ జొచ్చుకొని వచ్చి వాసనను కదల్చి యధికమును చేయుచున్నది. జక్కన్న మనసున బాధ నొందుచున్నాడు. కారాగారమున నడుగిడగనే జక్కన్న మనమున మొదట గుర్తు వచ్చినది చండి, తరువాత స్వామి. తాను కొంచెము ప్రొద్దుపోయి యింటికివచ్చుచో తనకొఱకు భోజనము సేయకయే ప్రతీక్షించుచుండెడిది. తన్ను చూడగనే యామె కన్నుల నానందము తాండవించుచుండెడిది. త్రపామధురాంగకాంతులు జాలువారెడివి. ఆమెచూపులు ముగ్ధమనోహరములు. ఆమె కనీనికలయం దమద్భుతముగ మధుధారావర్ణసంయుతసునీల సుమధురకాంతిపుంజముల వెదజల్లుచుండును. ఆమె తన లేమికి నెంత చింతించుచున్నదో! ఆమెసుందరతను వల్లి తన వియోగార్తిచే నెంత క్రాగుచున్నదో. జక్కన్న కామెతలపులే తిరిగితిరిగి రా మొదలిడినవి. స్వామి పాప మేమనుకొనుచున్నాడో. తానన్న కేవల మా స్వయంభూస్వామియందున్న యంత భక్తి. ఆతని వదన మెంత లలితమో హృదయమంత సుకుమారము. పాప మాయన్న చెల్లెంద్రకు తానొక పెన్నిధివలెఁ గనిపించినాడు. అసలు తన్నెందులకు చెఱ పెట్టినట్లు? కారణ మేమైన నున్నదా? ఇది యంతయు నొక విచిత్ర మాయాజాలమువలె నున్నది. చక్రవర్తికి తనపై క్రోధ మేల కలిగినది? తాను వచ్చిన పని కన్నియు నాటంకములే యగుచున్నవి. అసలా సప్తపర్ణి యష్టపర్ణియగు యోగమే లేదా? ఆతని యోజనల కంతు లేకుండ నున్నది. నిన్నటినుండి మంచినీరైన ముట్టలేదు. ప్రొద్దుపోయినకొలది నక్షత్రములకాంతి గవాక్షము గుండ నా గది లోనికిఁ బ్రసరించుచున్నది. జక్కన్న లేచి నిలబడి గవాక్షమునుండి బయటికి చూచినాడు. ఎదురుగ సప్తర్షిమండలము కనుపించినది. మంద

లము వైపున కేక దీక్షగ చూచుచు యోజించసాగినాడు. ఈఖగోళ
మునకును భూగోళమునకును విడదీయరాని బంధము. ఆకసమునందలి
నక్షత్రబలముచే భూమియందు వీరుల జీవితము నాకర్షింపబడుచు
శక్తిమంతము లగుచున్నవి. ప్రతి నక్షత్రమునకు నొక ప్రత్యేకవ్యక్తి
యా నక్షత్రాంశలో భూమిమీఁద నుద్భవించుచున్నాడు. ఫల్గునుడు
ఫల్గునీ నక్షత్ర ప్రభావముచే జన్మించినాడు. అట్లే ద్రోణుని నక్షత్రము,
ధృవనక్షత్రము, అభిమన్యుని నక్షత్రము. ఇట్లే ప్రతి మహావీరుఁడు
నొక్కొక్క నక్షత్రశక్తిచే పాలింపబడుచున్నాడు. కాని యది కృత
ద్వాపర యుగములయందలి మాట. ఇది కలియుగము. ఈకలి
యందు సప్తర్షుల ప్రాబల్య మొక్కటే యున్నది. ఈ సప్తర్షుల కష్టత్వ
మెన్నడును ప్రాప్తించదు. ఆసప్తర్షిమండలమే కలియందు కాకతీయ
రాజమండలముగా నుదయించినారువలె నున్నది. వారికి నష్టమురా
జుద్భవిల్లుట కూడ జరుగరాని విషయము. వృథాప్రయాస కాని సప్త
పర్ణి యష్టపర్ణి కానేరదు. ఈ సామ్రాజ్యమున నేవంకఁజూచినను నెటు
యోజించినను సప్తసంఖ్యాపరివృతమై యున్నది. ఆ సప్తసంఖ్య నష్ట
సంఖ్యను జేయసంకల్పము కలుగుచో నిన్నివిఘ్నములు. అది జరుగని
మార్పు. తా నట్టిమార్పును చేయ సంకల్పించి వచ్చినాడు. కావుననే
యిట్టి యడ్డంకులు కలుగుచున్నవి. కలుగరాని యీ మార్పున
కా పాకాల చెఱువే నిదర్శనము. అచ్చటనే యీ సప్తసంఖ్య నధిగ
మించనితనము కనిపించినది. ఆ సహస్రస్తంభ మంటపము ఆ రామప్ప
గుడిలోని స్తంభనిర్మాణము, ఆదశములకు ప్రధాన స్తంభముగ నేడవ
స్తంభము నెన్నుకొనుట సర్వమును భవిష్యసూచకములై యున్నవా
యనిపించుచున్నవి. నగరముచుట్టునున్న ప్రాకార సంఖ్యగూడ సప్త
సంఖ్యయే. ఈసప్తసంఖ్య నధిగమింపకుండ దానిలోననే కట్టియుంచి
యేదో మహాశక్తి పాలించుచున్నట్లున్నది. అష్టమ విషయ మాలో

చించిన చాలు, నుత్పాతములు కలుగుచుండును. సప్త సంఖ్యాపరి వృత్తమై నంతవరకెట్టి ప్రమాదము కు లేదు. మరి తాను సప్తపర్ణి నష్ట పర్ణిని చేయ నెందులకు వచ్చినట్లు? తన కీవిషయ మిదివరకు తెలియదో! అవును, ఏదో సప్తపర్ణిని అష్టపర్ణినిఁజేసి యందలి శిల్ప మిందు చిత్రించుట యనుకొనినాడు గాని యీ కాకతీయ సామ్రాజ్యస్థితి, దాని సప్త సంఖ్యాప్రాధాన్యము తానిదివరకు చూడలేదు. చూచుచున్న కొలఁది తన కనుమానము పెరుగుచునేయున్నది. ఏమో! ఏది యెట్లు కానున్నదో యనుకొనినాడు. జక్కన్నకు సప్తపర్ణి యష్టపర్ణి కాదను భావము నిశ్చయమైనది. తాను వ్యర్థముగ నీనగరము వచ్చి చిక్కులు పడినా డనుకొనును. విధివిలాస మట్లున్న దనును. తన కీయనవసరపు చెర యేమి టనుకొనును. ఆగదియందటు నిటు లూగక తిరుగులాడును. తన కీనగరప్రవేశముచేఁ జండీస్వాముల బాధ్యత నెత్తినిబడిన దనుకొని నాడు. ఈచెర తనకు వదలునా! ఎవరు వదలింతురు! అట్టివా రెవ రైననున్నారా? తాను చండిని తిరిగి యెప్పుడు చూడఁగలఁడు! స్వామి యెంత దిగులుపడుచున్నాడు! రేయెల్ల నాయనకు నిద్ర రాలేదు. ఉషో రేఖ లుదయింపఁబోవుచున్నవి. జక్కన్న నిదుర వచ్చి తూలినాడు.

ప్రభువు జక్కన్నను బంధింప ననుజ్ఞ యిచ్చినాడే కాని యీయన మనమున నేదో కలగుండు వడినది. ఆయన హృదయమున నొక్కఁడే ప్రధానమై కూర్చుండెను. అది సప్తపర్ణి యష్టపర్ణి గావలె ననునది. ప్రభువు తన మందిరమున నారుబయట పట్టుపరుపులు పరచిన పర్యంకముపై శయనించి యోజించుచున్నాడు. ఆయన హృదయమునకు సప్తప్రాకారములు సప్తతటాకములు కనుపించసాగినవి. కాకతీయ వంశరాజులలోఁ దా నె యంతిముఁడగునా! ఈభావ మాయనకు భరింప వశముకానిది. ఆయన కన్నులకుఁ బైయాకాశమున నడ్డముగ సప్తర్షి

మండల మగుపించినది. ప్రభువునకు భయమైనది. ఎక్కడఁ జూచినను సప్తసంఖ్యాపరిమితమై కానుపించుచున్నది. ఈసప్తపర్ణి త్వరలో నష్టపర్ణి కావలెను. కాకతీయసామ్రాజ్యము వర్ధిల్లవలె ననుకొనెను. రాజునకు నిద్రపట్టుటలేదు. పర్యంకమునుండి లేచినాడు. అంగరక్షకు డొకఁడు "ప్రభూ! ఏమి కావలయును" అని ప్రశ్నించినాడు. ప్రభువు, "నన్నొంటరిగ యోజించుకొననిమ్ము వేధించకు" మని కసరుకొనినాఁడు. ఆయన హృదయమున వేయిచేతులు వెట్టి కలచినట్లున్నది. తాను ప్రకటనచేసి యేడాది కావచ్చుచున్నది. ఇంతవరకెవరును రాలేదు. ఈయన యొక్కఁడే వచ్చినాడు. కాని మాచలదేవి దృష్టి యీయనయందు బద్ధమైనది. తా నట్లోర్చుకొనును? అది నిజమా? ప్రజలు చెప్పుకొనుచున్నారు. తాను చూచెనా? తాను చిత్రశాలాప్రవేశదినమున చూచినాడు. తరువాత నామెయింటికి పోవనే లేదాయెను. ఆయన మహాశిల్పియట! జక్కనాచార్యుని మనుమడు. ఆయన తప్ప తన రాజ్యమున నట్టి శిల్పమును చెక్కఁగల శిల్పియే లేడా? ఉండినచో రారా? ఆయన యొక దేవతామూర్తివలె నున్నాడు. ఆయన ఫాలమున నేత్రముల తేజస్సు తరుముకొని వచ్చుచున్నది. ఆయనయే యీపనికి సమర్థుఁడని తోఁచుచున్నది. ఆయనను తానెందులకు బంధించుమని మొదల యొసగినట్లు? ఆయన తనపట్ల నేమి యపచారము సల్పినాడు? అపచార మేమైనఁ జేసినచో మాచి చేసినది కాని యతఁడు కాఁడే! అయినచో నామెను చెఱబట్టవలయును కాని యాతనిని కాదే. తానామె నేమిసేయగలఁడు? ఆమె తనసర్వస్వము. తానామె నేమియు ననజాలడు. మరి తన సప్తపర్ణి కష్టమపర్ణ మదెట్లు వచ్చును? ఆ కార్యమున కీ శిల్పియొక్కఁడే సమర్థుఁ డనిపించుచున్నది. ఆయన మూర్తియే సర్వసమర్థత్వసూచకముగ నున్నది. చక్రవర్తి కేమియు పాలుపోవుటలేదు. రేయెల్లఁ గంటిమీఁద కునుకులేదు. తెల్లవారినది. కాల్యములఁ దీర్చుకొనిన యనంతర

మాయన తన యాలోచనామందిరమునఁ గూర్చుండి చింతింపసాగెను. తన కేలనో యూశిల్పిని చెఱ విడిపించినచో నీపని చేయఁగలఁడనిపించు చున్నది. తనకుఁ గావలసినది కిమునకయా లేక సామ్రాజ్యాభివృద్ధి వంశాభి వృద్ధియునా ? తన కార్యము నెరవేరినపిమ్మట నేమయినఁ జేయవచ్చును గద ! ప్రభువు మరల నాలోచించినాడు జక్కన్నను విడిపింతునా యను కొనును. అవును తాను తప్పక నేడే విముదంకు మొదలయిచ్చును. తన సప్తపర్ణి యష్టపర్ణి యయి తీరవలయును. ప్రభు వావేశపరునివలె నని నాడు. ' ఆయన యెనిమిదవ యాకుఁ దప్పక చేయగలడు. ' తనకు నమ్మక మున్నది. ఇంతలో ద్వారదేశమున నొక పరిచారక వచ్చి నిలిచినది. ప్రభు వామెను చూచి యనినాడు — ' భైరవీ! నీవచ్చిన పనియేమి ? '

భైరవి:— తమరిని మాచలదేవిగారు దర్శించ వాంఛించు చున్నారు. నాముఖమున తమకు నివేదింప నామె యాజ్ఞాపించినారు.

చక్ర :— సరి. నీవిక పోవచ్చును.

భైరవి చక్రవర్తికి నమస్కరించి వెడలిపోయినది. మాచల్దేవి యాసందేశము ప్రభువునకు కోపహేతువైనది. ఆయన యాలోచనలు చెదరిపోయినవి. ఆయన యట్లే నిస్తబ్ధుడై కూర్చుండిపోయినాడు.

౧౨

భైరవి తిరిగి వెళ్ళుచు రాజు మొగముఁ జూచినది. అప్పు డాయన ముఖభంగిమ, కన్నులయందలి కావిరంగు క్రోధముచే మిగుల నదరుచు నెఱ్ఱవారియున్న ముకుపుటములు సర్వ మామెకు భయము కలిగించినవి. ప్రభువున కంత కోప మేలకలిగెనో, అది యెవరిమీదనో యామెకు తెలియలేదు. మాచలదేవియందా ? తనకు నమ్మకములేదు.

మాచల్దేవి యీ నగరమునకు వచ్చి పదియేండ్లయినది. ప్రభు వామెపై నవ్వులకేని కినుక వహించి యెఱుఁగడు. కాని కొన్ని నెలలుగ ప్రభువు మాచల్దేవి యింటికి వచ్చుటయే మానివేసినాడు. ఊరిలో వార్తలు వింతలుగ నున్నవి. ఆమెలో నేవికారము కానుపించదు. మఱి ప్రభువు మనమునందలి యనుమాన మామెకుఁ దెలియనిదా? మఱి యామెలో నేవిధమైన యాందోళనలేదు. ఆమె పోవుచునే యున్నది. మాచల్దేవి యంటిదారి శిల్పివాడమీఁదుగఁబోవుచున్నది. వాకిటఁ జండి కనిపించినది. భైరవి యామెను చూచినది. చండి నలిగియున్నది. అమెలో నేదో గంభీరముద్ర కనిపించుచున్నది. ఆమె కన్నులలో మునుపటి చాంచల్యము లేదు. పెదవులఁ జిలిపిచిఱునవ్వు కరవైనది. భైరవినామె చూడలేదు. భైరవి కామెతో మాటాడ బుద్ధిపుట్టినది. ఆమె చండి యింటికిఁ బోయినది. భైరవినిఁ జూడగనే చండికి గన్నులనీరు తిరిగినది. చండిలో నీమార్పేల వచ్చినదో భైరవి కర్థము కాలేదు. జ్వర మేమైన వచ్చిన దేమో! అయినను చండి యింత బేలకాదు, కారణ మేదో యుండి తీరవలయు ననుకొనినది.

భైరవి:— అమ్మా! చండీ! అట్లయి పోయితివేమి? చాల నీరసించి నట్లున్నావు? మీయన్న యేడీ?

చండి:— మాయన్న యింటిలోనున్నాడు. పోదము పద

భైరవి చండి యిరువురు లోనికేగిరి. లోన స్వామి తలవంచుకొని విచారగ్రస్తుడై కూర్చుండి కనుపించినాడు. భైరవి యాయన్నసెల్లెంద్ర మార్పున కాశ్చర్యము పొందినది. చండి భైరవిఁగూర్చుండఁబెట్టి తానును కూర్చున్నది. ఐదారునిముసములవఱకెవరును మాటాడలేదు. భైరవి స్వామియింటికి వచ్చుటకది మొదటిసారి. ఆమె స్వామినిఁగూర్చి విన్నదికాని చూచినది లేదు. భైరవిని స్వామి యెఱుఁగడు.

చండి అన్నది — 'అన్నా! ఈమె మాచల్దేవివద్ద పనిసేయుచున్నది. పేరు భైరవి. ఈమె నాకు దగ్గరిచుట్టమువలె సాయము చేయును.'

స్వామి తలయెత్తి భైరవిని చూచినాడు. మాచలదేవి పేరు వినగనే స్వామి కొడలు జలదరించినది. భైరవి ముప్పది సంవత్సరముల వయస్సు కలది. విచిత్రాలంకరణప్రియ. ఆమె చిత్ర విచిత్రములైన కేశ బంధము లమర్చుటయందు, మాలాగ్రథనమునందు, తిలకము తీర్చుట యందు నెఱజాణ. ఆమెయే దినమున కొక వేసము సంతరించుకొనును. పరోపకారమన్న చెలిమియన్న ప్రాణము తీసి యరచేతఁ బెట్టును. ఆమె కన్నుల నెల్లపుడు దయారస ముట్టిపడుచుండును. ఆమె బ్రహ్మ చారిణి. మాచలదేవి యన్న నామెకు మిక్కిలి మక్కువ. మాచల దేవి యామెను స్నేహితురాలినిగ నాప్తబంధువుగ జూచికొనును. భైరవి ముఖలక్షణములఁ బరికించి, మనస్సులను చదువగలిగినంతటి యూహా శాలిని. స్వామి భైరవివంక సాభిప్రాయముగ తిలకించి చండి దిక్కు యనినాడు — 'ఈమె మాచలదేవి యొద్ద నున్నదా? ఒక్కసారియుఁ జెప్పవైతివేమి?'

చండి :— చెప్పకున్నచో వచ్చిన నష్టమేమి?

స్వామి :— అవును. నీవన్నదియు నిజమే. మన మిప్పు డామెకుఁ గన్పింతుమా? అది యంతయు నొకనాటిమాట. ఆమె చాలా చిత్ర మైన మనస్సు గలది. ఆమె తిరస్కృతికాని తిరస్కృతిని చేయును. స్వామి యొక వేడినిట్టూర్పు విడిచినాడు. భైరవి నుపలక్షించి 'యామె కుశలమా?' యనినాడు.

భైరవికి స్వామియం దొకవిధమయిన జాలి పుట్టినది. 'మాచలదేవిని మీ రెరుగుదురా?'

చండి :— అవును. ఆమెయింటిలో మే మొకరముగ నుండెడి వారము. ఆమె యీనగరము రాకముం దామె మేమున్నచో ప్రాణముగ నుండెడిది. ఇప్పు డామెకు మేము జ్ఞాపక మున్నామో లేమో!

భైరవి :— ఆమె యటువంటి యామె కాదే! నా కామెతో తొమ్మిదేండ్లు దగ్గఱ తన మున్నది. ఆమెతో మీకంత చనవె ట్లేర్పడినది?

స్వామి :— ఆమెది మాది కూడ నిందులూరే.

భైరవి :— అటులనా?

మాచలదేవి ప్రసంగము వచ్చినప్పటినుండి స్వామియం దొక విధమగు కలవరపాటు, ఉద్వేగము, జలదరింపు నేనో రకములుగ నున్నది. భైరవి యిదియంతయు గమనించుచున్నది. వీ రిద్దఱ మధ్య నేదో గ్రంథము జరిగియుండు ననుకొనినది. పై కేమియు ననలేదు.

చండి :— భైరవీ! ఏమైనదో వింటివా?

భైరవి :— ఏమది?

చండి :— నేను నీతో చెప్పితి కి రాజదర్శన మార్గము కావలెను. ఒక మహాశిల్పి కని!

భైరవి :— ఆఁ...ఆఁ...ఏమైనది? వెళ్ళినాడా?

చండి :— అవును. వెళ్లినాడు. ప్రభువు కుపితుండై యాయనను చెఱఁ బెట్టించెను. చండి మోమున విషాద రేఖ లలముకొని పోయినవి, 'నాయంతట నేను బంపితిని. నా కేమో దిగులుగ నున్నది. ఆమెకన్నుల నీరు తిరిగినది.

స్వామి :— ఆయనలేని యీ యిల్లు మాకు స్మశానమువలె నున్నది. మాకేమియుఁ దోచుటలేదు. చక్రవర్తితో నెవ్వరు చెప్పుదు రాయన దోసమేమియు లేదని ?

భైరవి :— ఆయన మహాశిల్పియా ?

చండి :— అంతియే కాదు, మహాజ్యోతిష్కుడు. మంత్రవేత్త. పండితుడు. సిలువెల్ల నమృతము ముద్దకట్టినమూర్తి. నేనె యీచేతులఁ జెఱబెట్టిన ట్లయినది. మరల నాయన నెప్పుడు చూతుమో ? ఆయనను విడిచిపుత్తురా ? తనంతట తానై వచ్చిన రత్నఖనిని బుద్ధిపూర్వకముగ చేజార్చుకొన్నాము.

ఆమె మాటాడలేక పోయినది. భైరవి యీ యన్న చెల్లెండ్ర మనస్థితుల నూహ సేయుచున్నది. ఇరువురకొకే స్థితి పట్టినది. బహు విచిత్ర జీవులు, అనుకొనినది.

స్వామి :— అయినచో చండీ ! మాచలదేవి యేమైన మనకు సాయము చేయునేమో, చక్రవర్తి యామెవాడేనఁట గద !

స్వామి భాషణములందు వెటకారముతోఁగూడిన బాధ వ్యక్తమగుచున్నది.

చండి :— లాభము లేదు. అన్నా ! నీ పిచ్చిగాని యామెకు మనతో నేమిపని ? నీయంత మెత్తనివాడవు నీవే.

భైరవి నవ్వుకొని వెడలి వత్తునని లేచినది. చండి ద్వారము వరకు సాగనంపవచ్చి బంధితును విడుదల వార్త లేమైన తెలిసినచో వెంటనే తెలుపుమని వేడిన దామెను.

స్వామికి మాచల్దేవిమీఁది ప్రేమ, యామె మృదుతరప్రకృతి, చండీ జక్కన్నల ప్రేమ సర్వము భైరవి, కనిపెట్టినది. మాచలదేవి యెంతటి నిబ్బరము కలది! తనతో నీవిషయము నెన్నఁడు ముచ్చటించనే లేదు. ఆమె మహాసముద్రము. ఆమెలో మహారాణుల లక్షణము లున్నవి. స్వామి యెంత యందగాఁడు! మాచలదేవిని గుఱించి ప్రస్తావించినంతసేపును స్వామి భైరవికి చిత్రముగఁ దోఁచినాఁడు. పాప మాతని కీమెయందు మక్కువ కాబోలు!

ఆ శిల్పిని విడిపించవలెను. చండి నవ్వులే పోయినవి. ఆకొంటె తనము మాయమైనది. ఎన్నో యేండ్లుగ జబ్బుపడిన దానివలె నున్నది. వాడిపోయిన మాలతీలతవలె నయినది. ఆయనను విడిపించుచో మరల యథాస్థితికి వచ్చునా? అయినను చక్రవర్తి కీయనపై పగ యేమి? శిల్పి విముక్తి యెట్లు జరుగును? ఆమె యాలోచించుచు నడచుచున్నది. 'ఆఁ మరచితిని. నగరాధ్యక్షునితో సంప్రతింతునా?' యనుకొనినది. గన్నయమంత్రితో భైరవికి మిగుల చనవు. ఆయన భైరవిని సహోదరిని వలెఁ జూచును. నాగయగన్నమంత్రి మదుకు గ్రామమునందలివాఁడు. భైరవియు నా గ్రామవాసిని యే. గన్నయ నెలలవయసుననే తల్లిని గోల్పోయినాఁడు. ఆమె ప్రసూతివాతముచే మరణించినది. భైరవి కుటుంబమునకును నాగయ కుటుంబమునకును మిక్కిలి కలివిడి. భైరవి తల్లి నాగయతల్లియు చెలిమికత్తియలు. అప్పసెల్లెండ్రవలె మసలు కొనెడివారు. నాగయతల్లి చనిపోవుచు కుఱ్ఱవాని నామెచేతఁ బెట్టి 'వీనిఁ బెంచి పెద్దసేయు భారము నీదే' యని చెప్పినది. భైరవి కొక యన్నగా నుండెడివాఁడు. అతనితోపాటు నాగయనుకూడ స్తన్యమొసగి పెంచిన దా తల్లి. తరువాత రెండేండ్లకు భైరవి పుట్టినది. ఈమెను నాగయ యొక చెల్లెలివలె చూచును. నగరాధ్యక్షుఁడైనతరువాత

భైరవిని మరచినాఁడు. మదుకులో భైరవి పరిస్థితి విషమమైనది. తల్లి చనిపోయినది. తండ్రి యంతకుముందే పోయినాడు. ఆమె ఓరుగల్లు వచ్చి నాగయకు, తనస్థితిఁ జెప్పుకొని వాపోయినది. ఆయన యామెనోదార్చి మాచలదేవిదగ్గఱ నుండ నియమించినాడు. ఆ యుంచుటలో నచ్చటివార్తలు తన కెప్పటి కప్పుడు తెలియఁజేయునట్లుగ చెప్పెను. అప్పటినుండి తన జీవితము సుఖముగ జరుగుచున్నది. ఆయనను కలుసుకొని యీవిషయముఁ జెప్పినచో నాయన చక్రవర్తితో నివేదించి విడిపింపఁజాలఁడా? అయినను చెప్పి చూతమనుకొని యామె సరాసరి నగరాధ్యక్షుని సౌధమునకుఁ బోయినది. అచ్చటి కావలివారామెతో మంత్రి యత్యవసరమైన రాజకార్యములయందు మునిగియున్నారు. దర్శనమెవరికి నీయబడదనియు, లోపలికిఁ బో వీలులేదనియు ఖండితముగఁ జెప్పిరి. "భైరవి వచ్చినది, తమ దర్శనము కావలెనట, అత్యవసరమైన పనిమీఁద వచ్చినది. తమతో మాటాడవలయు నన్నదని చెప్పుడు అప్పు డాయన యేమనునో నాకుఁ జెప్పుడు" అని యామె యచట కూర్చుండెను. వారు లోనికిఁ బోయి యట్లె చెప్పి తిరిగివచ్చి భైరవిని లోనికిఁ గొంపోయిరి. భైరవి లోనికిఁ బోవుసరి కాయన యేదో వ్రాసుకొనుచున్నాడు. భైరవి రెండునిముసము లట్లె కూర్చుండినది. నాగయ గంటమును బల్లపై నునిచి తలయెత్తి భైరవివంకఁ జూచినాడు. భైరవి లేచి నమస్కరించి నిలిచినది.

నాగయ :— భైరవీ! అవసరమైన పని యేమున్నది? క్రొత్త వార్త లేమైనఁ దెచ్చితివా?

భైరవి :— అవసరమైన పనియే. మూడుదినములక్రింద చక్రవర్తి యొక్క మహాశిల్పిని, మన సప్తపర్ణి నష్టపర్ణినిగ చేయుటకై వచ్చిన యాతనినిఁ జెఱఁబెట్టెనట.

నాగయ :— ఆఁ అతనినేనా ? చెఱఁబెట్టినా ! ఎందువలననో ! అతడు చాల నహంకారము కలవాఁడు. ఎవ్వరిని లెక్కసేయఁడు. మిగుల సాహసి.

భైరవి :— చక్రవర్తి దర్శనము కాకుండ నున్నదని యాయన యొకనాటి సాయంకాల మాపూఁదోటలోనికిఁ బోయి చక్రవర్తి సౌధ గవాక్షమున కెదురుగ నిలబడి చక్రవర్తిని చూచెనట. ఆయన చేసిన తప్పిదియ.

నాగయ :— అదేమి యట్లంటువు ? చక్రవర్తి యనుజ్ఞలేకుండ నట్లు సేయుట నేరముకాదా మరి ?

భైరవి :— మరి దర్శనమే కాకుండ నున్నపు డాయన యేమి సేయును ? ఆయన మహాజ్యోతిష్కుఁడు. పండితుఁడు. మంత్రవేత్త. ఈమాత్రపు సాహసమునకు చక్రవర్తి కాయనపై నంతకినుక కూడ దేమో ? సప్తపర్ణి కష్టమపర్ణము నాయన యొక్కఁడే చేయగలఁడు. చక్రవర్తి చేజేతుల నట్టిమహాశిల్పిని బంధింప నాజ్ఞ యొసగుట ద్వారా మహావకాశమును జాఱవిడిచికొనినాఁడు. ఒకనాఁడు ప్రభు విందులకు చింతించితీరును.

నాగయ :— ఆయన మహాజ్యోతిష్కుఁడా ! అయిన నీవేమందువు ?

భైరవి :— ఆయనను విడుదల చేసినచో మన రాజ్యమునకు క్షేమము. నిష్కారణముగ నాయనను కారాగారమున నుంచుట యన్యాయము. ప్రభువున కీవిషయమును సవిస్తరముగఁ జెప్పిన నాయ నకు విడుదల లభించునేమో యని......నాగయ యాలోచించినాఁడు. తా నొకమారు జక్కన్నను కలసికొని తురకలతోఁడి యుద్ధము

జయాంకమో లేక మరియేమో కనుగొనవలయు ననుకొనినాడు. అని నాడు. "భైరవీ! నీవు పొమ్ము. నే నీవిషయమై యోజింతును."

భైరవి వెడలిపోయినది. ఆదినమున నే సాయంతనమున నాగయ గన్నమంత్రి జక్కన్నను కారాగారమున దర్శింపబోయెను. జక్కన్న నగరాధ్యక్షుని తన దర్శనమునకు వచ్చినవానిని చూచి యత్యాశ్చర్యముఁ జెందినాడు. తా నాయన వాకిటయందు పడిగాపులు గాయగా దర్శనమీని యీయని యాయన తాను చెఱలో నుండగ ప్రత్యేకముగ తనవద్ద కేలవచ్చెనో యనుకొనెను. నాగయ వచ్చి జక్కన్నకు నమస్కరించెను. ఇది యంతయు జక్కన్న కద్భుతముగ నున్నది. తిరిగి నమస్కరించినాడు.

నాగయ :— స్వామీ! తా మంతటివారని నాకు తెలియక తూలనాడితిని. క్షమింపుడు. తాము మహాజ్యోతిష్కులట.

జక్కన్న నవ్వి యనినాడు :— 'ఎవరో మీకట్లు చెప్పి యుందురు. వా రనినంతవాడనుకాను. ఏదో కొంచెము తెలియును.'

నాగయ :— అంతియ చాలును. నన్నొక సందేహము వేధించు చున్నది. అది సామ్రాజ్యవిషయము. మీ రేమైన జోస్యము చెప్పుదు రేమో యని వచ్చితిని.

జక్కన్న :— ఏమది?

నాగయ :— తురకలు దేశముపై దండెత్తి వచ్చుచున్నారు. భయంకరమైన యాహవ మనివార్య మగున ట్లున్నది. జయాపజయములు నిర్ణయింపరానివిగ నున్నవి. మీ రేమైన సెలవిత్తురా?

జక్కన్న రెండునిముసములు కన్నులు మూసికొని యోజించి నాడు. గ్రహబలము చూచినాడు. ఏమో లెక్కపెట్టినాడు. నాగయ

యాతురతగ నాయనవంక కే చూచుచున్నాడు. జక్కన్న కనులు తెరచి యనినాడు. జయము తప్పక హైందవులదై యున్నది. రేఖామాత్ర మైన నపజయశంక లేదు.

నాగయ కొండలు తెలియుని యానంద మొదవినది. 'స్వామీ! పోయివత్తు' ననినాడు. జక్కన్న వినిపించుకొనలేదు. ఆయన యింకను నేదో యోజన చేయుచున్నాడు. నాగయ వెడలిపోవుచు నమస్కరించి మరి పోయినాడు. నాగయ యదివరకు జక్కన్నను స్పష్టముగ చూడ లేదు. ఈవేళ చూచినాడు. ఆయన మోమున నేదో దేవతాతేజము కొట్టవచ్చుచున్నది. మహాపురుషునివలె నున్నాడు. ఈయన యెంతకైన సమర్థుఁడు. చక్రవర్తితో చెప్పి విడిపింపవలయును.

మరునాడు చక్రవర్తితో యుద్ధవిషయములఁ గూర్చి ప్రసంగించు నదనున నాగయ యనినాడు. — "ప్రభూ! మన చెఱసాలలో నున్న యాయన యొక మహాజ్యోతిష్కుఁడు. నేనాయనతో యుద్ధవిషయమై ప్రస్తావించి ఫలితాంశములఁ జెప్పమంటిని. ఆయన మనకు జయమును చెప్పెను. ఆ చెప్పుటయందే విజయము ప్రాప్తించినంత యానందమైనది. ప్రభువులు మన్నించుచో నొక్కమనవి. తామాయనను వదిలివేయ వలయును. ఆయన తప్పక సప్తపర్ణిని అష్టపర్ణి నేయఁగల మహానుభావుఁడు."

చక్రవర్తి మాటాడలేదు. ఆయనకు మరలఁ గోపము వచ్చినది. ఎవరినోటనుండి వినినను నాయనగొప్పఁదనము మహాత్మ్యము నే. తనకే మో యాతనిపై నీసుగ నున్నది. ఆయన యంతటివాఁడని తనకు ననిపించు చున్నది. చక్రవర్తి మాటాడకుండుటఁ జూచి నాగయ యనినాడు. "ప్రభూ! మాటాడరేమి!"

చక్రవర్తి భ్రుకుటిఁ జిట్లించి యనినాడు. "ఆయన జోస్యము నిజమైనచో విడిచిపుత్తము, కానిచో నింతే."

చక్రవర్తి యటనుండి చరచర వెడలిపోయినాడు. నాగయకు చక్రవర్తి కాయనపై నంతకోప మేలనో తెలిసినదికాదు. ఆయనయు లేచి తన సౌధమున కరిగినాడు.

మూఁడవనాటికిఁ దురకలు దేవగిరినుండి బయలుదేరి యుద్ధసన్నద్ధులై వచ్చుచున్నటుల వేగు వచ్చినది. మాలిక్ కాఫరు రాజమాన్యముక్రింద పదివేలగుఱ్ఱములు నాలుగువేలపదాతిదళము లున్నవి. గోల్కొండవద్ద కాకతిసైన్యమూ యవనవాహిని నడ్డి నిల్చినది. ఇందులూరి యన్నయ మంత్రి తన యైదులక్షల కాల్బలముతో గోల్కొండ వచ్చి చేరెను. ఇందులూరి రుద్రుడు పంచపాండ్యుల జయించిన మహాధీరుడు. గజబలాధ్యక్షుడైన చెందవూడి యన్నయామాత్యుడు, అశ్వదళాధిపతి సాహిణిమారుఁడు ములుదు ప్రతాపప్రతినిధిగనున్న మెట్టదాచానాయకు, కాయస్థసేనాను లైన త్రిపురాంతకుఁడు, అంబదేవుఁడు, గుండయ మేచయ, మొదలుగాగల కాకతీయ సేనాధిపతులందరు తమతమ సేనలతోవచ్చి గోల్కొండవద్ద యవనులను దాకిరి. యవనులు ఫిరంగులను విశేషముగా వాడసాగిరి. కాకతీయులకా ఫిరంగులు లేవు. కాని వీరి యుద్ధనైపుణ్యము ముందు వారెందుకుఁ గొఱగాకుండనుండిరి. మూఁడుదినములు పోరు ఘోరముగ జరిగినది. ఇరువాగుల నపారముగ సైన్యము నష్టమైనది. యవను లెప్పటి కప్పుడు పైనుండి కొత్తదళములను తెప్పించుకొనుచుండిరి. ఇందులూరి యన్నయ నగరాధ్యక్షునికి వేగు నడిపి దేవగిరినుండి గోల్కొండకు వచ్చుమార్గము నరికట్టి కాకతీయదళములను పంపించి వారిదళముల మార్గమధ్యముననే నశింపజేయుచుండెను. యవన సేనానులకు ధైర్యము

సన్నగిల్లినది. పైనుండి తమ సైన్యములు వచ్చు జాడలు లేవు. ఆహార పదార్థముల నొకగింజనేని పుట్టనీయకుండు డను అన్నయమంత్రి యాజ్ఞచే కాకతీయరాజ్యమున తిండి దొఱకుటలేదు. దినదినమునకు సైన్యము నష్టమగుచున్నది. ఈ కాకతీయాంధ్ర సేనానులు కాలాగ్నిరుద్రులవలె యవనులపై విజృంభించి వారిని దునుమసాగిరి. వీరి ధాటికోర్వజాలక యవనులు విచ్చి పారిపోదొడంగిరి. ఆంధ్రసేనానులు వారిని వెన్నంటి దేవగిరి సరిహద్దులవరకుc దరిమివేసిరి. ఆంధ్ర చక్రవర్తికి విజయము చేకూరినది.

విజయవార్త నాలకించిన మరునిముసమున చక్రవర్తి మనస్సున మెదలినది జక్కన్న. ఈయన దైవజ్ఞునివలె నున్నాడు. ఈయని నిట్లే బంధించి యుంచుదో సామ్రాజ్యమున కేమి ముప్పు వచ్చునో యను కొనినాడు.

విజయోత్సాహసూచకముగ నొక మహాసభ జరిగినది. సేనాను లందరకు బిరుదప్రదానములు జరిగినవి. యుద్ధమున వీరస్వర్గ మలంక రించిన సైనిక కుటుంబములకు జీవనభృతులు కల్పింపబడినవి. చక్ర వర్తి తన సువారమున వారందరకు విందొనర్చెను. సేనాను లందరు తమతమ ప్రదేశములకు వెడలిరి.

జక్కన్నవిషయ మాలోచించినవారు లేరు. భైరవి యొక నాడు నాగయ గన్నయ్య యొద్దకుంబోయి యనినది. — "అరివిజయము ప్రాప్తించినది. మహాశిల్పి యింకను బంధితుడుగానే యున్నాడు. ఆయన పలుకు నిజమయినది. మరి చక్రవర్తి యాయనను వదలలేదు."

నాగయ నాడే చక్రవర్తితో మాటాడెద ననినాడు.

మరునాడు చక్రవర్తి జక్కన్నను చెఱనుండి విడిచిపుచ్చిన వార్త శిల్పివాడయందంతట మారుమ్రోగినది.

## ౧౩

నగరమందంతట విజయోత్సవములు జరుగుచున్నవి. పట్టణమున నేవీధిని చూచినను మామిడిమండలతో పూలమాలికలతో నలంకృతములై శోభాయుతముగ కల్యాణమయమై కనుపించుచున్నది. జక్కన్నను చెఱనుండి వదలిపెట్టిరి. అసలాయన నెందుకు చెఱపెట్టినట్లో యెంతయోజించిన నేటికిఁ దెలియకుండనున్నది. జక్కన్న చెఱసాలనుండి యీవలకు వచ్చినాడు. ఆయనకు చండిపైఁ గోపమువచ్చినది. ఆమెయే తనకారాగార ప్రాప్తికి హేతువనుకొనును. ఆమెయే తానుగ మాయపన్ని తన్ను పూఁదోటలోనికిఁ బంపిన దనుకొనును. వెంటనే యీయనకింటికిఁ బోబుద్ధికాలేదు. ఊరివెంబడి తిరుగఁ దొడఁగినాడు. ప్రతివీధియందు నుత్సవములు కోలాహలముగ జరుపబడుచున్నవి. నూత్నవస్త్రాలంకృతులు పురుషులు, చీని చీనాంబర ధారిణులు వివిధాభరణములు కలవారు స్త్రీలు వసంతోత్సవములు జరుపుకొనుచుండిరి. జక్కన్న యివి యన్నియు నాగియాగి తిలకించుచు పోవుచున్నాడు. ఆయన యట్లు ప్రొద్దుక్రుంకునంత వరకు తిరుగుచునే యుండెను.

సాయంకాలమైనది. జక్కన్న మనస్సున కొకింత యూరట కలిగినది. ఊరంతయు తిరిగి తిరిగి చీకట్లు వచ్చువేళ కింటికిఁ జేరుకొనినాడు. వాకిట చండి విచారదీనములైన చూడ్కుల వీధిపై బఱచుచు ద్వారబంధము నానుకొని నిలుచుండియున్నది. ఆమె నాస్థితియందు చూడగనే జక్కన్న హృదయము ద్రవించిపోయినది. ప్రొద్దుటినుండి వచ్చిన కోపమంతయు మాయమైనది. తానింటి నుండి పోయి సరిగ పదునేను దినము లయినది. ఈ స్వల్పకాలముననే చండియింత కృశించిన దేమి

ఆమె కన్నులలో తళతళలే నశించినవి. తా నామెను వృథగ ననుమా నించినాడు. తా నన్నచో నామె కె.తటి ప్రేమ ! జక్కన్న కంతటి బాధయందును చండిని చూడగనే యానందము కల్గినది. చండి జక్కన్నను చూడలేదు. ఆమె చిఱుగాలికిఁ దూలిపోవునట్లుగ నున్నది. జక్కన్న వెనుకనుండి నెమ్మదిగ చండి దగ్గఱకువచ్చి 'చండీ' యని నాఁడు. చండి యులికిపడి వెనుదిరిగినది. ఆమె జక్కన్న యట్టివేళ వచ్చుననుకొనలేదు. ఆమెకు జక్కన్నను చూడగనే దుఃఖము పెల్లుబికి వచ్చినది. ఆమె చేతులలో మొగ ముంచుకొని వలవల నేడ్వ సాగినది. జక్కన్న కామెనెట్లోదార్ప వలయునో తెలియలేదు. 'నేను వచ్చితినిగద. ఇంకను ఏడ్చుటెందులకు ? రమ్ములోనికిఁ బోద' మనినాడు. ఆమెను తాను లోనికి నడిపించి తీసుకొని పోయినాడు. ఆమె కింకను దుఃఖ ముపశమించలేదు. జక్కన్న కేమిచేయవలెనో తోచుటలేదు. ఆమె కపోలముల స్పృశించి కన్నీరుతుడిచి గడ్డముచేతఁబట్టి యనినాడు—అయ్యో చండీ ! నీవు నిజముగ నాడుపిల్లవైతివేమి ? నేను వచ్చితిని గద. ఇ తలో నిట్లయితివేమి ? ఆమె యింకను నూరడిలలేదు. జక్కన్న మరల ననినాడు. "చండీ! ఇట్లయినచో నేను మాయూరు పోయెదను. మరల రమ్మన్నను రాను. నా కల్లరి చండి యన్నచో నెంతయో యిష్టము. అది సరికాని నీ ప్రేమ యింతటిదేనా ? నేను సరిగ భోజనముఁ జేసి పదునేను దినములైనదే, నాకేమైనఁ దిండిపెట్టుదువా ? లేక యిట్లే యేడ్చుచు కూర్చుందువా ?" ఈమాట విని చండి చివాలున లేచి వంటయింటిలోనికిఁ పోయినది. జక్కన్న కామె యన్న నెందులకో పట్టరాని ప్రేమ యుదయించుచున్నది. జక్కన్న లేచి వంట యింటిలోనికిఁ బోవుచు ననుకొనినాడు. తనకు చండిపై నింత మమకారమేమి యని. చండి నిముసములో వంట పూర్తిచేసి జక్కన్నను బోజనమునకు రమ్మనినది. జక్కన్న స్వామి యే దనినాడు. 'అన్న మిమ్ము

వెదకుచు నూరిలోనికి వెళ్ళినాడు. ఇంకను రాలేదు ' అని చండి చెప్పినది. స్వామికూడ వచ్చినతరువాత భోజనము సేతు మనినాడు జక్కన్న. వారిరువురు స్వామికై యెదురుచూచుచు నట్లే కూర్చుండిపోయిరి. ఇరువురి మధ్య నిశ్శబ్దముగ నాల్గునిముసములు గడచినవి. జక్కన్న చండి మాటాడకుండుటఁ జూచి యనినాడు. 'మరల నేడ్చుచుంటివా యేమి?'

చండి :– నే నేడ్చుచుండుట మీకిష్టమా ?

జక్కన్న :– అదిగో తుల్లరి మరల మొదలు.

చండి :– నాతుల్లరి నెవరును సైరింపరు.

జక్కన్న :– కోపమా ?

చండి :– కోపము వచ్చిన నెవరు తీర్తురు ?

జక్కన్న :– చండీ! ఎందుకంత యుడికిపోదువు ?

చండి :– ఔను, పాపము ప్రొద్దున్ననుండి మేము గుర్తునకు రాలేదు. కాని...

జక్కన్న :– అదా! తెలిసినది. నిన్ను బ్రతిమాలుకొందును. కోప మూనకుము. చండి కిలకిల నవ్వినది. ఆ నవ్వు జక్కన్న మనమున మువ్వలప్రోతలై విరిసినది. స్వామి వచ్చినాడు. జక్కన్నను చూచి యాశ్చర్యముఁ జెంది యమాంత మాయనను గాగిలించుకొని, 'అన్నా! ప్రొద్దుననుండి రాలే దే' మనినాడు. నాటిరాత్రి మరల నానందము తాండవించిన దాయింట.

ఒకరోజున భైరవి వచ్చినది. భైరవి జక్కన్నను చూచినది. చండి యట్టి యతిలోకసుందరుని బ్రేమించుటచే నదృష్టవంతురాలైన

దనుకొనినది. భైరవి వచ్చునప్పటికి జక్కన్న చండీస్వామునకు శిల్ప విషయకముగా బాఠము చెప్పుచున్నాడు. భైరవికూడ వారివద్దనే కూర్చుండినది.

జక్కన్న :— ఉత్తమ విగ్రహము నూట యిరువది నాలుగు అంగుళు లుండవలయును. విగ్రహములు మూడు రకములు. ఉత్తమ, మధ్యమ, అధమములు. మధ్యమ విగ్రహము నూటయిరువది యంగుళులు. అధమ విగ్రహము నూటపంద్రెం డంగుళులు. ఉత్తమ విగ్రహమునకు నేత్రములు ఏడేసి యవము లుండవలెను. ఫాలము తొమ్మిది అంగుళులు. విగ్రహము సూటిగనుండి లలితభావ స్ఫోరకముగ నుండవలయును. వంగిన ముఖము గలిగిన విగ్రహము శిల్పనాశమును ఆత్మగౌరవభంగమును కలిగించును. విగ్రహము ముక్కు మూడు యవములకు మించుచో నావిగ్రహనిర్మాణకర్త యైన రాజు నశించును. మన నగరమున నట్టి దోష భూయిష్ఠము లైన విగ్రహము లెన్ని యేని కలవు. జక్కన్న చెప్పుచున్నంతసేపును చండి యాతనివంకకే యర్ధ నిమీలితాక్షియై చూచుచున్నది. జక్కన్న పాఠము చెప్పుచున్నట్లు లేదు. ఉబుసుపోకకు నల్గురు స్నేహితులొకచోటఁ జేరి సంభాషించు వైఖరిగ నున్నది. ఆయన గురువు వలె బోధసేయడు. చెలికాని వలె సలహాల నిచ్చును. ఆయన పాఠము చెప్పుటను చూచి భైరవి చకితురాలైనది.

జక్కన్న :— ఈ నగరశిల్పులు మంచిపనివాండ్రే కాని యూహాశాలులు కారువలె నున్నది. ఆ రామప్ప, సహస్రస్తంభమంటపము, స్వయంభూకేశవ దేవాలయముల నెచ్చట చూచినను పనితన మెక్కుడుగ నున్నది; కాని భావకల్పన తక్కువ. అట్టికల్పన మహాశిల్పికి కాని యమరదు. మా ముత్తాత యొక మహాశిల్పి. ఆయన శిల్పము

సంతను నాలో సంకిత మొనర్చుకొనినాను. నే నీ సప్తపర్ణిని అష్టవర్ణిగ తప్పక సవలీలగ చేయఁజాలుదును, కాని నాకు రాజదర్శనమే కాకున్నది.

భైరవి చండితో ననినది – 'చండీ! నే నీయనను నగరాధ్యక్షు నొద్దకు తీసుకొనిపోవుదును. ఈయన యంగీకరించునో లేదో. అంగీకరించుచో గన్నయ ద్వారా చక్రవర్తి దర్శనము కావచ్చును.

జక్కన్న :– ఆయన యొద్ద కిప్పటికి చాలమారులు వెళ్ళుట తిరిగి వచ్చుట లయినవి.

చండి :– భైరవీ! నీ వాయనను నగరాధ్యక్షునియొద్ద కెట్లు తీసుకొనిపోయెదవు?

స్వామి :– నీ కాయనయొద్ద నెట్టి చనువు?

భైరవి :– ఆయన నన్ను తన చెల్లెలివలె చూచును.

జక్కన్న :– అదెట్లు?

భైరవి – మే మిరఁపుర మొకతల్లి పాలు త్రావినవారము.

స్వామి :– అయిన మీరిద్ద రన్నా చెల్లెండ్రా?

వారి ముప్వురి నయనముల నాశ్చర్య ముదయించినది.

భైరవి :– నాగయగన్నమంత్రి తల్లి యాతని పసితనమున చనిపోవగా మా యమ్మ యాయనకు పాలిచ్చి పెంచి పెద్దచేసినది. ఆతరువాత నాపుట్టుక. అది నా కాయన యందలి చనవునకు హేతువు.

చండి :– నీవేదైన చెప్పినచో నాయన యంగీకరించుట యనున దున్నదా?

భైరవి :— అంగీకరించుననియే తోచును.

స్వామి :— ఇదివర కెన్నడేని యిట్టియవసరములు కలిగినవా ?

భైరవి :— ఒకేయొకసారి కల్గినది. అది యీమహాశిల్పి విషయమునసే. జక్కన్న చండీస్వాము లాశ్చర్యముగ్ధులై చూచుచున్నారు.

భైరవి :— చండీ ! నీవీయన మహాజ్యోతిష్కుఁడని చెప్పగానే యీయనతో చెప్పి యంతటిమహావేత్తను చెఱయందుంచుట రాజ్యోపద్రవ హేతువంటిని. ఆయన యీ మహానుభావుని యుద్ధఫలిత మడిగెను. ఆ ఫలితములఁ జక్రవర్తితో చెప్పెను. ఆయన యుద్ధఫలితములనుగూర్చి చెప్పిన జోశ్యము ఫలించుచో నీయనను చెఱనుండి విడుదల గావింపవచ్చుననెను. విజయము ప్రాప్తించిన తరువాత మరల నాప్రస్తావనయే రాలేదు. నేను నాగయగన్న మంత్రివద్దకుఁ బోయి యడుగగా నాయన చక్రవర్తితో జెప్పెను అప్పుడీయనను ముక్తబంధుని జేసిరి. నగరాధ్యక్షునియొద్ద భైరవికున్న పలుకుబడికి జక్కన్న మిగుల సంతసించినాడు. తన కార్యము సఫలమైన దెంచినాడు. భైరవి జక్కన్న నెప్పుడుకోరిన నప్పుడు తాను నాగయదగ్గరకుతీసుకొని పోదునని సెలవు తీసికొని వెడలిపోయినది.

మరల చండి యథాస్థితికి వచ్చినది. స్వామి ముఖమున వసతో దయమైనట్లున్నది. జక్కన్న కొక్కనికి మాత్రము చక్రవర్తి దర్శనాపేక్ష వదలుటలేదు. తాను తలఁచినపని నైమెతిరపలయును. జక్కన్న రొకదినమున నాగిరెడ్డి యింటికిఁ బోయినాడు. ఆయన చక్రవర్తి దర్శనము విషయమై ప్రస్తావించెను. వచ్చినపని యంతటంతట నగుచున్నది. యేమి తెల్చినావని యడిగెను. జక్కన్న భైరవి నాగయగన్న మంత్రుల సంబంధము చెప్పి యామె ద్వారమున చక్రవర్తి దర్శనము చేయు

వచ్చుననినాడు. అయినను నాగిరెడ్డిని కూడ మరల నాగయతో నొక పర్యాయము చెప్పుమనినాడు. ఆయన యట్లే చేయుదుననినాడు.

జక్కన్న :— ఏమైనను యిప్పుడు చక్రవర్తికి నేనునిన కొంచెము గురి కుదిరినది లెండు.

నాగి :— అటులనా? దర్శనము కానిమూందే యదెట్లు సంభవించినది?

జక్కన్న :— నేను చెఱలో నుండగ, నగరాధ్యక్షుఁడు వచ్చి యుద్ధమున జయాపజయములఁ గూర్చి జోస్యమడిగెను. నేను చెప్పితిని. అది నిజమయినది. అందులకు చక్రవర్తి మిగుల సంతసించెనని తెలిసినది.

నాగిరెడ్డి :— అయినచో నీమారు చక్రవర్తి దర్శనము తప్పక కావచ్చునని తోచుచున్నది.

జక్కన్న :— సరి. ఏదియైనఁ గానిండు. మీరు మాత్ర మాయనతో మరల నొకసారి హెచ్చరింపుడు.

జక్కన్న వెడలిపోయెను.

ఐదు దినముల పిమ్మట యొకనాడు నాగిరెడ్డి నాగయగన్న మంత్రితో నీవిషయము కదల్చెను. పాపమా సాయ మాయనకుఁ జేసి పెట్టుమని బతిమాలుకొనెను. కాని లాభము లేకపోయినది. ఎప్పుడు నాగిరెడ్డి నాగయతో నీవిషయము కదల్చెనో యప్పుడు నాగయ మంత్రికి మరల జక్కన్నపై నభిమానము ప్రేమ గౌరవములు దూరమైనవి. జక్కన్న తన కెదిరిపక్షమైన నాగిరెడ్డితో చెలిమి చేయుచున్నాడు.

జక్కన్న కేమియు పాలుపోవుటలేదు. భైరవిని పిలువపంపి తన్ను నగరాధ్యక్షు నొద్దకు తీసికొని పొమ్మని యడిగినాడు. ఆమె వల్లె యనినది.

మరునాడు భైరవి జక్కన్నను వెంటఁ బెట్టుకొని నగరాధ్యక్షుని యొద్దకుఁ బోయినది. నాగయకన్నమంత్రికి జక్కన్నపైఁ గోపముగ నున్నది. కాని యేమనును ? ఏమియు ననలేదు. వచ్చిన జక్కన్నను గౌరవించి యాసనముఁ జూపి యనినాడు — 'స్వామీ ! తమ వచ్చిన పనియేమి ?

జక్కన్న :— అయ్యా ! సప్తపర్ణికి అష్టమపర్ణము కావలెనని ప్రకటించిరి. ఆయాతుఁ జేయుటకు వచ్చితిని. పూర్తిగ సంవత్సరము గావచ్చుచున్నది. ఇంతవరకు చక్రవర్తి దర్శనభాగ్యమే కలుగుట లేదు. అందుచే మీసాయ మపేక్షించి వచ్చితిని.

నాగయ :— అట్లే. తమ విషయమే ముందాలోచింతును. మీరు నిశ్చింతముగ నుండుడు.

భైరవి కన్ను లానందమున మెఱసినవి. జక్కన సెలవుతీసికొని వెడలిపోయెను.

నాగయ భైరవినిఁజూచి యనినాడు—' భైరవీ! నీవిక పొరపాటుననైన నిట్టి వ్యవహారములు నాకడకుఁ దేకుము. అతడు మన కెవెరి పక్షములోనివాడు. అయినను ఆశుదానవు. నీ కీ రాజకార్యములయందుఁ బ్రసక్తి యేమి? ఇఁక నెన్నడు నిట్టివి చేయకుము.'

భైరవి మోమున విన్నదనము తోప నట్లె యొనర్తునని వెడలి పోయినది.

రెండు నెలలు గడచినవి. చక్రవర్తిదర్శనము విషయము మఱ్ఱే మిగిలి యున్నది. ఈరెండు నెలల మధ్య భైరవి యొక్కసారి గూడ స్వామి యింటికి రాలేదు. కారణ మెంత యోజించినను యనవగత మగుటలేదు. జక్కన్నకు మనస్సు దేవిమీఁదను నిల్చుటలేదు. ఒకనాడు చండితో భైరవిని పిలుచుకొని రమ్మని చెప్పినాడు. ఆమె వెడలివచ్చి యామె తాను రానన్నదని చెప్పినది. జక్కన్న కంతయు నయోమయముగ నున్నది. తాను మాచలదేవి దర్శనము చేసి యావిడ ద్వారమున రాజదర్శనము చేయుదమా ? యనుకొనెను. అదియే బాగున్నది. ఆమెకుఁ బ్రభువు నొద్ద మిగుల చనువు. ఆమె యనురాగమును సంపాదించుచో నది చక్రవర్తిమీఁద శీఘ్రముగ పనిసేయుఁ గల దనుకొని నాడు. స్వామితోఁ నీసంగతిఁ జెప్పి యాతనిని మాచల్దేవి యింటికి తనతో రమ్మని కోరినాడు. స్వామి తన కామెయొద్దకు వచ్చుట కిష్టము లేదని చెప్పినాడు.

జక్కన్న యిక లాభములేదు, నేనొక్కఁడనే పోయి యామె దర్శనము చేసికొందుమనని నాడు.

ఆనాడు చంద్రగ్రహణము. గ్రహణ సమయమున జక్కన్న స్నాన మొనర్చి ధ్యానసమాధిమగ్నుడై ఏకవీరాదేవి విగ్రహ సమక్షమునం దుపవిష్టుడైనాడు. అయన కన్నులముం దొక మహాతేజఃపుంజము ముద్దకట్టి కన్పించినది. కొంత తడవున కా తేజస్సు సప్తపర్ణిగ రూపొందినది. మొదటి యాకు ధగధగ మెఱిసినది. ఆసప్తపర్ణి యొక మహాటవిలో నున్నది. అది యా యడవియందలి మహావృక్షముల మధ్య కాంతిమంతిమై యా వనమున కధిపతివలె నున్నది. ఆమొదటి యాకు చెట్టునుండి విడివడినది. ఆయాకు సన్నని చిఱు కటారివలె నయి తన చుట్టునున్న మహాటవినంతను ఛేదించినది. జక్కన్న కిది యంతయు

పరమాద్భుతముగ నున్నది. ఆయన యింకను సమాధియందేయున్నాడు. మరల సప్తపర్ణిని చూచినాడు. మొదటియాకసలు కనిపించనేలేదు. జక్కన్న పరీక్షగ చూచెను. ఆరు ఆకులే యున్నవి. జక్కన్నకు సామాధి చెదరినది. ఆయన ధ్యానమునుండి లేచి యాలోచించెను. తానిప్పుడు చేయదలచెనేని రెండాకులు చేయవలయు ననుకొనెను. ఆయన కీ పర్ణచ్యుతి అశుభసూచకముగ నున్నది. ఆయన మనస్సు శంకాకులమైనది.

ఆదినమున ప్రతాపరుద్ర చక్రవర్తి తన మందిరమున సప్తపర్ణి కెదురుగ తల్పమున బండుకొని యర్ధనిద్రగ దానివంకకే చూచు చున్నాడు. చూచుచునే చక్రవర్తి యాశ్చర్యపోయెను. ఆయనకు సప్తపర్ణి యొక్క మహాటవియందు తళతళ లాడుచు నా యడవియందలి వృక్షములనడుమ రాచరికమును వెలయించుచున్న ట్లనిపించినది. మొదటియాకు చెట్టునుండి విడివడి చంద్రహాసమువలె నయి తనచుట్టు నున్న మహాటవినంతను నఱికినది. చక్రవర్తి నిదానముగ జూచి నాడు. మొదటి యాకు కనిపించలేదు. చక్రవర్తికి భయమైనది. ఆయన కనులు తెఱచి సప్తపర్ణి నవలోకించినాడు. ఆరాకులే కని పించినవి. ఆయన లేచి చెట్టుదగ్గరకు వెళ్ళి చూచెను. మొదటియాకు కొలదిగ వంగియున్నది. ఆయన దానిపై జేయివైచినాడు. ఆ యాకు విరిగి నేలబడినది. ప్రభువు కన్నులు తిరిగినవి. ఆయన తల్పముపై వ్రాలి చింతింపదొడగెను. మఱల లేచి విరిగి క్రిందపడియున్న యాకును చూచెను. చెట్టుపై దడవినాడు. మిగిలిన ఆరాకులు చాల బలముగ నున్నవి. మరి యా మొదటియా కెందుకు తునిగి నట్లు? ప్రభువున కేమో కలతగ నున్నది. తాను సప్తపర్ణిని అష్టపర్ణిగ జేయ సంకల్పించుకొనినాడు, ఆసప్తపర్ణి యష్టపర్ణియగుటటుంచి షట్పర్ణి

మైనది. ఇట్టి ప్రాతికూల్యము సంభవించినదేమి ? చక్రవర్తి మనమున నశాంతి చెలరేగినది. ఆయన యేమియుఁ దోచక యటునిటు తిరుగుచున్నాడు. భైరవి వచ్చినది. ప్రభు వామెను చూడలేదు. భైరవి చక్రవర్తి ముఖలక్షణములఁ దిలకించి నివ్వెరపోయినది. కొన్ని నెలలుగ చక్రవర్తి మోమున నేదో యాశంక భయము కానవచ్చుచున్నవి. భైరవి చాలతడ వట్లే నిలబడిపోయినది. చివరకు చక్రవర్తి భైరవిని 'యెందులకు వచ్చితివ' ని యడిగెను.

భైరవి :— ప్రభూ ! మాచలదేవియందు తమ కనుగ్రహము తప్పి నెలలు గడచుచున్నవి. ఆమె నిద్రాహారములు లేక కృశించిపోవుచున్నది. ప్రభూ ! ఆమె నిద్రయందు మిమ్ముఁ దలఁచుకొని పలవరించును. ఆమెపైఁ దమకు దయ తప్పిన౯ాని కుమారిలిపోవును. తన తప్పేమో తెలియఁ జెప్పి శిక్షించుచో నామె యింతకన్న సంతసించును. మీరిట్లే యామెపైఁ గినుక వహించియుందురేని యామె కొలదికాలములోనన మరణించును. తా మొకమా రామెను చూచుచో నామె స్థితి తమకే తెలియగలదు.

ప్రభు విదియంతయు విని యూరకొనినాడు. ఏమియు బదులు పలుకలేదు. ఆయన కీగొడవ పట్టినట్లే కనిపించలేదు.

భైరవి :— ఏమి ప్రభూ ! తమ దర్శనమునకు రమ్మందురా ?

చక్రవర్తి :— వలదు. మేమే రాగలమని చెప్పుము.

ప్రభువు మరల సప్తపర్ణి యొద్దకుఁ బోయినాడు.

జక్కన్న మాచలదేవి యింటికేఁ బోయినాడు. తా నొక్కఁడే యరిగినాడు. కాని యామె దర్శనము కాలేదు. ద్వారపాలికలు, ఆమె యారోగ్యము సరిగలేదు కావున దర్శనము దుర్లభమని చెప్పిరి.

ఆయన పోయినదారిని తిరిగిపోయెను. జక్కన్న యొకరోజున స్వామితో నిట్లనెను – 'నాయనా! ఈ మహాసామ్రాజ్యమునకు మహోపద్రవములు వచ్చు చిన్నె లగుపించుచున్నవి. అవి వచ్చితీరును. తన్నివారణకు ప్రతిక్రియకు మహాశాంతులు చేయవలయును.' స్వామి యొక నిరాశాద్యోతకమైన చిఱునవ్వు నవ్వి యనినాడు. 'అన్నా! నీవును నేనును కలచిన నేమగును? జోగియు జోగియు రాచుకొనిన బూడిద రాలినదంట, అట్లున్నది మనస్థితి!'

స్వామి యిట్లనినాడే కాని యాతనికి రాజ్యమున కుపద్రవము వచ్చుననువార్త వినుసరి కొండలున తేళ్ళుకుట్టినట్లైనది. వెంటనే నాగిరెడ్డి యొద్దకుఁ బోయి యాసంగతి విశదముగఁ దెల్పినాడు. నాగిరెడ్డి మిగుల చింతించినాడు. – 'అయ్యా! నే నీనగరమున పేరునకు సరదారునే కాని యీ రాజ్యమున ప్రభుత్వము వెలమవారిది కమ్మవారిదిగ నున్నది. మనమాట చెవి నిడువా రెవరును లేరు. రాజ్యము నానాటికి కుత్సితమై పోవుచున్నది. చిన్న చిన్న ఉద్యోగములకుఁగూడ పెద్ద సరదారుల పలుకుబడి కావలయును. ఆ పెద్దసరదారులు తమతమ ప్రీత్యానుసారముగ నుద్యోగములందు వ్యక్తుల నియమించుట తమ బంధువుల నుచ్చపదవుల యందుంచుట తమ స్వేచ్ఛను వెలయించుటగ నున్నది. అందుచే నసమర్థులచే పాలింపఁ బడవలసిన పరిపాలన మసమర్థుల కరగత మగుచున్నది. వారు సమర్థులను గుర్తించరు. వారి యధికారగర్వము వారి నట్లు చేయుచున్నది. వారికి పలుకుబడి కావలెను గాని న్యాయముతోఁ బనిలేదు. విచక్షణాజ్ఞాన మక్కఱలేదు. వారు పదవీ భాగ్యముచే కన్నుగానక యితరోద్యోగుల నెంతయో నిరసనగ చూతురు. మన మేమి చేయగలము? నేను జక్కనాచార్యునిఁగూర్చి నాగయమంత్రితో ప్రస్తావించిన కారణముగ నాయన కార్యము సిద్ధించలేదు. ఏమి చెప్పను? ఈ ప్రభుత్వ

వైఖరి యిట్లున్నది. రాజ్యమునకు వచ్చు నుపద్రవము నరికట్టుట వారి యధీనము కాని మనమేమి చేయఁజాలుదుము ?'

స్వామి నిట్టూర్చినాడు. ఏమియు మాటాడలేదు. అటనుండి వెడలిపోయెను. ఆ పోవుట మాచలదేవి యింటికి. ద్వారపాలిక లాతని నడ్డిరి. అమ్మగారి కారోగ్యము బాగుగలేదు. కాన ప్రవేశ మీయ మనిరి. స్వామి, స్వామి వచ్చినాడని చెప్పుడని యొత్తిడి చేసెను. మాచలదేవి రమ్మనినది. స్వామి లోనికిఁ బోయినాడు. మాచలదేవి యొక సువిశాలమైన సుసజ్జితమైన గదియందు, పందిరి పట్టెమంచముపై గుండ్రని ముఖమల్ దిండు నానుకొని కూర్చుండి యున్నది. ఆమె నగ మైనది. స్వామి యామెను చూచినాడు. ఆమె స్వామిని చూచినది. ఆమె మనమున స్వామి పసితనమునాటి ముద్దు మురిపెములు జ్ఞప్తికి వచ్చినవి. ఆమెకు స్వామి కోరికయు తాను నిరాకృతికాని నిరాకృతి యొనర్చిన సంగతియు తలపునకు వచ్చినవి. ఆమె కుక్కిరిబిక్కిరియైనది. ఆమె స్వామిని పరకాయించి చూచినది. కుఱ్ఱవాడు గండుదేరినాడు. తా నాతని రెండేండ్లక్రిందట చూచినది. అప్పటికన్న నిప్పు డందము హెచ్చినది. పసితనమున తానెత్తి పెంచినవా డేనా యనిపించినది. ఆమెకన్నులఁ బ్రేమ జాలి వెల్లివిరిసినవి.

స్వామి కామెను చూడగనే యొకవిధమైన లజ్జ యుదయించి నది. తల వంచికొనినాడు. ఆమెపై మనసు పోవుచున్నది. కోపము వచ్చిన దామెపై. మరల తనలోనే 'ఛీ' యీవారాంగనతో తన కేమిపని ? తన్ను కాదన్నది. చక్రవర్తిని వలచినది. మరల నాయ నను కాదనుచున్నదఁట. శిల్పి నెవరినో మోహించెనట. ఈమెపై తనకు మక్కువయేమి టనుకొనినాడు. తన వచ్చినపని నెరవేర్చుట తన

కర్తవ్య మరుకొనినాడు. కొన్ని నిముసము లిరువురును మాటాడలేదు. చివరకు మాచల్దేవి యనినది – 'స్వామీ! నీ వచ్చినపని యేమి?'

స్వామి :— సప్తపర్ణిని అష్టపర్ణిని చేయుటకై యొక మహాశిల్పి వచ్చినాడు. ఆయన మహాజ్యోతిష్కుడు. మన రాజ్యమున కాయన మహోపద్రవము రాఁబోవుచున్న దని చెప్పినాడు. ప్రతిక్రియగ మహాశాంతులు సేయవలయునట. ఆయనకు చక్రవర్తిదర్శనమే కాకుండనున్నది.

ఆతని కంఠధ్వని విచలితమై నట్లున్నది. వంచిన తలయెత్తలేదు. మాచలదేవి కాతనిపై జాలికలిగినది. ఆతని ప్రకృతి పరమ సుకుమారమైనది. మాచలదేవి జక్కన్నను పంపు మనినది. స్వామి వెడలి పోయినాడు.

తరువాత మూడు దినములకు జక్కన్న మాచలదేవి యింటికిఁ బోయెను. జక్కన్న యామె యింటియందలి సావడిలో ప్రవేశించక పూర్వమే చక్రవర్తి, పరిచారికలుం వెంటరా నేనుగం బారిపై వచ్చినాడుఁ అంబారి దిగినాడు. సావడిలో జక్కన్న కనుపించినాడు. ప్రభువునకుఁ గోపము వచ్చినది. గిరుక్కున వెనుదిరిగినాడు. జక్కన్న కంతయు నాశ్చర్యముగ నున్నది. అంతయు విచిత్రముగ చూచుచుండెను. అట్లు చాల సమయము గడచినది కాని జక్కన్నను గురించి యోజించిన వారే లేరైరి.

జక్కన్న తిరిగి యింటికే పోయినాడు.

మరునాడు చక్రవర్తి యాంతరంగిక మయిన చిన్న సభ చేసి నగరాధ్యక్షులని, సేనానుల బిలువ నంపినాడు. సభ జరుగుచున్నది. మధ్యలో వొక గూఢచారి తురకలు మరల దేశముపైఁ దండెత్తి వచ్చుచున్నవార్తఁ జెప్పెను. చక్రవర్తి కేమి చేయుటకును తోచ

కొండెను. సేనానులందఱకు సేనల సమీకరించి యుద్ధమునకు సన్నద్ధముగ నుండ నియమించినాడు. ఆసైన్యమును నగరరక్షణకు కొంత, సప్త ప్రాకారములవద్దను సప్తదళములు, తరువాత రామప్పవద్ద కొంత, కొంత గోల్కొండలో నుండునటుల యాజ్ఞ చేసెను. సింహాచలమున అన్నయమంత్రికి కబురు పెట్టుటకు చెప్పెను. సర్వప్రతినిధులకు సైన్యములఁ బ్రోగుచేసి సుశిక్షిత మొనర్ప సందేశములు పంపుడని యాజ్ఞ నిచ్చెను. వారందరు చక్రవర్తి యాజ్ఞల శిరసావహించి వెడలిపోయిరి. ప్రభు వొక్కఁడె విచారదీనుడై కూర్చుండినాడు. ఆయన కెటుచూచి నను పరిస్థితులు విషమములై కన్పట్టుచున్నవి. దేశముపై మరల తురకల దాడి, మాచలదేవి కుటిలవర్తనము, సప్తపర్ణి యాకు తును గుట సర్వమును బాధాకరములుగ నున్నవి. ఆశిల్పి అత డంతటిప్రతిభాశాలి యగుట కూడఁ దనకుఁ గష్టముగనే యున్నది. ఆయనకు తల దిమ్మెత్తుచున్నది. చీకటి పడవచ్చుచున్నది. చక్రవర్తి యింకను ఆ మందిరమును వీడలేదు. మందిరద్వారమున నొక నల్లనినీడ పడినది. చక్రవర్తి యదరిపడి 'యెవరువా రని' నాడు.

వ్యక్తి :- ప్రభూ! నేను వీరభద్రుడను. తమయాజ్ఞ ననుసరించి యాబ్రాహ్మణుని చెఱఁబెట్టితిమి. ఆ విషయము తమకు నివేదింప వచ్చితిని.

చక్రవర్తి యెడము కన్నదరినది. వీరభద్రునికి సెలవొసంగి చక్రవర్తి యట్లె విచారదీనుఁడై కూర్చుండిపోయెను. మందిరమునఁ జీకట్లు తిరుముకొని వచ్చుచున్నవి. ప్రభు వాచీకటియందే యోజించు చున్నాడు.

## ౧౪

జక్కన్నకు తన్నీమారెందుకు చెఱఁబెట్టినారో యసలే తెలియుట లేదు. క్రిందటి పర్యాయము తాను రాజోద్యానములోనికి యనుజ్ఞ లేకుండ పోవుట నేరమైన నున్నది. ఈ మారట్టిదికూడ లేదు. తన గ్రామమునుండి బయలుదేరిన వేళ మంచిది కాదు వలె నున్నది. తా నేశకునము చూచి వచ్చెనో కాని వచ్చినప్పటినుండియు నేకార్యము తల పెట్టినను విఘ్నములే కలుగుచున్నవి. తాను తలంచినదొకటి యైన దైవఘటనము వేరొకతీరుగ నున్నది. ఆ కాంచలదేవి దర్శనమైన కాలేదు. ఆమె యెట్లుండును? ఆమె స్వరూప మెట్టిది? స్వభావ మెటువంటిది. ఆమె వయస్సెంతయుండునో! ఆమె దర్శనమైనచో, చక్రవర్తితోడి పరిచయము లభించి కార్యసాధన యయ్యెడి దేమో! విధిప్రాతికూల్యముచేతఁ గాని, లేకపోయిన తా నామె దర్శనార్థియై యరిగినపుడె చక్రవర్తి యేల రావలయును? అంతయు నగమ్యముగ నున్నది. గన్నయ్య యేల సాయము చేయలేదు? భైరవితోఁ గలసి వెడలినప్పుడు సాయముఁ జేయుదు ననినాడు. మరల నిట్లుచేసె నేమి? నాగిరెడ్డి చెప్పుచు గాన గన్నయ్య సాయముచేయలేదని స్వామి చెప్పు చున్నాడు. ఇక్కడ వర్ణభేదము లడ్డువచ్చినవి కాబోలును? వారిద్దర కును విభేదమైనచో మధ్య తనపని కేల యాటంక మేర్పడవలయును? అయినను తాను చెఱసాలయం దుండగ నీ నగరాధ్యక్షుడేగద వచ్చి జోస్యముఁ జెప్పించుకొనినది! ఆనాటి వినయ మేమయినది? అల్పుల కధికారము లన్న నిట్లే యుండును. వారందిన జుత్తు, అందకున్న కాళ్ళు పట్టుదురు. వారికిఁ గావలసినది కార్యసాఫల్యముగాని యెదుటి వ్యక్తుల యోగ్యతా యోగ్యతలతో నిమిత్తము లేదు. వారు గొప్ప వారైనను కొద్దివారైనను వారికార్యము సఫలమగునంతకు వారి నంద

లముల నుంచుట తరువాత నధఃకరించుట వారి ముఖ్యకార్యములు. అల్పుల కధికుల యధికత్వ మెట్లు తెలియును? తామునట్టి యల్పులున్న లోకమునఁ బుట్టినారు కాన ప్రస్తుతము వా రున్నత పదవులయందుండి, యధికారముల వెలయించుచున్నారు. కావున తప్పక చూచుచు నూరకుండవలసినదే? లేకున్న నీ నగరాధ్యక్షుని ప్రవర్తన యేమి బాగున్నది? జక్కన్నకు, తనపై ప్రభువున కంతటి పగ యేటికో యవగత మగుటలేదు. నాలుగు దినములుగ నాలోచించిన వా డాలోచించినట్లుగ నున్నాడు. కాని కారణ మూహాల కందనిదై యున్నది. జక్కన్న కేమి సేయుటకును తోచుట లేదు. మనస్సు స్తిమితము గాక చెఱియుం దంతట నూరక తిరుగుచుండును. మూడు రోజులనుండి వచ్చుచున్న యాహారమును ముట్టుటయే లేదు. ఆయనకు నిద్రాహారములు దూరము లైనవి.

నాల్గవదినమున ప్రొద్దున జక్కన్న భోజనముఁ దెచ్చు భటునితోఁ దాను స్నానముఁ జేయవలెనని చెప్పినాడు. అతడు మంచినీరముఁ గొనివచ్చి జక్కన్నను స్నానము చేయించినాడు. జక్కన్న పసుపు కుంకుమ కొబ్బరికాయ హారతికర్పూరము కావలె ననెను. ఆ భటుడు పైవారితో చెప్పెదునని పోయి తిరిగివచ్చి యవి యిచ్చుటకు వలనుపడ దనినారని చెప్పెను. జక్కన్న కేమియు పాలుపోవుట లేదు. తన కిక్కడ గూడ విఘ్నమే వాటిల్లవలయునా? యనుకొనినాడు. ఆ భటుని పలువిధముల బతిమాలుకొనినాడు. అత డొప్పుకొనలేదు. జక్కన్న చివరకు తనవద్దనున్న కొంత వెండినితీసి భటునికి చూపించి యెట్లైన తన కవి తెచ్చుపెట్టుమనినాడు. భటునికి వెండినిఁ జూడగనే మొగ మింతయైనది. అత డంగీకరించి యావెండిని తీసికొని జక్కన్న కా వస్తువులఁ దెచ్చియిచ్చెను. జక్కన్న యవిచూచి

తనకు మహానిధి దొరికినంతగ సంతసించినాడు. ఆయన వానినితీసికొని చెఱసాలయందు దొకమూల నుంచెను. చెఱసాలయందు మధ్యభాగమున నొక కొంతమేర పసుపునీటితో నలికి పసుపుతో ముగ్గులు పెట్టినాడు. ఆ ముగ్గులమధ్య కుంకుమచల్లి యేవో మంత్రములు పఠించి కొబ్బరికాయఁ గొట్టి హారతి వెలిగించి కన్నుల కద్దుకొని యచట ముగ్గుల కెదురుగ నాసీనుఁడై సమాధియందు మగ్నుఁ డయినాడు. పద్మాసనమువైచి, కన్ను లరమోడ్పులుగా చేతియందు జపమాల నుంచుకొని జపము సల్పినాడు. ఆ సమాధి స్థితి యట్లు పదియునైదు దినము లున్నది. ఈ పదునైదు దినములుగ జక్కన్న ఆహార నిద్రా స్నానముల నెఱుఁగడు. అన్నమును తెచ్చుచున్న భటుఁ డాశ్చర్య పోవుచున్నాడు. అతనికి జక్కన్న యన్న నొక మాంత్రికునివలె ననిపించినాడు. నాటిరాత్రి చెఱసాల కావలికాయు భటుని కొక విచిత్ర దృశ్య మగుపించినది. దానితో నిక వాడు దిగ్భ్రాంతుఁడైనాడు. ఉన్నటులుండి జక్కన్న యున్న గదియందు కోటిసూర్య తేజఃప్రకాశమై కన్నుల మిఱుమిట్లు గొల్పినది. ఆ తేజమునకు రూపేర్పరింప వీలు లేనిది. అతని మనమున నదో భయమైనది అతడు మరునాడు కారాగారాధ్యక్షుఁడైన పుల్లయ్యతో నీవిచిత్రమైన దృశ్యమును గూర్చి చెప్పెను. అతఁడు నమ్మలేదు. అంతయు నబద్ధము పొమ్మనినాడు. అది పట్టి నీభ్రమ కాని వేఱొండు కాదనెను. భటుడు తిరిగి వచ్చినాడు. మరల నారాత్రియు నట్టి వెలుఁగే కనిపించినది ఆ భటుడు తక్కిన గదులవద్ద నున్న కావలి వాండ్ర నందఱఁ బిలిచి చూపించెను. వారందర కొక్కమారుగ భయాశ్చర్యములు కల్గినవి. ఈమారు వారందరును కలసి పోయి పుల్లయ్యతో నివేదించిరి. ఆయన నమ్మలేదు. వారు కావలసినచో మీరే వచ్చిచూడుడు. మీకే తెలియఁగల దనిరి. ఆరోజున పుల్లయ్య కారాగారమున నర్ధరాత్రమున దేదీప్యమానముగ వెలుఁగుచున్న యొక

గొప్ప తేజస్సునుఁ జూచినాడు. జక్కన్న గదిలోనికిఁబోయి చూచుట కేరికిని ధైర్యము చాలుట లేదు. పుల్లయ్య కిటికీనుండి చూచినాడు. లోన జక్కన్న పద్మాసనస్థుడై యుండెను. అంతకుమించి యేమియు గనిపించలేదు. ఆయన వెడలిపోయినాడు. మరునాడీవిషయము నగ రాధ్యక్షునితోఁ జెప్పఁబోయెను. ఆయన నమ్మలేదు.

పుల్లయ్య :— మొదట కావలిభటుఁడు చెప్పినప్పుడు నేను నిటులే యుంటిని. కాని నిన్నటిరేయి నేను వెల్గును కన్నులారఁ జూచితిని. ఆకాంతి నాకన్నులఁ గొట్టి తరువాత పదినిముసములువర కేమియు దర్శించలేకపోయితిని. తాముచ్చి చూతురేని తెలియఁగలదు. ఆయన యొక మహామాంత్రికుని వలె నున్నాడు.

నాగయ :— నా కింకను నమ్మకము కుదురకున్నది. అది మిాభ్రమ యై యుండును.

పుల్లయ్య :— అట్లనకుడు. ఆవెల్గును నిజముగ నేను దర్శించితిని.

నాగయ :— అయినచో నీరాత్రి మరల వచ్చినచో చెప్పుమనుడు. అప్పు డాలోచించెదను.

పుల్లయ్య సెలవు తీసుకొని వెడలిపోయినాడు. జక్కన్న తన కన్నముఁ దెచ్చిపెట్టు భటునితో ననినాడు. —

“ నీవా యాహార మేల తెచ్చెదవు ? నాకక్కరలేదంటిని గద ! మరల చెప్పుచున్నాను. నాకొఱ కెట్టియాహారమును గొని తేనక్కరలేదు.”

భటుని కిదియంతయు నద్భుతముగ నున్నది. ఈ బ్రాహ్మణుఁ డన్నపానాదులముట్టకున్నాఁ డేమి. ఈయన మహాయోగీశ్వరునివలె నున్నాడనుకొనినాడు. భటుడు జక్కన్నకు నమస్కరించి యనినాడు “ అయ్యా ! నేనొకటి యడుగుదును. తమరు కోపగించుకొనరుగద ? ”

జక్కన్న చిఱునవ్వు నవ్వి యనినాడు — 'కోపమెందుల కది యేమో చెప్పుము.'

భటుడు :— దొరా! మీగదియం దర్ధరాత్రములయం దొక దివ్య తేజస్సు కనిపించుచున్నది. అదియేమో మాకు దెలియుటలేదు. ఆ మహాతేజస్సునకు కారణ మేమైన నున్నదా?

జక్కన్న :— ఆఁ యేమి? తేజస్సు కనిపించినదా?

భటుడు :— కనిపించినది. ఇప్పటికి మూడు రాత్రులుగఁ గని పించుచున్నది.

జక్కన్న :— అయినచో నీసంగతి నాగయ గన్నమంత్రితో చెప్పుము.

భటుడు :— పుల్లయ్యగారు చెప్పిరి.

జక్కన్న :- ఆయన యేమనెను?

భటుడు :— ఆయన నమ్మక మరల నావెల్గు వచ్చునో చెప్పు మనినారు.

ఆరోజున వెల్గు కనుపించలేదు. ఆయన తాను చెప్పినది నిజమైన దని మురిసినాడు.

జక్కన్న :— తరువాత?

భటుడు :— తరువాత మరల నీవేళ ప్రొద్దున నాయనకు రాత్రి వెల్గు కన్పించినటులఁ జెప్పితిమి.

జక్కన్న :— ఏమనినారు?

భటుడు :— వచ్చినదా యని యాశ్చర్య మందినాడు. మరల వచ్చుచో నాక్షణము తనకు కబురు పెట్టుమనినాడు.

జక్కన్న :— అయినచో నీవు పోయి యిక నా వెలుఁగు రాదని చెప్పుము. అప్పు డేమనునో మరల నాకుఁ జెప్పుము.

భటుడు నాగయగన్న మంత్రితో నట్లు చెప్పినాడు. మరునాడు జక్కన్న భటుని గన్నయ్య యేమనినా డని యడిగినాడు.

భటుడు :— గన్నయ్య యిది విని వీడొక గారడీవా డనినాడు.

జక్కన్న నవ్వినాడు, ఆయన వదన మొకింత యుజ్జ్వలమైనది. ఆయన యనినాడు,— 'అవును. గారడీవాడనే, పొమ్ము. ఇట్లనినానని యాయనతో చెప్పుము.

భటు డిట్లు చెప్పగనే నాగయగన్నమంత్రి యొడలు ఝల్లు మనినది.

ఆభటునికి రోజురోజునకు జక్కన్నమీది భక్తి యమిత మగుచున్నది. ఒకరోజున జక్కన్నతో నిట్లనినాడు. — 'స్వామీ! మీకీ నగరమునం దెవ్వరైన బంధుగులు మిమ్ముఁ జూడదలచిన వారున్నచో నాకు చెప్పుడు. నేను వారిని తీసికొని రాగలను.' అని.

జక్కన్నకీ మాటలు వినగనే చండి జ్ఞప్తికి వచ్చినది.

జక్కన్న :— శిల్పివాడయందు స్వామి యని యొక బాలశిల్పి యున్నాడు. వారియింటికి పోయి నావిషయముఁ జెప్పి వారెవరేని వత్తుమనినచో కొని తెమ్ము.

భటుడు శిల్పివాడకు పోయి జక్కన్న చెప్పిన గుర్తుల యాధారమున స్వామి యింటికిఁ బోయి జక్కన్న యను నొక మహాత్ముడు

మీరాయనను దర్శింప దలచినచో మిమ్ముఁ గొనిరమ్మని చెప్పినాడని చెప్పెను. స్వామి తాను వెళ్ళెద ననినాడు. చండి తాను వెళ్ళెద నన్నది. స్వామి యిరువురము పోదమనినాడు. చండి యట్లొప్పుకొనక, పోయినచో నెవరో యొకరే పోవలయు నన్నది. అయినచో స్వామి తాను పోయెద ననినాడు. చండి మాటాడలేదు. భటుడు స్వామిని వెంటబెట్టుకొని చెరసాల యొద్దకు తీసికొనివచ్చినాడు.

చెఱయందు జక్కన్నను చూడగనే స్వామి కన్నులనీరుతిరిగినది. స్వామిని లోనికిఁ బంపినాడు భటుడు. స్వామికి జక్కన్నలో నొక క్రొత్త యందము కనుపించినది. ఆయన మొగమున క్రొత్తతేజ ముజ్జ్వలముగ భాసిల్లుచున్నది. ఆయన కృశించుచున్నాడు. అయినను ఆయన దేహము తత్పారకూటచ్ఛాయపరిరమ్యమై వెలుగుచున్నది. ఆయననేత్రములు నిర్మలములై జ్యోతిష్మంతములై యున్నవి. ఎదో ఘనకార్యము సాధించినవాని కన్నులవలె నాయన నేత్రముల తృప్తి యుబుకుచున్నది. కాని ఆయన విచారదీనముగ కూర్చుండినాడు. స్వామి జక్కన్నకు నమస్కరించి యాయన యొద్ద నుపవిష్టుడయ్యెను.

జక్కన్న :— చండి కుశలముగ నున్నదా ? ఆమె రాలేదేమి ?

స్వామి :— తానొక్కతె వచ్చునట, ముందు నన్ను చూచి రమ్మన్నది.

జక్కన్న :— అటులనా ? సరి.

స్వామి :— అన్నా ! నీవిన్నినాళ్ళను భోజనమును విసర్జించితీవట. నీగదియందొక మహాతేజస్సు వెలువడెనట. భటుడు చెప్పుచున్నాడు. ఇదియంతయు నేమి ?

జక్కన్న యొక నవ్వు నవ్వినాడు. స్వామి కేమియు బోధ పడుటలేదు. గదిచుట్టును కలయఁ జూచినాడు. అచటగల పసుపు ముగ్గులు కుంకుమను జూచి యిది యే మనినాడు.

జక్కన్న :— నాయనా! స్వామీ! అది యంతయు పరమ రహస్యము. నీ వెవ్వరికిఁ జెప్పనన్నచో నీకు చెప్పెదును.

స్వామి :— నేనెవ్వరికిని చెప్పను. అదియేమి?

జక్కన్న :— చండికి గూడ చెప్పరాదుసుమా!

స్వామి :— చెప్పను. కాని యిక్కడికి వత్తునన్నదే మరి?

జక్కన్న :— నేనేమైన చెప్పిన చెప్పెదను కాని నీవేమియు చెప్పవలదు.

స్వామి యట్లె యనినాడు.

జక్కన్నయిట్లు చెప్పినాడు — 'స్వామీ! నేను పదిహేను దినములు దివారాత్రము లాహార విసర్జన మొనర్చి తపస్సు సల్పితిని, నాయనా! రహస్యములను కనుగొంటిని.

స్వామి :— ఏమవి?

జక్కన్న :— నాభవిష్యమెట్లుండునో రాజ్యపు భవిష్యత్తెటు లుండునో కనుగొంటిని.

స్వామి :— అవి యేవో నాకు చెప్పవా!

జక్కన్న :— నాభవిష్యమును చెప్పెదను. కాని రాజ్య విషయము చెప్పరానిది.

స్వామి :— అయినచో నన్నా! నీవిడుదల యెప్పుడో చెప్పవా?

జక్కన్న:— స్వామీ! నన్నీమా రిచ్చటనుండి త్వరలో వదలరు. ఒక సంవత్సరమునకు వదలుదురు, కాని మరల నింకొకచోట బంధింపఁ బడుటకు -

స్వామి :— మరల బంధన మేమున్నది?

జక్కన్న :— ఒక మహాయుద్ధము రానున్నది. ఆయుద్ధమున సైనికునిగఁ బోవలసివచ్చుటచే నిచ్చట విడుదల నిత్తురు. ఆయుద్ధమున నొక మహారాజు నాప్రక్కన యుద్ధము సేయుచుండును. ఆయనను నన్నుగూడ యుద్ధమున నెదిరిపక్షము వారు బంధింతురు. ఇరువురి నొక చెఱసాలయం దుంతురు. ఆమహారాజును పైకిఁ గొంపోయి నన్ను వదలి పెట్టుదురు. ఆమహారాజెవ్వరో నాకుఁ దెలియదు. తరువాత నక్కడ నాకొక స్త్రీ యగుపడును. ఆమెతో కొన్నిదినము లుండవలసివచ్చును. ఆమె యెవరో నాకు తెలియదు. ఎక్కడనో యొకమారు చూచిన ట్లున్నది. తరవాత మఱిచూడలేను. మరల చూడఁబోను. తరువాత నామె కూడ విడివడును. చివర కేమగునో తెలియకుండ నున్నది.

జక్కన్న చెప్పుచున్నంతసేపు నొక నిరాశాభావము కనుపించు చున్నది. స్వామి కిది యంతయు పరమాశ్చర్యముగ నున్నది. ఈజక్కనాచార్యుడు మహర్షివలె నున్నాడు. స్వామికి రాజ్యము విష యమై తెలిసికొన నుత్సాహము కలిగినది. అన్నా! సామ్రాజ్య విష యమును చెప్పుమన్నాడు. జక్కన్న యది మాత్రము చెప్పననెను. స్వామి మరి యడుగలేదు. చీకటి పడవచ్చుచున్నది. భటుడు లోనికి వచ్చి స్వామితో నతడు వచ్చి చాల సమయమైనది. ఇక చెఱసాలను

విడువవలెనని చెప్పెను. స్వామి జక్కన్నకు నమస్కరించి వెళ్ళిపోయెను. జక్కన్న యట్లే విచారదీనుఁడై కూర్చుండి యోజింప సాగెను.

౧౫

నాఁడు జక్కన్న తనకు పండ్లు తెచ్చిన భటుని చూచి యని నాఁడు — 'వెంకా! ఈవేళ నింత యాలస్యముగ వచ్చితివేమి?'

వెంకడు :— ఏమిచెప్పనుదొరా! ఊరంతయు విజయోత్సవము లలో మునిగియున్నది. ఆయుత్సవముల దిలకించుచు నెమ్మదిగ వచ్చు టచే నాలస్యమైనది.

జక్కన్న :— విజయోత్సవములా? విజయ మెక్కడిది?

వెంక :— ఆకటకటు తురకలు మరల రెండవసారి దేశముపై దండెత్తి వచ్చిరి, ఓడి పలాయనమైరి, మనసేనలు జయించినవి.

జక్కన్న :— అటులనా? మనవారింకను జయించుచునే యుందురు.

వెంకన్న :— ఇంకను అనుచున్నారు. మఱల వారేమొగము పెట్టుకొని వత్తురు? రెండుమారులు దండెత్తివచ్చి యోడిపోయిరిగద! సిగ్గేమయిన నుండవలదా?

జక్కన్న :— వెంకా! నీకు తెలియదు, వారికి సిగ్గుండదు. సిగ్గు పలుపురియందు పలురకములుగ నుండును. వీరి సిగ్గొకరకమైనది. వీర లకు ప్రతీకారము పగ ప్రధానములుగాని సిగ్గును పౌరషమును లేవు. వీరి కిట్టివింక నెన్నియోటములు జరిగినను మరల మరల దండెత్తి వచ్చుచునే యుందురు. వారికి కావలసినది విజయ మంతియు. మన

వారట్లు కాదు. వీరిది త్రాచుపాము పగవంటిది. వీరొకసారి యోడి పోయినచో పౌరుషమునకై ప్రాణత్యాగమునైన చేయుదురు. కాని యట్లు సిగ్గుమాలియుండరు.

వెంకన్న :— ఏమోనండీ! ఈయుద్ధములచే దేశమున శాంతి లేకుండ పోవుచున్నది. ఏమో యీమాయదారి యుద్ధములూ, వీని వలన నగున దేమున్నది?

జక్కన్న మాటాడలేదు. ఏదో యోజించుచున్నాడు. వెంకడు వెడలిపోయెను.

మరునాడు స్వామి వచ్చినాడు. ఆయన రాకలోనే తొందర యున్నది. ఆతొందరను జూచి జక్కన్న స్వామి నడిగినాడు.

స్వామి :— అవునన్నా! తొందరకాక యేమున్నది?

జక్కన్న :— అంత తొందర యేమివచ్చినది?

స్వామి :— దేశమున మహత్త్వమును గుర్తించువారు లేకుండ నున్నారు.

జక్కన్న :— అసలు విషయమేమి? చెప్పుము.

స్వామి :— ఒక మహాకవి యున్నాడు, ఒక మహాగాయకుడు, ఒక మహాశిల్పి యున్నారు. వారల గుర్తించి గౌరవించువారే లేరైరి.

జక్కన్న :— అబ్బ స్వామీ! అసలు విషయము చెప్పకుండగ నేమిటో చెప్పుకొని పోవుదు వేమి?

స్వామి :— అన్నా! వచ్చినది చెప్పుటకే గద. చెప్పదను, దేశమున నేమయిన శిల్పాభిమానము కాని విద్యాభిమానము కాని

యున్నచో నారెడ్లకే యున్నది. కాని ప్రభుత్వము కమ్మవెలమల చేతిలో నున్నది. వారితో నీకమ్మవారికి కావలసినది యధికారము. వెలమలకు నెత్తురు అంటియుకాని వారికి శిల్పవిద్యాభిమానములు లేవు.

జక్కన్న :— ఏమి నీయావేశము. ఇప్పుడేమి జరిగిన దేమిటి?

స్వామి :— శ్రీధరాచార్యుడని యొక శిల్పాచార్యుడు వచ్చి నాడు. ఆయన కెట్టి మర్యాదలు జరుగుచున్నవో, నాకు విచిత్రముగ నున్నది.

జక్కన్న :— శ్రీధరాచార్యుడా? ఆయన యంతటిగొప్ప శిల్పియా యేమి?

స్వామి :- ఏమో నాకేమి తెలియును? మీవైపువాడేనట.

జక్కన్న :— ఎందులకు వచ్చెనోమరి!

స్వామి :— సప్తపర్ణిని చేయుటకై వచ్చినాడు.

జక్కన్న :— మరి చక్రవర్తి దర్శన మైనదా? నగరాధ్యక్షు డెట్లు సన్మానించినాడు.

స్వామి :_ అన్నా యేమని చెప్పను? ఇందులూరి యన్నయామాత్యుడు మనకొక పత్రము నగరాధ్యక్షునికి చూపించుమని వ్రాసియిచ్చినాడు. మరియు శ్రీధరాచార్యుని వెంట నచటికిఁ బంపినాడు. నాగయగన్నమంత్రి యాతని నెత్తిన పెట్టుకొని పూజించినాడు. దీనికంతకు నేమందువు?

జక్కన్న నవ్వినాడు. స్వామికి జక్కన్న యేల నవ్వెనో తెలియ లేదు.

స్వామి :— నవ్వుచుంటి వెందులకు? ఈ శ్రీధరుని నీవెఱుఁగవా!

జక్కన్న :— ఎఱుఁగ కేమి ? ఈయనయు నేనును ప్రథమమున నొకగురువు నొద్దనే చదివినవారము. తరువాత నాయన గురువు మారెను. నాగురువు వేరై నాఁడు.

స్వామి :— ఆయన గొప్ప శిల్పియేనా ?

జక్కన్న మరల నవ్వి యనినాఁడు, — 'శిల్పమునఁ జెప్పదగినంత ప్రతిభగలవాడు కాడు. కాని పరమ లౌక్యుడుమాత్ర మగును. అస లీయన నిందులూరి యన్నయ యంతగ గౌరవించుటకు కారణమేమై యుండును ?

స్వామి :— ఇందులూరి యన్నయామాత్యునికి నాదేశమున బంధువు లున్నారు. ఈశ్రీధరాచార్యుడు వారలచే పత్రముల ద్వారా చెప్పించినాడఁట.

జక్కన్న :— నేను చెప్పితినిగాదా మరి ! ఆతఁ డాశ్రయించుట యందు చాల నేర్పుకాడు. అయినచో నాయనకు సప్తపర్ణిని చూపించిరా ?

స్వామి :— చూపించిరట. కోటలోనే బంగారముఁ గూడ నొసఁగిరి.

జక్కన్న :— శ్రీధరుడు పత్రమును చేసెనా ?

స్వామి :— చేసెనట, కాని యా పూర్వపుటాకునకు నిప్పటి యాకునకును సంబంధమే లేదట. ప్రభువునకు సంతృప్తికరముగ లేదు. కాని గన్నయమంత్రి మొదలగువారు మాత్రము తెగమెచ్చుకొను చున్నారట. ఇది యన్యాయము కాదా ?

జక్కన్న :— వారికి బాగుగ నున్నచో మనదేమి పోయినది ?

స్వామి :— ఆమాత్రపు టాకైనచో మాయూరిలో నందరును చేయగలరు.

జక్కన్న :— మనయూరిలోనివారు కాబట్టి పనికిరారు. మన మనుకున్న దంతయు గొప్పగ కనిపించదు. పొరుగింటి పుల్లకూర రుచియని యూరక వచ్చినదా? అందును ఈవిషయమున మనవా రటువంటివారు.

స్వామి :— అన్నా! నిజముగ నీవెంతటి ప్రతిభాశాలివి! వారు గ్రహించలేదు.

జక్కన్న :— నాయనా! నీవు చిన్నవాడవు. నీకు మహాప్రతిభా వంతునుగ నేను కనిపించుచున్నానే కాని వారి కట్లు కాకపోవచ్చును. మనమేమి చేయగలము?

స్వామి :— అన్నా! నీయంతటి శిల్పకళానిధిని వదలుకొని యీనూత్న శిల్పిని పట్టినారేమి? పైగ నీకీచెఱ?

జక్కన్న :— స్వామీ! ఇంతకు నాగ్రహచార మిట్లున్నది. నేను నీయూర నన్నము నీరు దొరకక మీయింట నుండవలసివచ్చినది. ప్రభువు దయదలచి చెఱబెట్టినాడు. లేనిచో నీకింకను ఋణపడి యుండెడివాడను. ఆ ఋణపడవలసిన యోగ్యత లేదేమో, ప్రభువునకు నామీఁద దయవచ్చినది.

జక్కన్న కంఠమున గాద్గద్యము పొడసూపినది. స్వామికిఁ గన్నుల నీరు తిరిగినది.

స్వామి :— అన్నా! నీవు మహాత్ముఁడవు, నిన్ను కాదనువా రెవరు? నీవు నాయింట నుండుట నాయదృష్టము. వీరికి నీప్రతిభ తెలియలేదు. కాని యీప్రపంచము గొడ్డుపోయినదా? నీకన్న నాశ్రీధరు డేమిగొప్ప?

జక్కన్న నవ్వి యనినాడు — 'స్వామి! ఆవేశపడకుము. ఇచట ప్రతిభతో నిమిత్తము లేదు. ప్రతిభావంతుని ప్రతిభ నర్థము చేసుకొనుటకు గూడ కొంత ప్రతిభ కావలెను. ఈరాజ్యమున ప్రతిభతో నేమి పని యున్నదయ్యా? శ్రీధరుఁ డచ్చటి శిల్పమఠమునందు ప్రధానాచార్యుడు. అంతకన్న నింకేమి కావలెను. నేను నిరుద్యోగిని. నేను నా తాతతండ్రుల శిల్పనైపుణిని నాలో జీర్ణించుకొంటినే కాని యే యుద్యోగమునను నియమితుడను కాలేదు. పదవీ వ్యామోహితులకు నావంటివా రెట్లు నచ్చుదురు?'

స్వామి:— అష్టపర్ణిని చేయవలయునన్న సప్తపర్ణికి రెండాకులు చేయవలెనంటివి కద!

జక్కన్న :— అంతేకాదు. ఇప్పుడు మూఁడు చేయవలెను.

స్వామి :— అన్నా! ఇదివరకు నీవా యాకును చేయుట కుదుర దంటివిగదా?

జక్కన్న :— బాబూ! అది యంతయు నొక పరమరహస్య మయిన విషయము. ఈసప్తపర్ణి అష్టపర్ణి కానేరదు.

స్వామి :— ఎందువలననో నాకుఁ జెప్పవా?

స్వామి ప్రాధేయపడినాడు.

జక్కన్న :— నీకు గనుకఁ జెప్పుచున్నాను. ఈకాకతీయ రాజ్యము ప్రతాపునితో నంతమగును. ఈరాజ్యము సప్తర్షుల యంశచే భూమియం దుదయించినది. భూమియందలి సర్వజనులును పైని నక్షత్రముల ఛాయాప్రాబల్యముచే భాసిల్లుచున్నారు. శ్రీరామచంద్రుఁడు విష్ణునక్షత్ర ప్రాబల్యము కలవాడు. విష్ణునక్షత్రచ్ఛాయ భూమిపైఁబడి యది శ్రీరామచంద్రునివలె భాసిలును. అశ్లే ఫల్గునీనక్షత్రచ్ఛాయా

విశేషముగ నర్జునుడు. ఈయుగమందు సప్తర్షుల యంశముచే నీయేడ్గురు రాజు లుదయించినారు.

స్వామి :— అయినచో నిక నీవిషయమింతియేనా ? ప్రతిక్రియ లేనే లేదా ?

జక్కన్న :— మహాతపస్సంపన్నుఁడైన వాడు తన తపశ్శక్తిచే నీసప్తర్షి మండలమును త్రిప్పి మరల సంచారము మొదలిడునట్లుగ చేయుచో చేయవచ్చును. కాని యది యసాధ్యమైనపని.

స్వామి :— మరి యూకు చేయ వలనుపడునా ?

జక్కన్న :— ఎందుకు వలనుపడదు ? దానికిని చాల శ్రమపడ వలసియున్నది. నాగార్జునాచార్యులవారు రచించిన పదార్థ విజ్ఞాన శాస్త్రమును సాకల్యముగ నెఱిఁగి యందు నిర్దేశించిన లోహముల పాళ్లుకలిపి చేయుచో చేయవచ్చును. కాని కేవల మాయన గ్రంథమున నున్న దున్నట్లు చేసినచో నది చాలదు. ఆపని యొనర్చుట కఖండమైన ప్రతిభావంతుడు కావలెను. ఇట్టి శ్రీధరు లెందరు పూనుకొనినను వారిచే నగు విషయము కాదు.

స్వామి :— మరియెట్లు?

జక్కన్న :— నేనే యాపని చేయఁదలఁచుకొంటిని. రాజదర్శనమే కాలేదాయెను. నే నేమి సేయుదును ?

స్వామి :— చక్రవర్తి తన యంతట తాను మంచివాడే. కాని యీకమ్మ కెలమలపై మక్కువచే వారిమాటలయందలి నమ్మకముచే నిట్లగుచున్నాడు, వారికంత చనవునిచ్చినాడు.

జక్కన్న :— స్వామీ ! నీవన్నియు చూచుచు నూరకుండుము. ఏమగునో కానిమ్ము.

స్వామి జక్కన్న వద్ద సెలవు తీసికొని వెడలిపోయినాడు. జక్కన్న రాజ్యమునందలి వైషమ్యములఁ గూర్చి యోజించుచు ననుకొనినాడు. 'అవును ఆరిపోవు దీపమునకు కాంతి యెక్కుడు. చివరి మెఱుపు లిటులే యుండును.'

౧౬

చండి జక్కన్న యొద్దకుఁ బోనేలేదు. ఆమెకు జక్కన్న నెటు లేని చెఱ విడిపింపవలయునని యున్నది. తానా ప్రయత్నములఁ జేయ వలయును. విడిపింపవలెను గాని యూరక చూచి వచ్చుచో నగున దేమున్నది. స్వామి యామెను చాలసార్లు జక్కన్నను జూడఁ బొమ్మనినాడు. కాని యామె నిరాకరించినది. అమెకు మనస్సంతే యునుఁ జివికి పోవుచున్నది. ఆయనను మరల ఖైదునఁ బెట్టిరేమి. ఆయనమీఁద చక్రవర్తికిఁ గల పగయేమి ? తిరిగి తానీయన నెట్లు విడిపింపవలెను ? రాత్రింబవలు లివే యాలోచనలతో నుక్కిరి బిక్కిరి యగుచున్నది. ఆమెకుఁ నిద్రాహారములు దూరమయినవి. అన్నకు తానింత వండిపెట్టుచు. ఇక తరువాత నున్మాదినివలె నూరియందలి యుద్యానములఁ దిరుగులాడి వచ్చును. ఎప్పుడు నేమియు తోచనిదాని వలె నిశ్శబ్దముగ దిక్కులు చూచుచు కూర్చుండును. స్వామి యేమైన ప్రశ్నించుచో కసరుకొనును. దినదినమును చెల్లిలిని చూచుచున్న కొలఁది స్వామికి భయమగుచున్నది. ఈమె బ్రదికి బట్టకట్టునా ! ఉన్మాదినివలె నగుచున్నది. అటు జూచిన నాయన యట్లున్నాడు. రాజ్యపరిస్థితులు ఘోరముగ నున్నవి.

స్వామి జక్కన్నను చూడని దిన ముండదు. ఆతడు ప్రతిదినము జక్కన్ననుండి క్రొత్తవిషయముల వినుచున్నాడు. స్వామి, జక్కన్న యీ యసమర్థుల పరిపాలన దినములలో నేలపుట్టెనో, ఏగణపతి దేవుని కాలముననగాని రుద్రదేవుని కాలముననగాని పుట్టిన నెంత బాగుండెడి దనుకొనును. వారైనచో నీమహాశిల్పికి నివాళు లెత్తెడి వారు. పూజలు సల్పెడివారు. అట్టి మహాత్ముని కీనా డీగతి యేమని వాపోవును.

చండి భైరవి దగ్గర కెన్నిమారులో పోయినది. భైరవి మాటాడినంతసేపును చాలచనవుగ మాటాడును. జక్కన్న విషయ మెత్తుచో మూభావముగ నుండును. చండి యెన్నిసారులో చెప్పినది. 'జక్కన్న మహానుభావుడు. ఆయన నట్లు బంధించియుంచుట రాజ్య క్షేమమునకు మంచిదికాద'ని. కాని భైరవి జక్కన్న విషయమునం దానేమియుం జేయజాలనని, తనకాయన యన్నచో భక్తియున్నది కాని నాగయగన్నమంత్రి యామెమాట వినుటలేదని చెప్పినది. చండి కేమి చేయుటకును తోచుటలేదు. ఎట్లైన నీకార్యము భైరవి మూలము ననే సానుకూలపడవలెను. దీని నెట్లైన నామెయే చేయవలయును.

ఉన్నట్లుండి చండి యొకరోజున భైరవి యొద్దకుం బోయి యని నది — 'భైరవీ! భైరవీ! నీవెట్లైన నాసాయముం జేయవలసిన దే.'

భైరవి :— ఏసాయమమ్మా!

చండి :— ఇంకనేమున్నది? ఆయన విషయమును నగరాధ్యక్షు నితో చెప్పితీరవలయును. తప్పదు.

భైరవి :— ఆపని నావల్లకాదని చెప్పితిని గాదా? ఇంకను నన్నెందులకు వేధించెదవు?

చండి :— కాదు భైరవి! నీకు తెలియదు. ఆయన మహాగ్ని కూడనట, తపస్సు చేసెనట. నిత్యమాయన గదియందు మహా తేజము వెల్గుచున్నదఁట, ఊరంతయుగగ్గోలుగఁజెప్పికొనుచున్నారు ఆయనపుణ్య పురుషుడు. మాయన్నతో నాయన తన భవిష్య మంతయుఁ జెప్పినాడు. రాజ్యము విషయము కూడ తనకు తెలియును కాని చెప్ప లేదు. ముందు ముందు రాజ్య మధమస్థితికి రాగల సూచన లున్నవని మాత్రము చెప్పి నాడు. భైరవీ! ఆయన యెట్లు చెప్పిన నట్లయి తీరును' మొదటి దండ యాత్రకుముం దాయన చెప్పిన జోస్య మేమయినది? అట్టి తపశ్శాలిని జెఱనుంచిన నింక ముందెన్నియో ముప్పులు కలుగవచ్చును. ఆయన యుసురు దేశమునకు తప్పక కొట్టును. అది మహా శాపమై రాజ్య క్షయ హేతువగును.

చండి మాటాడుటయం దాతురత ప్రేమ జాలి వెల్లువగ జాలు వారినవి. భైరవి గుండె నీరైనది. చండి యన్న భైరవి కెందులకో మమత! జక్కన్న యొతటివాడు! మాచండి యదృష్ట మెట్లున్నదో యనుకొనినది.

భైరవి :— అయినచో నన్నేమి సేయుమందువు?

చండి :— నగరాధ్యక్షునితో మరల చెప్పుమందును. ఈ మా రీసంగతులన్నియుఁ దెలుపుము. అప్పు డేమనునో చూతము.

భైరవి మాటాడలేదు. చండి మరల ననినది. 'భైరవీ? మాటాడ వేమి? నే నాయనను గూర్చి యింతగ ప్రాధేయపడుట కేవలము నా కొఱకు గాదు. ఈ మహోజ్జ్వల కాకతీయసామ్రాజ్యము విషయమున నడుగుచున్నాను. ఆయన మహామంత్రవేత్త. ఏమైనఁ జేయఁగలవాడు. నాకేమో భయ మగుచున్నది. ఆయన గొప్ప ఖగోళశాస్త్రవేత్త.

ఆయన గణనచేసి రాజ్యారిష్టకరమైన చిత్రము లెన్నియో కలుగగలవని చెప్పెనట. ఆయరిష్టముల నివారించు టాయన కొక్కనికే సాధ్యమైన పని. ఆయన యోగీశ్వరుడు. ఆయన కసాధ్యమైన దేమియు లేదు. కాని యేమి లాభము? ఆయన మనస్సు విరిగిపోవుచున్నది. అది మంచిదికాదు. ఆయన కన్నుల శాపములు నీలినీడలై తిరుగుచున్నవట. ఆయన దినదినమునకుఁ దపోబలముచే నగ్ని సమతేజుఁ డగుచున్నాడట. భైరవీ! నీవెట్లైన నీసాయము చేయువలెను. ఇది సామ్రాజ్యవిషయమని చెప్పితినిగద. నీవుమాత్ర మీసామ్రాజ్యములోని దానవు కావా? నీకు మాత్రము రాజ్యాభిమానము లేదా? ఏమి భైరవీ! అట్లూరక యాలోచించెదవు? ఒకవేళ నా నాగయమంత్రి నిన్ను కోపగించు ననుకొనుము. కోపపడనిమ్ము, పోయిన దేమున్నది? ఒక మహాకార్యముపట్ల నీమాత్రపు బాధనే భరింపఁజాలవా! ఏమి భైరవీ! నిరుత్తరవై కూర్చుండెదవేమి?'

భైరవిలో చండిమాటల నాలకించునంతసేపు నేవో మార్పులు కనుపించుచున్నవి. ఆమె చండివంక చూచినది, చండి మొగ మావేశముచే నెఱ్ఱవారి కందగడ్డవలె నయి కన్నులు చింతనిప్పులై సజలములై దీనముఖియైయున్నది. ఆమె కృశించిపోయినది, మాటాడలేక పోవుచున్నది, భైరవి యెట్లయినను మరల నాగయగన్నమంత్రిదగ్గర నీవిషయము ప్రస్తావించవలె ననుకొనినది.

భైరవి:- చండీ! దిగులుపడకమ్మా! నేను తప్పక యత్నింతును, నీ వూరక కృశించుట యెందులకు? నిశ్చింతముగ నుండుము.

చండి లేచి వెళ్ళిపోయినది.

మరునాడు భైరవి నగరాధ్యక్షునియొద్దకు బోయినది. ఆయన మరల నెందులకు వచ్చినావని యడిగెను.

భైరవి :— మీరు కోపగించుకొనకున్నచో చెప్పెదను.

నాగయ :— అదియేదో ముందు చెప్పుము.

భైరవి :— ఆజక్కనాచార్యుని చెఱ విడిపింపవలయును. ఆయన యెంత మహామాంత్రికుడు జ్యోతిష్కుడు పండితుఁడు శిల్పకళానిధి ఖగోళశాస్త్రవేత్త! ఆయన తపస్సంపన్నుడు. దివ్యతేజము కలవాడు. ఆయనను విడిచిపుచ్చకున్న రాజ్యమున కెంతయేని ముప్పువచ్చును.

నాగయ :— ఆయననుగూర్చిన యాలోచన నీకెందుకు గలిగినది?

భైరవి :— ఆయన పరమ యోగీశ్వరుడు. నిత్య మాయన గదియం దర్ధరాత్రమున నొకమహాతేజము వెలుగుచుండునఁట. ఆయన తపస్సు చేసి సామ్రాజ్య భవిష్య మంతయు తెలిసికొనెనఁట. అరిష్ట సూచనలున్నవి. వానికి మహాశాంతులు చేయవలెను. అట్టివాని కాయనయే సమర్థుడు. కనీసము సామ్రాజ్యోద్ధరణకై యాయనను విడిపింపవలెను. చక్రవర్తితో చెప్పవలెను.

నాగయ :— ఆయన గదినుండి తేజము లింకను వచ్చుచున్నవా నీకెట్లు తెలియును?

భైరవి :— ఊరంతయు నీవార్తలచే నట్టుడికి పోవుచున్నది నాకేల తెలియదు? చండి చెప్పినది. ఆయన పదునైదు దినములు తపము సల్పెనట ఘోరమైన జపములుం జేయుచున్నాడు. నిద్రాహారములులేవు. ఆయన కాగ్రహము వచ్చినచో నేమైన చేయఁగలఁడు.

నాగయ :— ఆ చండి యెవరు?

భైరవి :— స్వామి చెల్లెలు.

నాగయ :— స్వామి ?

భైరవి :— ఒక బాలశిల్పి. జక్కన్న వారియింటియందే నివ శించును.

నాగయ:— నీవిక పొమ్ము, నేనావిషయ మాలోచింతునులెమ్ము,

భైరవి వెడలిపోయినది.

నాగయగన్నమంత్రి చక్రవర్తివద్దకు బోవునప్పటి కాయన శ్రీధరాచార్యునితో బ్రసంగించుచున్నాడు.

చక్రవర్తి :— ఏమండీ ! మీరుచేసిన యాయాకు నాకంత తృప్తిని కలిగించలేదు. ఏమందురు ?

శ్రీధరుడు :— మరలఁ జేయుమన్నచో చేసెదను.

చక్ర :— చేయుట మాయభిమతము. అదిగాక మరిరెండెక్కువ యాకులు చేయవలయును.

శ్రీధరు :— అట్లే చేయుదును. తమసెలవైనచో నదియొక్క లెక్కలోనిది కాదు.

చక్ర :- మీరు మొదట నిట్లేచెప్పినారు. ఆమాటకును మీచేత కును సంబంధమేలేదు. ఈమా రేమిచేసెదరో మరి !

శ్రీధ :— అట్లనకుడు, నేనీమారు తప్పక చేయగలను.

చక్ర :— సరే కానిండు. పనిమాత్రము తొందరగ పూర్తికావ లెను. ఇకమీరు పోవచ్చును.

శ్రీధరుడు వెళ్ళిపోయినాడు, చక్రవర్తి యాతనిఁగూర్చి యిట్లను కొనినాడు — " ఈనూత్నశిల్పివలన నీశిల్పము కొనసాగదనిపించు చున్నది. ఏమగునో ?

శ్రీధరాచార్యులు పోవుటఁజూచి గన్నయమంత్రి చక్రవర్తి యెదుటికి వచ్చి నమస్కరించి యనినాడు, — "మహాప్రభూ ? తమ రా బంధితుని విడిపింపవలెను. ఆయన మహామాంత్రికుడు. తపశ్శాలి. ఆయన చెఱసాలయందు నిరాహారదీక్షనుబూనినాడు, ఆయన యహో రాత్రములు తప మొనరించుచున్నాడు. ఆయన రాజ్యోపద్రవ చిహ్నములు వచ్చునని చెప్పినాడు.

చక్ర :— నీవుచెప్పిన దే బంధితునిగూర్చి.

నాగయ :— ఆశిల్పియున్నాడే, మొదటియుద్ధ ఫలము లిట్లుండునని చెప్పినాడు, ఆయన తపఃప్రభావముచే నాయన గదియందు మహాతేజ ముద్భవించుచున్నది. ఆయనను చూచినచో భయమగుచున్నది. కోప మున దుర్వాసమహర్షి వలె నున్నాడు. ఎప్పు డేమి చేయునో తెలియ కున్నది. ఆయన జిహ్వాగ్రముల సర్వమంత్రరాజములు నాట్యమాడు చుండునట ఆయనను బట్టియుంచుట క్షేమముగాదు. అటుపై తమదయ.

చక్రవర్తి మాటాడలేదు. నాగయగన్నమంత్రి మరల ననినాడు, — "ప్రభూ ! నేనొకవిషయ మడిగెదను. తమ కాశిల్పిపై కోపమునకు హేతువేమి ? ఆయన చాల సత్పురుషుడే !

చక్రవర్తిమోమున విసుగుదల సూపినది. ఆయన యేదో యోజించుచున్నాడు. నాగయ యటులె కూర్చుండి యున్నాడు. ప్రభు వెంతకును తనవంక కే చూచుటలేదు. ఆయన లేచి చక్రవర్తికి నమస్కరించి నెమ్మదిగ గదివిడిచి పోయెను.

చక్రవర్తికి నాగయ వెళ్ళిన సంగతి తెలియదు. ఆయన మనమున సప్తపర్ణి, సప్తపర్ణియే మెదలుచున్నది. రెండుమారులు విజయప్రాప్తియైనదని సంతసించుచున్నను మరల రెండాకులు తుంగి

పోయినవేమి? ఈశ్రీధరుఁడీకార్యమునుఁజేయజాలడు. ఆయన చేసిన యాకునకును యీసప్తపర్ణియాకునకును మిక్కిలిభేదమున్నది. అబంధితుడైన శిల్పి సమర్థుడే, కాని తానాయనను విడిచిపుచ్చడు. ఆయనను విడిచినచో మనస్సును శాంతిగ నుంచుకొనజాలడు. నగరమంతయు నాయన మహత్త్వమును వేనోళ్ళఁ జెప్పుకొనుచున్నారు. అట్టి మహాపురుషునిఁ జెఱపెట్టినపాపము తన్నుబట్టి వేధించునా? పోనిమ్మదియైన భరింతునుకాని మాచల యీయునయందలి ప్రేమ తనకు సహించరాని దనుకొనును. ఈయాకు లేల తునిగినట్లు? ఆజక్కన్న శపించలేదు. ఈసర్వతపస్సు లందులకుగాదుగద యనుకొనినాడు. ఈయన శాపముచే తన రాజ్యము నశించునేమో! ఆయన కేమో భయ మొదవినది. ఆయనమనస్సంతయుఁ గల్లోలిత మయినది. ఈసప్తపర్ణి యిఁక నష్టపర్ణి కాదా? దాని కాయోగ మేలేదా?

## ౧౭

మాలికుకాఫరు మరల సైన్యనివహములను సమకూర్చుకొని యోరుగంటిపై దండెత్తి వచ్చుచుండె నను, వార్తలు వచ్చినవి. తురుష్కులింత త్వరితముగ మరల దాడియెత్తివచ్చుట ప్రతాపరుద్రచక్రవర్తి కాశ్చర్యము నుకలిగించినది. అయినను ఆయన సహజధైర్య సంపన్నుడు. వెంటనే తనసేనానులందరును యుద్ధసన్నద్ధులగుటకు నుత్తరువులఁ జేసెను. తనప్రతినిధివర్గమున కంతటికిని సైన్యములను ప్రోగుచేసి తీసుకొనిరా నియమించెను. రెండుమారులు విజయమును సంపాదించిన యాంధ్ర సైనికు లుత్సాహావేశములతో దళములుగ విరోధిసైన్యములను నెదుర్కొనబోయిరి.

మాలిక్ కాఫరు తేలికగా నాపై దండెత్తి వచ్చెను. అతని సైనికులు మజిలీలుగ ప్రయాణము చేయుచు మసూద్ పురమున రెండు రోజులు విశ్రమించి, దుర్గమారణ్యబంధురములు, విషమశిలాపరివృతాచలపంక్తుల నతికష్టముతో నరకయాతన ననుభవించుచు దాటి యారు దినములకు సుభాన్‌పురమును చేరిరి. అచ్చట నాలుగుదినములు విడసి పదమూడు దినములకు బందరు నగరమునుజేరి యచట నొక పక్షము దినములు విశ్రమించిరి. ప్రళయమారుతమువలె చెలరేగి సర్వనాశమొన ర్చుచు పర్వతములగడచుచు నదుల నతిక్రమించుచు వచ్చుచున్న నీసైన్య వాహినికి మార్గమధ్యమున నర్మదానది జలప్రళయమువలె నడ్డుతగిలి నది. దానిని వారతిప్రయాసమున దాటి, ఎనిమిది దినములకు దేవగిరి రాజ్యపు సరిహద్దులకు వచ్చి చేరిరి. అంతకుఁ బూర్వమే యాంధ్రసైని కులు వేగువలన నీ తురుష్కుల విజృంభణము నాలకించినవార్త దేవగిరి రాజ్యమునందు తమసైన్యమును పెట్టుకొని కాచుకొని కూర్చుండిరి. తురుష్కులుదగ్గఱగుచున్న వార్తలాలించి యాంధ్రసైనికులినుమడించిన రణోత్సాహముతో వారికెదురునడచి వారిసైన్యములతో దలపడిరి. దేవగిరియందలి నీలకంఠపట్టణమున నాంధ్రసైన్యము చెక్కుచెదరకుండ నెప్పటికప్పుడు క్రొత్తసైనికుల చేకూర్చుకొనుచు సురక్షితముగనున్నది. తురుష్కుల నీమారుగూడ విజయలక్ష్మి వరించలేదు. ఆంధ్రపరాక్ర మము నాగి నిలువలేక తురుష్కసైన్యము వెనుదిరిగి నర్మదానదీతీరము నకుఁ జేరినది. నర్మదయొడ్డున ఘోరసంగ్రామమై తురకలు హతశేష సైన్యముతో వచ్చినదారిఁ బట్టిరి.

ఆంధ్రవీరు లుత్సాహముతో తిరిగివచ్చి ప్రతాపరుద్రచక్రవర్తి కీసంతోషకరమైన వార్త చెప్పిరి. చక్రవర్తి యానందించినాడు, ఆయన సప్తపర్ణిని జూడబోయెను. ఆచెట్టు నుండి మరల మరియొక యాకు

రాలినది. చక్రవర్తి క్రుంగిపోయినాడు. విజయోత్సవము లంతిపురిలో నిషేధింపబడినవి. నగరమునఁగూడ మునుపటియంత వైభవముగ జరుగలేదు. ప్రభువు మనమున విజయోత్సవానందమే లేదు.

మరునాడు చక్రవర్తి సభదీర్చినాడు. ఇందులూరి అన్నయ నాగయ గన్న మంత్రి ఇందులూరి రుద్రుడు మొదలుగాఁగల సర్వసేనానులును యుద్ధవార్తలఁ జెప్పుచున్నారు.. "ఇక నీతురకవాండ్రు మరల నాంధ్ర రాజ్యపు పొలిమేరలు గూడ త్రొక్క సాహసింపరు." అని యన్నయమంత్రి యనినాడు.

ఇందులూరి రుద్రుడు :— మూడుసార్లు పరాభవమును పొంది కూడ నింక నేమి రాగలరు? వారి కీపాటికి మన యాంధ్ర పౌరుష శౌర్యము లామూలాగ్రముగ తెలిసియుండును.

ఎఱ్ఱమేచయనాయకుడు :— ఇఁకనుండి యాంధ్ర రాజ్యమునకు తురుష్కుల నుండి దండయాత్రలు రావని చెప్పవచ్చును.

సాహిణిమారుడు :— ఆ నర్మదాతీరమందైన యుద్ధ మేమని వర్ణింపగలను? వర్ణనాతీతము. మన సైన్యము లాతురకలను చీల్చి చెండాడి వెన్నంటి తరుముచో వారు గుండెలవిసి దారిఁగానక నారాత్రి సమయమున నర్మదాగర్భమున నగాధసలిలములఁ బడి ప్రాణములఁ గోల్పోయినారు. కొంద రెదిరి సైన్య మనుకొని తమ సైన్యమునే నఱికికొనిరి. హతశేష సైన్యముతో నా మాలిక్ కాఫర్ వచ్చిన మార్గమును బట్టినాడు. ఆంధ్రవీరు లాతని నర్మదానది యావలియొడ్డు దాక తరిమివైచిరి. ఇంద రిన్ని విధములుగ నివేదించుచున్నను చక్రవర్తి మొగమున నానందము లేకపోగా నేవో విషాదరేఖ లలముకొనిన ట్లున్నది. ఆయనకు వా రేమి చెప్పుచున్నారో వినిపించుటలేదు.

ఆయనదృష్టియంతయు సప్తపర్ణియొక్క పర్ణచ్యుతి హేతువును గూర్చి యూహసేయుటయం దున్నది. ఇది పరమవిచిత్రముగ నున్నది. మూడుమారులయిన దండయాత్ర, మూడుమారుల విజయములు, మూడాకులు రాలిపోవుట యత్యద్భుతముగ నున్నది. విజయవార్త నాలకించిన తన యుత్సాహ మంతయు సప్తపర్ణిని చూడగనే నీరయి నది. ద్వారపాలకుఁ డొకడు వచ్చి "ప్రభూ! ఎవరో శ్రీధరాచార్యు లవారట, వచ్చినారని" చెప్పినాడు.

ప్రభు వాతనిఁ బ్రవేశపెట్టు డనెను. శ్రీధరాచార్యులు లోనికి వచ్చినాడు. ప్రభువునకు నమస్కరించినాడు. ప్రభు వాకులు చేసితివా యని ప్రశ్నించినాడు. శ్రీధరుడు తానుచేసిన యాకులను చూపించి నాడు. చక్రవర్తి యవి చూచి మాటాడలేదు. వానిని తీసుకొని పోయి సప్తపర్ణికిఁ బెట్టి చూడవలె ననుకొనినాడు. ప్రభువు తన సేనా నుల నందర సప్తపర్ణియున్న గదిలోనికి తోడ్కొని పోయినాడు. ఆక్రొత్త యాకులఁ దీసికొనిపోయి యాసప్తపర్ణికిఁ బెట్టి చూచినాడు. ఆయాకు లాచెట్టున కమరి యుండలేదు. ప్రభువు విసుగుకొనినాడు. మంత్రుల నడిగినాడు. వారెవ్వరును మాటాడలేదు. వారికా సప్త పర్ణిని చూచుటకది మొదటిసారి. వారు దానిచేత నాశ్చర్యము నంది నారు. ప్రభువు శ్రీధరుని నంకై యనినాడు.—మీరె చూచు చుంటిరి గద. ఈయాకు నిర్మాణము మీకు కుదురుట లేదని మాయభిప్రాయము, మీచేసినయాకు లీసప్తపర్ణికి అమరక వికార ముగ నున్నవి. మీకట్లు చేయుట చేతగాదా యేమి?

శ్రీధరుడు:— ప్రభూ! ఆ సప్తపర్ణిని చేసిన శిల్పి యీనాటి వాడుకాడు. అర్ధశతాబ్దము క్రిందటివాడై యుండును. ఆనాటి శిల్పి జ్ఞానము పదార్థ విజ్ఞానము వేరు. ఈనాడు వేరు. ఈయేబదియేండ్లుగ

దేశమున నీశాస్త్రములయందు చాల మార్పులు కలిగినవి. నూత్న పద్ధతు లుద్భవించినవి. ఆయాకులలో కలిపిన క్రొన్నిలోహము లిప్పుడు దొఱకనివి.

శ్రీధరా :— అస లాయాకులకన్న నే చేసిన పర్ణమే బాగున్నది. మీరంగీకరించినచో నేనొకటి సేయుగల్గుదును.

ప్రభువు :— ఏమది ?

శ్రీధరుడు :— మీరంగీకరించినచో నీసప్తపర్ణిని మార్చి మరల నొక చెట్టును చేతును.

నాగయగన్నమంత్రి ఇందులూరి యన్నయ్య యాయూహ చాల యుక్తముగ నున్నదనిరి. ప్రభువు మాటాడలేదు. ఆయన యూరక పూర్వపుటాకులను, ఇప్పటియాకుల నొకదగ్గర జేర్చి యదే పనిగ జూచుచుండెను.

ప్రభువునకీ శ్రీధరుని మాటలు కష్టకారణము లైనవి.

ఇందులూరి రుద్రసేనాని శ్రీధరాచార్యుల వారితో నిటు లనినాడు —'అయిన మీరు క్రొత్తచెట్టు చేయుటటుంచి ముందీ ప్రాత చెట్టునకు నాయాకు లదే మాదిరిగ జేయలేరని తేలినది గద !

శ్రీధరుడు మొగము ముడిచికొని యనినాడు. ఆపూర్వపు టాకులయందు నాయాకులయందున్నంత యుక్తమయిన శిల్పములేదు. నాయాకులయందు పదారు వన్నె బంగారము మిడిసి పడుచున్నది. వాని యందట్లుకాదు. అవి శ్వేతాధిక్యమును కలిగియున్నవి. ఈసంపూర్ణమైన చెట్టును నన్ను చేయుమన్నచో తేలికగ చేయగలను. ప్రభువు లేమందురో మరి.

ప్రభువున కీ శ్రీధరుని మాట లన్నియు వెగటుగ నున్నవి. ఆయన యేమియు మాటాడక కొంతసేపాలోచించి యనినాడు. ఈసప్తపర్ణిని పడగొట్టుట మాకిష్టములేనిపని. ఇది యిట్లుండగనే యా పర్ణములను పూర్వవైఖరిగ చేయుగల శిల్పి లేనేలేడా యనినాడు.

శ్రీధరుడు :— అప్పటి శిల్పుల యూహావైచిత్రి వేరు. ఇప్పటి వారి మార్గము వేరు. మరల నట్టి యాకులు చేయుట వలనుపడని విషయము.

ప్రభువు :— జక్కనాచార్యు లని యొకాయన యున్నాడు. ఆయనను గురించి మీకేమైనఁ దెలియునా ?

జక్కన్న పేరు వినగనే శ్రీధరుడు క్రీబెదవి కొంచెఁదిగ నెడమ వైపున ద్రోసి కన్నుల నిరసన యుట్టిపడునట్లు చూచినాడు.

ప్రభు వదిచూచి యనినాడు — 'ఆయనపేరు విన్ననే యంత మారితివి. ఆయనను నీవెఱుఁగుదువా ? ఆయన గొప్ప శిల్పియటగదా ?'

శ్రీధరుడు :— ఆతనిని నేను చిన్నప్పటినుండి యెరుగుదును. ఆయన చాల నహంకారము గలవాడు. మిక్కిలి గర్వి. ఎంతవారి నైన లెక్కచేయడు. ఆయనకు తనయంతటి శిల్పసంపన్నుడు వేఱొకడు లేడని గర్వము. ఎప్పుడును తన్ను తాను పొగడుకొనుచుండును. ఆతని మాట చాల పెళుసు. ఉన్నదున్నట్లుగ పిడుగులవలె నని తీరును. అందు లకే యాతడు మా ప్రభువుల యాస్థానమున కెక్కలేకపోయినాడు. వారి కాతడనిన పడని విషయము. ఏమీ ? అత డీనగరమునకు, దాను గూడ వచ్చెనా ?

ఎవరును మాటాడలేదు. వారందరు జక్కన్నను గురించిగొప్పగ యనుకొనుకొన్నామేగాని యొకయూరుపేరులేని సామాన్య యువకుఁ

డని నేటికిగాని తెలియులేదనుకొనిరి. చక్రవర్తి మనస్సునమాత్ర మెందు లకో ఈపని కాయన సమర్థుడని తోచుచున్నది. చక్రవర్తి వారికి సెలవొసంగి తనమందిరమునకుఁ బోయినాడు. ఆయనకీ శ్రీధరుడు తనతలచినపనిని పూర్తి గావింపజాలడని తెలిపోయినది. తన మనోరథ మునకు పరిపూర్ణత చేకురవలయు నన్నచో నా జక్కన్నయే చేయ వలయును. తాను చెఱసాలకుబోయి మాటాడునా? లేక యాతనినే యచటికి బిలిపించునా? అట్లు చేయుచో తనమీద నాతని కలసభావము కల్గును. అట్లుచేయరా దనుకొనెను. అయినచో మరి యీవిషయ మెట్లు తేలగలదు? ఆయన చాలతడ వట్లె యోజించినాడు. చివరి కొక పరి చారికను పిలిచి తనయాంతరంగిక భటుఁడైన మేచయను రమ్మని కబురు పెట్టినాడు.

మేచయవచ్చి ప్రభువునకు నమస్కారముఁ జేసి యనినాడు. — ప్రభూ! తమకు నావలన గావలసిన కార్యమేమున్నది?

ప్రభువు :— మేచయా? ముఖ్యమైన కార్యమే వచ్చినది. అది నీద్వారమున జరుగవలయును. అందులకై కబురు పంపితిని.

మేచయ :— అదియేమో తెల్పుడు. నేను ఈ క్షణమే నిర్వర్తింతును.

ప్రభువు :— ఇదిచాల రహస్యముగ జరుగవలసిన విషయము. నీవు చాల జాగరూకతతో నంచరింపవలసియుం ను.

మేచయ :— అది యెట్టిదైన నట్లే సంచరింతును. నాపట్ల మీకా సందేహ మవసరములేదు.

ప్రభువు :— అయినచో ముందిది చెప్పుము. కారాగారశాఖ యం దెవనితోనైన నీకు స్నేహ మున్నదా?

మేచయ :- కారాగారశాఖయా? ఆఁ వెంకడనియొకడున్నాడు.

ప్రభువు :- అటులైన నేను నీ కొక బంగారపు టరటియాకు నిత్తును. నీవు దాని నెటులేని మనకారాగారమున నున్న యా శిల్పికిఁ జూపించి యాతఁ డేమనునో నాకు తిరిగి చెప్పవలయును. నీవుపొర పాటునైన నాయాకును నేను పంపినట్లుగా యాయన కెరిగించరాదు. తెలిసినదా?

మేచయ :- చిత్తము ప్రభూ! తెలిసినది. అట్లే యొనర్తును.

ఒకనాడు స్వామి వచ్చినాడు. ఆత డెప్పుడు నేవియో విశేష ములు మోసి తెచ్చును. జక్కన్న స్వామిని జూడగనే విశేషము లేమనినాడు.

స్వామి :- అన్నా! కావలసినన్ని విశేషములున్నవి. ఆ శ్రీధ రుడు ఆకులు చేసెనట. మరల నొకయాకు పాతది తునిగినదఁట. ప్రభు వున కేలనో భయము వేసినది. అందుచే మొన్న విజయోత్సవములఁ గూడ రద్దుచేయించినాడు.

జక్కన్న :- స్వామి ఆకు తునిగిన నేమైనది? చెప్పుచున్న దానిని విడిచి విషయాంతర ప్రసక్తిని దెత్తువేమి? ముం దావిషయము చెప్పుము.

స్వామి :- ఆశ్రీధరునకు వీనిచేత తెలిసినది కాదఁట. ఆయన చేసిన యాకులు చెట్టున కమరలేదు చక్రవర్తికిఁ దృప్తి కలుగలేదు.

జక్కన్న :- అయినచో నేమి చేసిరి?

స్వామి :- శ్రీధరుఁడా చెట్టునే నాశమొనరించి మరల జేతు నని నాడఁట.

జక్కన్న :— చక్రవర్తి యొవ్వఁకొనినాఁడా?

స్వామి :— నాకు తెలియదు. అన్నా! అప లాయాకు కుదురనే కుదురదా?

జక్కన్న :— నాయనా! అది రాజాంతఃపురమున నున్నది. నేను చూచితినా! ఎట్లు చెప్పఁగలను?

జక్కన్న కొరకై ఫలములఁ దెచ్చి వారిసంభాషణ నాలకించుచు నిలిచిన వెంక డిట్లనినాఁడు— "స్వామీ! రాజాంతఃపుర విషయము నాకు తెలియదుకాని నాస్నేహితుని యింట నొకబంగారపుటాకున్నది. అదిగాలి కల్లలనాడును. తునిగిపోదు. చినిగిపోదు. విచిత్రముగనున్నది. దానిని చూడ నెంతురేని తెప్పించఁగలను." స్వామి జక్కన్న లుద్వేగమున నొకేమారుగ తెప్పించుమనినారు.

వెంక డాక్షణమునఁబోయి మేచయను వెంటనిడుకొనివచ్చినాఁడు- మేచయ తనవద్దనున్న యా బంగారపుటాకును జక్కన్న చేతి కందించినాఁడు. జక్కన్న దానిని చేతియందుంచి తదేకదృష్టిఁగ దానివంక కే చూడ్కులు కేంద్రీకరించి చూచినాఁడు. దాని నటునిటు త్రిప్పినాఁడు. దాని నిర్మాణమున కాశ్చర్యముఁ జెందినాఁడు.

స్వామి :— ఏమి అన్నా? ఏమందువు, ఇట్టియాకును మరల చేయ వీలగునా?

జక్కన్న :— అదియే యోచించుచున్నాను. ఇది పూర్వపు శిల్పులచే చేయఁబడినది. దీనిని నిర్మించిన శిల్పి యొక మహామేధా సంపన్నుఁడై యుండును. సర్వశాస్త్రవిదుడు కావలయును. ఇతరునికీచేత కుదరదు. నాడు శాస్త్రమునకున్న మర్యాద, శాస్త్రమునందలి యభిమానము, బహు దేవతలయందు భక్తి ధ్యానము సర్వము మారి

పోయినది. పూర్వశిల్పుల శిల్పములఁజూచి యనుకరించుటయేతప్ప స్వబుద్ధినుపయోగించుట కిష్టపడువాఁడు లేఁడు. ఏండ్లుగడచుటచే నాపూర్వ శిల్పుల శిల్పవిద్యను జూచినను గ్రహింపగలవారు లేకున్నారు. ఈ వర్ణము లింతపల్చగనుండి చినుగకుండుట కాశిల్పి దీనియందేదు లోహ ములఁ గలిపినాఁడు. ఇప్పటి శిల్పుల కావిషయము తెలియదు. ఆలోహ ములలో నొకలోహము కాశ్మీరమున కావలనున్న త్రివిష్టపమునం దున్నది. నేఁడది దొరకుటయే దుర్లభమేమో! పూర్వపుశిల్పి యాసప్త లోహములఁదెచ్చి వానిలో నొక్కొక్క లోహమునకు సప్తర్షులలో నొక్కొక్కని నధిపతిగఁజేసి యొక్కొక్కయాకున కొక యేడుదినముల చొప్పున తపస్సుచేసి యాకులఁ జేసినాఁడు. జక్కన్న యిట్లు చెప్పుచు నూర్ధ్వదృష్టికలవాఁడై యట్లే కూర్చుండిపోయినాఁడు. మేచయ 'ఏమి స్వామీ! అట్లే చూచుచుంటి' రనినాఁడు.

జక్కన్న :— ఈయాకు రాజాంతఃపురములోని సప్తపర్ణియం దలిది కాదా?

మేచయ దిగ్భ్రాంతుఁడై జక్కన్న కాళ్ళపైబడి క్షమించుఁడని వేఁడుకొనినాఁడు. జక్కన్న యాతని కాయాకునిచ్చి పరవాలేదు పొమ్మని పంపినాఁడు. వెంకడు వానిననుసరించినాఁడు.

స్వామి :— ఇది సప్తపర్ణియందలిదా? అయినచో నీయాకుఁ జూచితివిశద. ఇప్పుడేమందువు?

జక్కన్న :— చేయవచ్చు ననుకొనుము. అందువలన నయ్యెడి దేమున్నది. మనలోనిమాట. చక్రవర్తివరకు పోఁగూడదు. ఇది చేయ వచ్చును. చేయుటకు చాలశ్రమ పడవలయును.

స్వామి :— అయినచో నీవేల చేయరాదు?

జక్కన్న :— నాయనా! అసలు పరమరహస్య మేమన నీయేడా కుల నేడు లోహములతో చేసినను నేడు లోహములకు నేడ్గురు ఋషులనధిపతులనుగ జేసెనని చెప్పితినిగద! అయేడుగురు ఋషు లలో వశిష్ఠుడు సర్వబ్రాహ్మణ్యము ముద్దకట్టినమూర్తి. ఆయన బ్రహ్మర్షి. ప్రస్తుతము వశిష్ఠమహర్షి యనుగ్రహము రాజ్యమునకు తక్కువగ నున్నది. రాజ్యమున వీరశైవము ముదిరిపోయినది. బ్రహ్మ ణ్యము నశించినది. బ్రాహ్మణాధికారమనునది లేదు. అదిగాక బ్రాహ్మ ణావమానము జరుగుచున్నది. అందుచే నావశిష్ఠునికి రాజ్యముపైఁ గోపము గల్గినది. ఆయన కోపకారణముననే యీ పర్ణచ్యుతి యగు చున్నది. నీవు కావలెనన్నచో నా సప్తపర్ణి కాండమును తెగగొట్టి చూచినచో దానియడుగున రాగిరేకుమీద బీజాక్షరములచే సప్తపర్ణి మండలము కనిపించును. ఆమండలమునందు స్థాపించినారు. దానిపైనీ చెట్టును నిర్మించినా డాశిల్పి. నేడు సర్వమును రాజ్యమునకు వినాశ హేతువులై కన్పట్టుచున్నది. ఈరాజ్యమున నేవంకజూచినను సప్త సంఖ్యాపరివృతమైన సప్తసంఖ్యాప్రాబల్యపరిపోషకమై కనుపించుచున్నది. అసలా సప్తసంఖ్యయే సామ్రాజ్యమునకంత మంచిదిగ కనుపించుటలేదు.

స్వామి :— అయినచో నేమందువు? ఈసామ్రాజ్యమిక నిట్లు పోవలసినదేనా?

జక్కన్న :— శతవిధముల నాశ కిక తావులేదు. ఒకే శుభసూ చన కాననగుచున్నది.

స్వామి :— మరల నదియేమి?

జక్కన్న :— అన్నియు సప్తసంఖ్యాకములేగాని ప్రతాపరుద్రుని భార్యలు పదునార్గు రున్నారు. మాచలదేవి యొకయామె. మొత్తము

పదునేడుమంది యున్నారు. ఈపదునేడును నేడుచే భాగింపవలనుపడదు కావున రాజ్యోన్నతికేమైనప్రయత్నించవచ్చునేమో యనునాశ మిన్కు మిన్కు మనుచున్నది.

ధ్యాన సమయమైనది. జక్కన్న ధ్యానమగ్నుడైనాడు. స్వామి వెడలిపోయినాడు. ఆపోయిన స్వామి మరల వారముదినములకు వచ్చినాడు. అతని మొగమున కళ, కాంతి మాసిపోయినవి. ఏదో గాఢమైన చింతయాతనిఁ గలచివేయుచున్నట్లున్నది.

జక్కన్న యాతని స్థితిఁ జూచి యనినాడు — ఏమిజరిగినది! అట్లుంటివేమి? యని.

స్వామి :— అన్నా! ప్రతాపరుద్రచక్రవర్తి కింకను నల్గురుంపుడు కత్తెలున్నారు.

జక్కన్న యులికిపడినాడు. ఆయన యొకగంట సేపటులనే నివ్వెరపోయి చూచుచు కూర్చుండిపోయెను. ఆయన కన్నుల నవిరళముగ నశ్రుపాత మగుచున్నది. స్వామి చలించిపోయి యనినాడు. మహాత్మా మరలనేమి దర్శించితివి?

జక్కన్న :— తమ్ముడూ! పాప మాప్రతాపరుద్ర చక్రవర్తిని తలచుకొనినచో దుఃఖము పొంగివచ్చుచున్నదయ్యా!

౧౨

ఐదునెలలు గడచినవి. ఈ యయిదునెలల మధ్య తురకలు మరల దండెత్తి వచ్చి యాంధ్రులను దాకిరి. కాని యీమారును వారికి జయాధిదేవత విముఖయే యైనది. వారీ యాంధ్రసైన్యము నడ్డి నిలువ

లేక యడలుపుట్టి సంధి బేరమునకు దిగిరి. ఆ సంధి నిబంధనల చొప్పున తురకలు మరల నెన్నడును నాంధ్రదేశమున నడుగు పెట్టకుండునట్లును, మూడువందల గుఱ్ఱములు, వంద ఏనుగులు, లక్ష సువర్ణపు నాణెములును తురకలు ప్రతాపరుద్రచక్రవర్తి కిచ్చునట్లును సంధిపత్రముపై చేవ్రాలు నుంచిరి. సంధి పొసగినను నిరువాగుల నెంతయేని సైన్యము నష్టమైనది. కాకతీయ సేనానలు పలువురు యుద్ధమునం దాహుతియైరి. ప్రతాపుని మనస్సునందీ బాధ మిక్కుటమై వేధించుచున్నది. తన కున్నది సేనానులు, తనరాజ్యము రక్షింపఁబడునది వారిమూలమున, వారేపోయిరి. ఇంక తన సామ్రాజ్యాభివృద్ధి యెట్లు? నాడు నాటికి నీ యుద్ధమునందు విజయ పరంపరలు తనకు దుఃఖహేతువులే యగుచున్నవి. మరల నా సప్తపర్ణివర్ణ మొక దూడినది; ఈ శుభమునకా యశుభసూచనయేమి? తనసామ్రాజ్యమున కేవో కీడుదినములు రానున్నవనుకొని నాడు. దినములు గడచుచునే యున్నవి. ఆసంధిచేసుకొనిపోయిన తురక లూరుకొనలేదు. వారు మరల దండుసేయుటకై ప్రయత్నములు సేయుచున్నటుల జాంఘికులవార్తలు. ఆ సిగ్గుమాలిన వారు మరల రెండుసార్లు దేవగిరివరకువచ్చి తమయంతటతామే వెనుదిరిగిపోయినసంగతి వేగులవాండ్రు చెప్పిరి. ఆతురకలా వచ్చుట యెందులకు? వచ్చినవారట్లు పోయిరేల? దేవగిరిరాజుతో కలసి యేవో కుట్రలు పన్నుచున్నట్లున్నదఁట. ఆ దేవగిరిరాజునకుఁ దానన్న నవరిమిత క్రోధము. ఏమో యేదియెట్లు కానున్నదో, ఎందువల్లనో యెప్పటికప్పుడేదియో కారణముచే విజయానందము దూరమగుచున్నది. ప్రభువు మనస్సు కలఁగబారి యున్నది. ఆయన యోజనల కంతులేదు. ఆయన మొగము జూదములో సర్వస్వమును కోల్పోయినవాని మొగమువలె నున్నది.

భైరవి వచ్చినది. మాచలదేవి పంపగా వచ్చినది. ప్రభువుస్థితిఁ జూచి గాభరాపడినది. ప్రభు వీ లోకమువాఁడుగ నున్నాఁడా యనిపించుచున్నది. ఆయనలో కదలికయే లేదు. నిశ్చలముగ నున్నాఁడు. ప్రభువు భైరవిరాకను గుర్తించనే లేదు. భైరవి కేమిచేయవలెనో తోఁచుట లేదు. గంటలు గడచుచున్నవి. భోజన సమయము మించిపోవుచున్నది. ప్రభు వింకను నుదాసీనముగ కూర్చుండియే యున్నాఁడు. తుదకు భైరవి సాహసించి 'ప్రభూ?' అని పిలిచినది. ఆపిలుపాయన చెవికెక్కలేదు. భైరవి తిరిగి పిలిచినది. చక్రవర్తి వెనుదిరిగి చూచినాఁడు. వచ్చినపని యేమని భైరవి నడుగలేదు. ప్రభువు మొగమిటుత్రిప్పుటయే మహాభాగ్య మనుకొన్నది భైరవి. తానెట్లును చెప్పిపోవుటకేకద వచ్చినది. అది చెప్పివేయుదమనుకొని యనినది. — "మహాప్రభూ! ఆ మాచలదేవిమీఁద తమకు దయతప్పి దర్శనమీయక పదునేను నెలలైనది. ఆమె దినదినమునకును కృశించి పోవుచున్నది. ఆమెలో మునుపటి సౌందర్యమే లేదు. వాడి వత్తయైపోయిన మల్లెపూవు వలెనున్నది. ఆమె యెల్లప్పుడును విచారముగ దీనముగ కూర్చుండియుండును. నృత్యగీతముల పేరే తలపెట్టదు. అలంకరణల కై నేసికొనదు. తలదువ్వుకొనదు స్నానముఁగూడ దినమున కొకపరి యెప్పుడో చేయును. అన్నము ముట్టుటలేదు. ఫలహార మొకింత సేయును. ఏడాదిగ నెల్లపుడును కావి రంగు నారచీరలనే ధరించును. ధరాశయనము. ఆమెను చూచినచో మాగుండెలు లవిసిపోవుచున్నవి. ప్రభూ! తా మొక్కసారి కటాక్షించి ఆమెను చూచిపోవలెను. ఆమె యెక్కువకాలము జీవించునని యాశలేకుండనున్నది. ఆమెకు తమదర్శనము కఱవై పోయినది.

భైరవి చెప్పుచున్న దేమియు రా జాలించుచున్నట్లే లేదు. భైరవి మరల ననినది. — "మహారాజా! ఏమందురు? ఆమె మీకై

పరితపించుచున్నది. తా మెప్పుడామె సౌధమునకు వత్తురో! ఆమె యావేదనను చూడలేకున్నాము. ఆమె తన దోషమేమో తెలియక చింతించుచున్నది. ముచ్చటపడి మిమ్మడిగి యామె నూత్న చిత్ర శాలను నిర్మించినది. దానిద్వార మింతవరకు మూయబడలేదు. అచట నిత్య నైవేద్యములు లేవు. పాడుపడినదానివలె నైనది. ప్రభూ! ఆమె మనస్సు చితికిపోయినది."

అంతయు విని ప్రభు విట్లనినాడు. — "భైరవీ! మామనస్సున కిప్పుడు స్వాస్థ్యము లేకుండనున్నది. మొన్నటి యుద్ధమున మాసేనా నులు చాలమంది దివంగతులైరి. మాసప్తపర్ణికి నాలుగాకులు తునిగి పోయినవి. మా హృదయమున మిగుల బాధగ నున్నది. మేమిప్పు డామె మందిరమునకు రాజాలము. మాకు స్వాస్థ్యము చిక్కినప్పుడు వచ్చి చూచెదము లెమ్ము."

భైరవి వెడలిపోయినది. ప్రభువట్లే కూర్చుండెను.

భైరవి చక్రవర్తి సౌధమునకు వెళ్ళివచ్చిన నాటినుండియు మాచలదేవియం దొక విధమైన మార్పుకలిగినది. వారల నామెకన్నుల యందొక తీవి యుదయించినది. ఆమెలో నేదో మనోధైర్య మేర్పడినది ఆమె తిరిగి నియమిత భూషణముల నుంచుకొనుచున్నది. వరుసగ రక్త వర్ణ కౌశేయములనే కట్టును. ఆమె నాడు మొదలిరువురు ప్రఖ్యాతులైన యశ్వశిక్షకులరావించి తనయుద్యానమున నశ్వారోహణము, స్వారియు నభ్యసించుచుండెను. ఖడ్గయుద్ధ విశారదునొక్క యోధునినియమించి యాయనయొద్ద ఖడ్గవిద్యను నేర్చుకొనుచున్నది. ప్రతిదిన ముషఃకాల మునకు ముందుగలేచి గుఱ్ఱపుస్వారిచేయును. సాయంతనముల ఖడ్గ విద్య నభ్యసించును. మధ్యాహ్నములయందు దైవారాధన యొన ర్చును. ఆమె యునికియే మారినది. ఆమె యుభయసంధ్యలయందును

వ్యాయామముచేయుచున్నది. ఇవియన్నియునామెయేలనేయుచున్నదో తెలియుటలేదు. ఆమె కన్నులెల్లపుడు వీరరస ముట్టిపడుచు రక్తవర్ణము లై శృంగారలజ్జారుణిమపూర్వము లగుటచే లలితరేఖాసమన్వితములు గనున్నవి. ఆమె భృకుటీముడివైచి యెదో యోచించుచునేయుండును. ఆమెయట్లు, ఖడ్గవిద్యయు, గుఱ్ఱపుస్వారియు నేర్చుకొనుచున్నదన్న విషయ మాచండికిని భైరవికినిఁ దప్ప మరెవరికిని దెలియదు. భైరవి మూలమున చండితో మాచలదేవికి పరిచయమైనది. చండీ మాచల దేవులిరువురును తమ పూర్వగాథల శ్రవ్యకొని పూర్వపరిచితిని బలీయ మొనర్చుకొనుచున్నారు. చండి మాచలదేవి విద్యల నేర్చుకొనుచున్నపు డెల్ల నామెయొద్ద కూర్చుండి యావిద్యలలోని మెలకువలఁ గ్రహించెడిది. ఆయభ్యాస విధానమును జ్ఞప్తియం దుంచుకొనెడిది. వెంటనే యింటికివచ్చి, తానా చూచినదంతయు చిత్రించి తన గదియం దుంచుకొనును. స్వామి యొకనాడా చిత్రములఁ జూచి, 'చండీ,' ఇవి యేమి! మాచలదేవి చిత్రముల నీటిగ చిత్రించుచున్నావేమని యడిగెను. చండి యామె యిప్పుడిట్లే చేయుచున్నదని సమాధానమిచ్చెను. స్వామి మాటాడలేదు.

చండివలన జక్కనాచార్యుని విషయమంతయు, విశదముగ కనుగొనినది మాచలదేవి. ఆమె యొకనాడు భైరవిని పిలిచి యనినది.

"భైరవీ! నీవా చెరసాలలోని మహాశిల్పియొద్దకుఁబోయి యీ రాజ్యపు భవిష్య మెట్లుండునో యనుగొని వత్తువా? నాకేలనో దానిని తెలుసుకొనవలె ననిపించుచున్నది. నీవాయన నింతకుపూర్వమే యెరుగుదు వనుకొందును!"

భైరవి :— ఆయనను నే నెఱుఁగుదును. అట్లెపోయి కనుగొందును.

భైరవి స్వామి యింటికిపోయి తానొకసారి జక్కన్న దగ్గరకు బోవలెనని యడిగినది. స్వామి యట్లే యని యామెను చెరసాలకు దీసుకొని పోయినాడు. భైరవి జక్కన్నకు నమస్కరించి యనినది — "అయ్యా! నన్ను మాచలదేవి మీవద్దకు బంపినది, నేను భైరవిని."

జక్కన్న :— భైరవీ! మాచలదేవికి నాతో నేమి పనియున్నది?

భైరవి :— స్వామీ! ఆమె మీనుండి యీ సామ్రాజ్య పరిస్థితి ముందెట్లుండునో తెలియగోరుచున్నది. ఆమె నాముఖమున మిమ్ము ప్రార్థించుచున్నది. మీ రీ సంగతి నామెకు తెలియఁజేయ వేడెదను.

జక్కన్న :— అయినచో రేపుచెప్పెదను బొమ్ము.

భైరవి మరునాడు వచ్చినది.

జక్కన్న :— మీ మాచలదేవి యేమి చేయుచున్నది?

భైరవి :— స్వామీ! ఆమె యిప్పుడు కత్తిసాము గుఱ్ఱపుస్వారియు నేర్చుకొనుచున్నది.

జక్కన్న :— ఆమెకవి యలవడినవా?

భైరవి :— ఆమె యావిద్యలలోని మెలకువలన్నియు గ్రహించినది. జక్కన్న కొంతతడ వాలోచించి యనినాడు. "ఆమె యట్టునేర్చుకొనుట మంచిదియే. చాల బాగున్నది. ఇందువలన మున్ముందు చాల మంచి జరుగునులెమ్ము."

భైరవి కేమియు తోచక యనినది. 'అదియేమి స్వామీ! అట్లనుచున్నారు?'

జక్కన్న నవ్వి — 'ఆఁ ఏమియు నులేదు. ఏదైన నొకమహావిద్య నేర్చుకొనుట మంచిదేకద. అందుల కిట్లంటిని. అంతియకాని మరే మియునులేదు. అట్లనుట తప్పగునా?'

భైరవి :— ఏమో నాకు తెలియదు మా మాచలదేవి యడిగిన దానికి సమాధానమును చెప్పరైతిరి.

జక్కన్న :— తల్లీ! అది చెప్పినంత మాత్రమున నేమగును? ఈసామ్రాజ్యము మహాక్లిష్ట పరిస్థితుల నెదుర్కొనవలసియున్నది.

భైరవి :— అవి యెట్టివి?

జక్కన్న — అసలు పరమరహస్య మేమన తల్లీ! ఈరాజ్యము సప్తసంఖ్యావిధాననిర్మితిపై వ్యవస్థితమై యున్నది. సప్తర్షి ప్రాబల్యముచే పోషింపబడుచున్నది. ఆఋషులలో నొకఋషి కీరాజ్యముపై ననుగ్రహము తప్పినది. అందువలననే యీసప్తపర్ణికి పర్ణచ్యుతి కలుగుట. ఇప్పటికి ఆరాకులు రాలిపోయినవి. ఇక మిగిలిన దొక్కయాకు. ఈదేశమున కొక మహాయుద్ధము సంభవింపనున్నది. దాని పరిణామ మెంత భయావహమో చెప్పలేము. అప్పుడీ సప్తపర్ణియు సప్త సరస్సులను సప్తప్రకారములును నేమగునో దురూహ్యము. తలచుకొన్నచో నొడలు జలదరించుచున్నది.

భైరవి :— ఈమహాప్రళయ మెందువలన వచ్చును? దానికేః ప్రతిక్రియ లేదా?

జక్కన్న :— ఇది సప్తర్షులలో నొకడైన వసిష్ఠమహర్షి శాపముచే వచ్చును. ప్రతిక్రియ చేయవలయునన్న నలువది దినము లహోరాత్రములు తీవ్రమైన తపస్సు చేసి, సప్తర్షుల భావనచేసి బీజాక్షరములతో

వారి నావాహనచేసి యొకచో స్థాపించి యచట మరల నొక క్రొత్తసప్త వర్ణిని నిర్మించి మహాశాంతులు దానములు చేయవలెను.

భైరవి :— ఐన నెట్లు? వీనిని చేయగలవా రెవరైన నున్నారా?

జక్కన్న :— నేను చేయగల్గుదును. కాని చక్రవర్తి దర్శనమే నాకు కాలేదు. నేనేమి చేయుదును!

భైరవి జక్కన్నయొద్ద సెలవు తీసుకొని యటనుండి మాచలదేవి యొద్దకుబోయి యామెకు జక్కన్న చెప్పిన సంగతులన్నియు చెప్పినది. ఆమె సామ్రాజ్య భవిష్యదవస్థకు మిగుల చింతించినది. తాను మహారాజు నొద్దకు బోయెదనన్నది.

భైరవి :— అమ్మా? నీవు పోవలదు. నీకు కోటలోనికిఁ బోవ ననుజ్ఞ లేదుకద? అట్లుపోవు టుచితముకాదని నామనవి.

మాచల :— ఉచితమో యనుచితమో నాకు తెలియదు. నేను చక్రవర్తి దగ్గరకుపోయి తీరెదను. సామ్రాజ్య దురవస్థ నాకు సహింపరానిది. ఏదియేమైనను నేనుపోయి చక్రవర్తితో నీవిషయముఁ జెప్పి యామహాశిల్పిని విడిపించి యామహాశాంతులఁ జేయించవలసినదని చెప్పెదను. నన్నడ్డుకొనకుము.

ఆమెలో వేగము హెచ్చుచున్నది. ఆమెమాటలలో తొందరపాటు కానవచ్చుచున్నది.

భైరవి :— అమ్మా!. నేను మరల చక్రవర్తియొద్దకు పోయెదను. నీవు నిశ్చింతముగ నుండుము. నేనుపోయి మామాటలుగ నీవిషయము లన్నియు చెప్పెదను. ప్రభు వేమనునో చూతము.

భైరవి మరల చక్రవర్తి దగ్గరకు పోయినది. సాయంకాలము. ప్రభువు సాధారణముగ నుద్యానవనవిహారము చేయువేళ. భైరవి యుద్యానమునకు పోయి ప్రభువును గానక యాయన మందిరమునకు వచ్చినది. ప్రభు వెడమమోచేయి యెడమతొడపై నాన్చి యెదియో యోజించుచున్నాడు.

భైరవిని చూచి 'ఏల వచ్చితి' వనినాడు.

భైరవి :— ప్రభూ ! ఆజన్నాచార్యులు చెప్పినారు. ఈ మహా సామ్రాజ్యమునకు మహాపద రాబోవుచున్నదట. వసిష్ఠ మహర్షి శాపముచే నీసప్తపర్ణి పర్ణము లూడిపోవుచున్నవట. ఇప్పటికి ఆరుపర్ణము లూడినవట. మరల నీరాజ్యమునకు సుస్థితి కలుగవలయునన్నచో నలుబది దినములు అహోరాత్రములు మహాతపస్సుసల్పి శాంతులుచేసి మరల క్రొత్తసప్తపర్ణిని పూర్వమురీతిగ నిర్మించవలెనట. అట్లు నిర్మించుట ఆయనకే తెలియునట. ప్రభూ ! ఆశిల్పిని తమరు బంధనము నుండి తొలగించవలెనని మూచలదేవి యనుచున్నది. ఈవార్త విని నప్పటినుండి యామె మనము దహించుకొని పోవుచున్నది.

చక్రవర్తికి కోపము వచ్చినది. అనినాడు—'భైరవీ! ఆశిల్పి యేమనినాడు? ఆరుపర్ణములు తునిగినవనియేనా ?

భైరవి :— ఔను ప్రభూ ! తునిగిపోయిన పర్ణములారట.

చక్రవర్తి :— ఆజన్న గొప్ప జ్యోతిష్కునివలె నున్నాడు. నాలుగాకులు తునిగినవి. దీనిని బట్టియే తెలియుచున్న దాయన జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానము. ఎట్లులో చెఱనుండి తప్పించుకొను నుపాయములు పన్నుచున్నాడు. అంతియేకాని వేరుకాదు.

భైరవి :— ప్రభూ! ఆమె మరల మరల చెప్పుమన్నది. ఆమహాశిల్పిని విడిచి యాయనచే మహాశాంతులఁ జేయించవలెనన్నది. ఆమె యీవార్త నాఁకించిన నాటినండి పరితపించిపోవుచున్నది. రాజ్యక్షేమమున కరిష్టదాయకమైన దుష్టగ్రహ నివారణ జరుగవలెనని యామె యాశయము.

ప్రభువు :— అవును. మేమును రాజ్యమున నరిష్టదాయకులైన దుష్టగ్రహములను నివారింపఁగోరి జూచుచున్నాము. ఆప్రయత్నమునే చేయ సంకల్పించి యున్నారము.

భైరవి :— అయినచో నాశిల్పిని విడుదల సేతురా?

ప్రభువు:— నాప్రయత్నమున కామహాశిల్పి తపస్సు లక్కరలేదు. ఆమహానర్తకి పరిదేవనము లక్కరలేదు. వానితో నాకు నిమిత్తములేదు.

ప్రభు వాగ్రహ పరవశుడైనాడు. ఆయన యాపాదమస్తకము చలించిపోవుచున్నాడు. ఆయన నేత్రము లగ్నిగోళములైనవి. ఆయన ముఖవైఖరి భైరవికి భయము కలిగించినది. ఆమె మాటాడకుండ నట నుండి కదలిపోయినది. ఆమె ద్వారము దాటినదోలేదో శ్రీధరాచార్యుడువచ్చినాడు. ప్రభు వాయనను చూచి మొగమున లేని చిఱునగవును దెచ్చి పెట్టుకొని యాయనను కూర్చుండ నియమించి యనినాడు — 'ఆచార్యా! మీ కా జక్కన్న యనుశిల్పి తెలియు నంటిరికద?

శ్రీధరుడు :— అవును. అతడు నాకు తెలిసినవాడే, ఏమి ఆయన యీనగరమున నున్నాడా?

ప్రభువు :— ఈయూరిలో నెచటనో యుండెనని వార్తలు. ఆయన మహాశిల్పి యటగద?

శ్రీధరుడు :— వాని మొగము. వానికేమియును తెలియదు. వట్టియహంకారము కలవాడు. మూపైపున నతనికి గౌరవములేదు. తాను మహాశిల్పినని యాయన యహంకారము. అతి సామాన్యుడు. ఆయన ముత్తాత జక్కనాచార్యులు మాత్రము కొంతపేరున్న వాడనక తప్పదు.

ప్రభువు :— అటులనా? అయినచో నాచార్యా! మనరాజ్యమున కేమైన యుపద్రవ హేతువు లున్నవా? మరల తురకలదాడి యేమైన జరుగునా?

శ్రీధరుడు :— అదేమిప్రభూ! అట్లందురు? మరల వచ్చుటకు వారికి సిగ్గుండవలదా? వా రెట్లుదండెత్తి రాగలరు? అయినను తమ కేమి భయము. నాల్గుసారు లాలజ్జాహీనులఁ దరిమి విజయ మొందిన మహాధీరులు. అదియునుగాక రెండుసార్లు వారేవచ్చి భయపడి యుద్ధమునకు గడంగకయె తిరోగమించిరిగద! దుర్నిరీక్ష్య తేజోవిభువు లయినట్టి తమ సామ్రాజ్యమున కెట్టి యుపద్రము లుండును? అట్టివేమియు నుండవు ఏ మిట్లడిగినారు? ఎవరైన నట్లుచెప్పియున్నారా?

ప్రభువు :— ఆ జక్కన్న యనెనట. ఆయన జ్యోతిష్కుడట నిజమేనా!

శ్రీధరుడు :— అదియేమో నాకు తెలియదు. కొంత తెలియునని యనుకొందురు. అసమర్థు లట్లెయందురు. వారు మంత్రములు, తంత్రములు, దైవము జ్యోతిషము వీనినే పట్టుకొని ప్రేలాడుచుందురు. ఎదో యిష్టమువచ్చినట్లెల్ల వాగివైతురు. వానిమాటలకు ప్రభువు లంతగ చింతింప నవసరములేదని నాయభిప్రాయము.

ప్రభువు :— మీ కేమైన జ్యోతిషము తెలియునా?

శ్రీధరుడు :— నాకు తెలియదు. నాకసలు దానియందు నమ్మకములేదు. ప్రభువు మాటాడలేదు. ఆయన సప్తపర్ణి ప్రస్తావనఁ దెచ్చి మరల నొక యాకూడినదని చెప్పెను. శ్రీధరుడు మరల కొత్తచెట్టును చేయుటయే మార్గమనినాడు. ప్రొద్దు క్రుంకినది. శ్రీధరుడు సెలవు తీసికొని వెడలిపోయినాడు.

ప్రభువు మనస్సు పరిపరివిధముల పోవుచున్నది. ఒకసారి జక్కన్నను గురించి యాలోచించును. ఒకసారి మాచలదేవిని గూర్చి యూహాసేయును. వారిరువురిపైని కోపము పెరిగిపోవుచున్నది. ఈ మాచలదేవి తన మనస్సు నెంత బాధింపజేసినది. దీని నేమిచేసినను పాపములేదు. శిరశ్ఛేదము చేయింతునా యనుకొనును. కాని పదియైదేండ్లదయిన తమ యనురాగమయజీవనమున తన్నామె యెట్లు సుఖపెట్టినది, కన్నులలో గిఱ్ఱున తిరిగినది. మాచలదేవి సర్వాభరణభూషితయై చిఱునగవు నవ్వుచు తనయెదుట నిలబడిన ట్లయినది. ఆమె కన్నులు నవ్వుచున్నవి. ఆమె బుగ్గల నమాయకత చిందుచున్నది. ప్రభు విట్లనుకొనినాడు — మాచలదేవి తన హృదయమునకు రాణి. విశాలాక్షి పేరునకు పట్టమహిషి. కాని నిజముగ పట్టమహిషీత్వమును వెలయించినది మాచి, ఆమె కనుగొనల మహారాజ్ఞీత్వము చిందిపడుచుండును. తనకున్న యిరువదియొక్క స్త్రీలయందును నీమె తన హృదయమును బట్టి నిలిచినది. ఆమెను తాను శిరశ్ఛేదము చేయ నాజ్ఞాపింపలేడు. కాని యామె తన్నుఁ దిరస్కరించినది. తన్ను దుఃఖపెట్టినది. ఆమెను రాజ్యమునుండి నిర్వాసితను జేయవలయును. అవునదియే సరియైనపద్ధతి యనుకొనినాడు. మరి జక్కన్న! ఆతని మూలమున నింతయైనది. ఆతడు లేనిచో తన ప్రియమైన మాచలదేవి తన్నుఁ దిరస్కరించెడిదే కాదు, ఏమైన నతనిని తా నురిదీయించును. ఇది

నిశ్చయ మనుకొనినాడు. ఆకస్మికముగ నాయన వామనేత్రము స్పందించినది. ప్రభున కేమో భయమైనది. చీకట్లు గదిలోనికి జొచ్చుకొని వచ్చుచున్నవి.

తెలుచు ప్రభువు సూర్యాస్తమయమునకు పూర్వము పాలు త్రాగుట యలవాటు. ఆనా డాపాలు రాలేదు. గదిలో నింకను దీపము లేదు. ఒక పరిచారిక వచ్చి మణిదీపిక తెఱ నపసరించి వెడలినది. ఆమణి దీపము ప్రభువునకు రక్తపంకిలమైన వధ్యశిలాకృతిగ ననిపించినది. ఆయనమనస్సు చెదరినది. ఇంతలో నా పరిచారిక పాలు త్రావఁ దెచ్చి యిచ్చినది. చక్రవర్తి కాకలి మిక్కుటముగ నున్నది. క్షీరపాత్ర నాత్రముగ త్రాగఁ దీసికొనినాడు. పెదవులకడ నుంచెనో లేదో ప్రభువు చేయి వణకి క్రింద పడి పాత్ర పగిలిపోయినది. ప్రభు వూరక యవ్యవస్థితచిత్తుఁడై క్రింద నొలికిపోయిన పాలను జూచుచు కూర్చుండి పోయెను. ఆపాలు విరిగిపోయి యున్నవి.

౧౮

శరత్తు వచ్చినది. పరిఫుల్ల నవమల్లికాస్నిగ్ధ శ్వేతపర్ణములు శ్వేతద్వీపాంగనాక పోలపాండురములయిన చిఱుతెలిమొగిలు లాకసమున యథేచ్ఛముగ విహరించుచున్నవి. నగరిలోనున్న సరస్సులందు వచ్చిచేరినకొంగగుంపులు తెలిదామరపూలభ్రాంతిని గలిగించుచున్నవి. తెల్లుపూవులు పింజలై యెగిరివచ్చి వీధుల పుష్పాక్షతలఁ జల్లుచున్నవి. మెట్టపొలములయందు మిగులబండిన మిరపపండ్లు తమరక్తవర్ణముచే మిగుల శోభించుచు వీరరసప్రబోధకములైనవి. సాయంసమయమునందా నిల సంచారముచే క్రొత్తగా పూదొడిగిన కొతిమేరచేల సువాసనలు నలుదిక్కుల క్రమ్ముకొనుచున్నవి. పచ్చిమిరపచేలయందలి బంతిపూలు

వింతశోభను వెలార్చినవి. మాగాణి పొలములు క్రొత్తపాలకంకెలు వైచి ముద్దులు గులుకుచున్నవి. సరస్సందోహములు క్రొత్తలై స్వచ్ఛములై స్వాదువులైన నీరములతో సుందరములై యున్నవి. కర్షక జనముల దొడ్లయందు పొట్ల బీఱ చేమంతి మందార, సొర మొదలైన కూరపాదులు, పూలమొక్కలు మొగ్గదొడిగి వింతయందమును సంతరించుకొనినవి. సెలయేళ్ళలవారి పూరమున ప్రతిఫలించు కొంగలను జూచి యులుకుచు తలల నిక్కించుచు గంతులువైచు మీనముల మిలమిల సొగసులు, వాయుధూతములై సరోవరమున ప్రతిఫలించు మొగిళ్ళ యందము సర్వము సుందరములై భాసిల్లినవి. నగరియందేమూలఁ జూచి ననుపుష్కలత్వముమూర్తి కట్టినట్లున్నది. కాని యచ్చటచ్చట మాగాణి పొలములు సేద్యములు గాకుండనున్నవి. అవి మిగిలినవానిలో వెక్కిరింతగనున్నవి. గడచిన యుద్ధమునఁ బాల్గొని మడిసిన రైతుల పొలములవి. సాగుచేయు వారు లేక పొలములట్లే నిలిచిపోయినవి. అవి నెఱియలు విచ్చి తమ దుస్థితికై విలపించుచున్నటు లున్నవి. ఈసారి ఢిల్లీ చక్రవర్తి తనకుమారుడైన ఉల్లూఖానను మారుపేరుకల్గిన జూనాను సేనాపతిని చేసెననియు, మరల మహమ్మదీయులు కాకతిరాజ్యముపై దండెత్తి వచ్చుటకు గొప్పసైన్యమును సమకూర్చుచున్నా రనియు, దేవగిరిరాజుతోచేరి కుట్రలుపన్ని కాకతిరాజ్యమును నాశ మొనర్ప యత్నించుచున్నారనియు వేగులవాండ్రు చెప్పిరి. ఈవార్త సహజ ధైర్య సంపన్నుడైనను ప్రతాపునికి పిడుగుపాటువలె భయము కలిగించినది. ఆయన కేమిచేయవలెనో తెలియుట లేదు. తన ప్రముఖ సేనాను లందరును మరణించిరి. ఇందులూరి రుద్రుడు, సాహిణిమారుడు, బెండపూడి యన్నామాత్యుడు, ముప్పిడినాయకుడు, అంబదేవుడు, త్రిపురాంతకుడు, కాలభైరవుడు, వీరభద్రారెడ్డి మొదలగు సేనాను లందరు గత యుద్ధమున వీరస్వర్గ మలంకరించినారు. సేనాను

లందరకు మూలభూతు డైన ఇందులూరి యన్నయామాత్యుఁడు, తన పినతల్లి భర్త, యాయన కూడ మరణించెను. మరి యీపర్యాయము యుద్ధము నెట్లు కొనసాగింపవలెను? గడచిన నాల్గు యుద్ధములందును సైన్యనష్ట మంతులేకుండ నైనది. ఇప్పుడు చాలినంత సైన్యమే లేదు. సలహాల నొసఁగు మంత్రులే లేరు. సేనానాయకులు లేరు. నాగయ గన్నమంత్రి యున్నాడు గద! ప్రభు వాయనకుఁ గబురు వెట్టెను. నాగయగన్న మంత్రితో నీవిషయమును గూర్చి ప్రస్తావింపగా నాయన యిట్లనినాడు, — ప్రభూ! మనకు సైన్యము లోపముగ నున్నది. సైన్యమెట్లు చేకూరునో తెలియకుండ నున్నది. ఆతురుష్కులీమారు అసంఖ్యాకములైన సైన్యములను సమకూర్చుకొని వచ్చుచున్నారట. ఈమహాయుద్ధ మెట్లు కానున్నదో? ఆస్వయంభూస్వామి యనుగ్రహ మెట్లున్నదో!

ప్రభువు :— ఈనూరు కర్షకులను జేర్చినను సైన్యము చాలు నట్లులేదా?

నాగయ :— ప్రభూ! వారియందు యువకులందరు నిదివరకే యుద్ధమున సైనికులై వచ్చి సమసిపోయిరి. చాల రైతుకుటుంబములు నిరాధారములై యల్లాడుచున్నవి. సేద్యము చేయువారు లేక యనేక క్షేత్రము లక్లైదున్నఁబడకుండ నుండిపోయినవి. ఈయేడు దేశమునకు చాలినంత సస్యోత్పత్తిలేదు. దానివలన క్షామపరిస్థితి యేర్పడునేమో యను భయము కలుగుచున్నది. ఈమిగిలిన రైతులను గూడ సైన్యమునందు చేర్చుకొనినచో నాహారపదార్థములు కఱవై పోగలవు.

ప్రభువు :— అయినచో నేమిచేయవలయును?

నాగయ :— మహాప్రభూ! నాకొక యాలోచన పోవుచున్నది. అట్లు చేసిన నెట్లుండును?

ప్రభువు :— అదియేమో చెప్పుము. ప్రస్తుత మేరీతిగనైన సైన్యాభివృద్ధి కావలెను.

నాగయ :— ప్రభూ! మన ప్రభుత్వ కారాగారమున బంధితుల సంఖ్య సుమారు వెయ్యికిమించి యున్నది.

ప్రభువు :— అయినచో నేమందువు?

నాగయ :— ప్రభూ! ప్రస్తుతము మన కోశాగారమున ధనము పరిమితముగ నున్నది. ఆహారపదార్థములుగూడ బొటాబొటిగ నున్నవి. అట్టిసమయమున నిట్లూరక వేయిమందినేల పోషించవలయును? వారికి గూడ సైన్యశిక్షణ మిప్పించి వారిని సైన్యమున నెందులకు జేర్చుకొనగూడదని నా యభిప్రాయము. ప్రభువుల చిత్తమేమో? ప్రభువు యోజించెను. ఔను. నాగయ చెప్పినది యుక్తముగనే యున్నది. ఊరక వారినేల పోషించవలయును? సైన్యమునఁ జేర్చుచో దేశరక్షణలో బాసట యగుదురు. ఊరక బంధించి యుంచుటలో తనకిప్పటికేని యుపకారమున్నది గాని యుపకారమనునది లేదు. వారినుండి సాహాయ్యము పొందుటకుగాని, వారి రక్షణబాధ్యతను వదలించుకొనుటకుగాని యింతకన్న మంచి యవకాశము మరియొకటి దొరకదు. అంతయు నాలోచించి ప్రభు విట్లనినాడు.

"మాకు నదియే యుక్తమని దోచుచున్నది. నీవు చెప్పినది బాగుగనే యున్నది. అట్లే చేయుము. అందులకై మే మిప్పుడే యాజ్ఞాపత్రము నిచ్చుచున్నారము"

చక్రవర్తి యప్పటి కప్పుడే యాజ్ఞాపత్రమును వ్రాయించి దానిపై తన ముద్రాంగుళిచే ముద్ర వేయించి నగరాధ్యక్షుని కిచ్చి యనినాడు. "నీవు వెంటనే యీవిషయమున జాగ్రత్తవహించవలెను."

వారికి సైన్యశిక్షణము సంపూర్ణముగ నొసగి సుశిక్షితులనుగ జేయ వలెను. వారినుండి ఎట్టి విద్రోహములను పుట్టకుండ నరయువలసియున్నది. జాగ్రత్తగ మసలుకొనవలయును సుమా ”

నాగయ చిత్తమని ప్రభువునొద్ద సెలవు గైకొని వెడలిపోయి నాడు.

నాగయ మరునాటినుండియె తన కార్యక్రమము నమలు జరుప మొదలుపెట్టినాడు. ఆయన పేరువరుసన వేయిమంది ఖైదీల చెఱ వదిలించి తనయొద్దకు రావించి నీతులు సెప్పి సైన్యమునఁ జేర్పించి నాడు. వారికి యుద్ధశిక్షణ గఱుపబడుచున్నది. చివరకు జక్కనా చార్యుని వంతు వచ్చినది. నాగయ యాయనను గూడ సైన్యమునఁ జేరుమనినాడు.

జక్కన్న :— అయ్యా! నేను సైన్యమునఁ జేరుమన్నచో చేరు దును. నాకెట్టి యభ్యంతరము లేదు. కాని నాకు పదాతిదళములఁ జేర నిష్టములేదు. మరి మీ రేమందురో యని చూచుచున్నాను.

నాగయ :— అట్లు కానిచో మీరేమి చేయగలరు ?

జక్కన్న :— కావలసినచో నేను రౌతుగ నుందును. తాము నాకొక శ్రేష్ఠమైన యశ్వమును, సుదీర్ఘమై సునిశితధారావేగము గల చంద్రహాసము నొకదానిని దయచేసినచో నాకెట్టి యభ్యంతరమును లేదు. యుద్ధమున నిశ్చింతముగ పాల్గొందును.

నాగయ :— తనుకోరిన యట్లే యిప్పింపఁబడును. ఎట్లైనను తాము సైన్యమునఁ జేరుటయే మాకుఁ గావలసినది.

నాగయ అశ్వశాలాధ్యక్షునికి జక్కనాచార్యుల కొరకు యుత్తమ జాత్యశ్వము నొసఁగుమని పత్రము వ్రాసి మరియు నాయుధాగారాధ్య

క్షునిపేర నొక చంద్రహాసమును బంపుమని వ్రాసి వానిని జక్కన్న కప్పించెను.

సైనిక శిక్షణ జరుగుచున్నది. యుద్ధసన్నాహములు పూర్తి యయినవి. శత్రువుల గూర్చి యెప్పు డే వార్త వచ్చునో యని యెదురు చూచుటగ నున్నది.

ఇంతలో వేగురానే వచ్చినది. తురకలు వచ్చి దేవగిరియందు విడిసిరని, ఆ దేవగిరి రాజు వారితో చెలిమిసల్పి వారలకు తనకోటయందు స్థాన మొసంగెనని, వారి మూరు మహాసైన్యవాహినిని వెంట నిడుకొని వచ్చుచున్నారని, నాగయ తమ మిగిలిన క్రొత్తసేనానుల బిలువనంపి వారలతో సంప్రదించి సైన్య విభజనముచేసి యెచ్చటెచ్చట నెంతెంత సైనికదళము నుంచవలయునో నిర్ణయించుకొనిరి. ఎంతదళ విభజన చేసినను సైన్యము చాలుటలేదు. కోటను దాటి యీవలకు బంపుటకు సైన్యమేలేదు. వారి కంతయు నయోమయముగ నున్నది. పూర్వము జరిగిన యుద్ధములందు సైన్యములఁ దళములుగ జీల్చి శత్రువులు వచ్చుమార్గములఁ గాపుంచి వారి యాహారపదార్థములను ఆయుధములను మార్గమధ్యముననె హరింపఁ జేసెడివారు. ఓరుగంటికి వందమైళ్ళ దూరముననె యాతురక సైన్యముల నడ్డి పోరుసల్పి యచట నుండియె పరాజితులనొనర్చి వెడలనడచెడువారు. కాని నేడట్లు కాకపోయినది. ఉన్నసైన్యముతో కోటను శత్రు హస్తగతము కాకుండ చూచుకొనినచో నదియె పదివేలుగ నున్నది. ఈ పరిస్థితులకారణముగ మార్గమధ్యము నందలి యాటంకములు తొలిగిన మహమ్మదీయదళముల కుత్సాహ మినుమడింపఁ జేసినవి. తురక సైన్యము వెల్లువవలె పురోగమింప సాగినది. వారు గూఢచారుల ద్వారమున నీ కాకతిదళముల కొఱఁతను తెలిసికొని ద్విగుణీకృతో

త్సాహముతో, నావేశపరులై విజృంభించుచుండిరి. ఓరుగల్లు తమకు లభించునట్లే యానందపడిరి. వారు ప్రతాపునిచే సంరక్షితములై యున్న గిరిదుర్గము, కంచెకోట, రాజప్రాకారము, కాకతిప్రాకారముల నధిగమించి లోనికిఁ జొచ్చుకొని వచ్చుచుండిరి. ఆ యా దుర్గముల యందలి సేనాపతు లంద రింతకుపూర్వపు యుద్ధములలో మడిసి యుండుటఁ జేసి యచ్చటచ్చట నున్న యల్పసంఖ్యాకమైన సైన్యమును నురుమాడి తురకసైన్యము లవలీలగ లోనికిఁ జొచ్చుకొని రాదొడగినవి. వారు పదివేల గుఱ్ఱపుదళము, లక్ష కాల్బలములతో వచ్చిరి. కాకతీయ సైన్యమంతయుచేరి వారిసైన్యమున సగమైన లేకుండెను.

రాజ్య మిట్టి క్లిష్టపరిస్థితులయందు తగుల్కొనిన సమయమున పద్మనాయక రెడ్డి వైషమ్యములచే వారిలో వారికి మనస్పర్ధలు మిక్కుటములైనవి. ప్రభువు కోటపైనున్న డెబ్బదియేడు బురుజులకును నాయకులుగ నా పద్మనాయకులను నియమించుట తమ్ము నిరసించి యూరకుండుటచే రెడ్డిసేనానులకు క్రోధము పెరిగి పద్మనాయకులపై పగపట్టి యున్నారు. ఆ పగదీర్చుకొనుట కిది తగినసమయ మనుకొనిరి. మహాధీరుడైన సేనానాయకుఁడైన ప్రోలయ వేమారెడ్డి తన బలములతో ధరణికోట ప్రాంతమున కేగి యచ్చట తన విజయపతాకను వెలయించినవార్త వచ్చినది. చక్రవర్తి యన్నివిధముల నిఱుకునఁ బడినాడు. ఇప్పు డేమి చేయవలయును? అనుభవజ్ఞులు, విశేషజ్ఞులు విశ్వసనీయులు మహాశూరులు నయిన గుండయ నాయకుడు, సోమయ నాయకుడు మొదలగు మహాసేనానాయకు లిదివరకే మరణించుటయు మిగిలిన యేకొలది సేనానులో యీ తురుష్క సమరమునందు మునిగియుండుటఁ జేసియు చక్రవర్తి యేమిచేయవలెనో సలహాయొసగుటకైన నెవ్వరులేక యేమియు తోచక చింతించుచుండెను.

అయినను ఒకదళమును ధరణికోటకు పంపెను. కాని యామహా వీరుడైన ప్రోలయ శత్రువుల నిట్టె పరిమార్చి స్వాతంత్ర్య ప్రకటన గావించుకొనెను.

దేవగిరిరాజైన రామదేవుడు ప్రతాపునికి విరోధియై తురుష్క పక్షపాతియై వారికి సర్వ సదుపాయములను సమకూర్చుచుండెను. తురుష్కులు పురోగమించు నవసరమున బడిన గ్రామములకు తన సైనికుల బంపి వారికేవిధమైన లోటు లేకుండున ట్లేర్పాట్లు గావించెను. పైపెచ్చు ఉల్లూఖానునకు సహాయార్థము, కొంత మరాఠీగుఱ్ఱపు దండు నొసగెను. తాను సైన్యముతో వారిని కొంతదూరము సాగనంపెను. రామదేవుని సాహాయ్యముచే తురుష్కులు నిరపాయముగ కాకతీయులదైన శ్రీపురవుకోటను సమీపించి యాక్షణమే కోటను ముట్టడించిరి. తురుష్కులు ప్రయోగించిన అగ్నిబాణములవలన కోట లోని కొన్నియిండ్లకు నిప్పంటుకొనగా చాలామంది ప్రజలు ఆమంటలో గాలి నమసిరి. అనేకులు తురకల కత్తుల కెరయయిరి.

ఉల్లూఖా నచటినుండి సాగి యోరుగల్లుపట్టణము చేరుకొనెను. అనుమకొండనుండి చూచుచో నోరుగంటిలోని సుందర దివ్య సౌధములును, ఆరామ తటాకాదులన్నియును స్పష్టముగ దృష్టి కానును. అందుచే నుల్లూఖాను అచ్చటి కిరువురు సైన్యాధికారులగు గుఱ్ఱపు విలు కాండ్ర నిచ్చి పంపి తా నోరుగంటిని ముట్టడింపబోయెను. ప్రతాప రుద్రచక్రవర్తి ధైర్యమును చేకూర్చుకొని వీరిరాక నెఱింగి యిదివరకు తానేర్పరచుకొనిన రీతిగ రాత్రి రెండు యామములకు వినాయకదేవుని మూడువేలగుఱ్ఱపుదళమునిచ్చికోట వెలుపలికిపంపించెను. కాని తురుష్కు లంతకంటెను జాగరూకులై యుండుటచే చక్రవర్తి యమితమైన నష్టము నందవలసిన వాడయ్యెను. చక్రవర్తి కేమియు తోచక సేనా

నుల నందరను సమావేశపరచి చివరకు కోటలోనుండియే పోరాడుటకు నిశ్చయించెను. కురుచకురుచ దళములుగ బంపినచో సైన్యనష్టము విపరీతముగ నగుచున్నది. జయాకాంక్ష యటుంచి మున్ముందు కోటను శత్రు హస్తగతము కాకుండ రక్షించుకొనుచో చాలు ననుకొనిరి.

బయట తురుష్కులు మిక్కిలి పట్టుదలతో మృణ్మయ ప్రాకారము వరకు సాగివచ్చిరి. అచ్చట పాతాళపర్యంతము లోతుగల్గిన పరిఖను, గగనచుంబిత ప్రాకారమునుచూడ వారికి గుండె నడలు పుట్టినది. అయినను తురకసేనాని సాహసముతో నా పరిఖను తెప్పకొయ్యలతో దాట తన సైనికుల నాజ్ఞాపించెను. గుఱ్ఱపుదళముల నీద ననుమతించెను. వారట్లు మహాసాహసమున నా పరిఖను దాటి మృణ్మయ ప్రాకారమును సమీపించిరి. దానినెట్లు భేదించ వలయునో తెలియరాకుండ నున్నది. తన సైనికుల కన్ని వైపులనుండి పాశ్చాత్య పాషాణ ఖండముల విసర నాజ్ఞాపించినాడు. కాని యవి బాలకులాడు కందుకములవలె నెనుదిరిగి వచ్చుచున్నవి. అయినను ఉల్లూఖాను తనసైనికుల నింకను విసర నాజ్ఞాపించెను. త్రాటి నిచ్చెనల సాయమున గోడ నెగబ్రాకుడనెను. ఆ నిచ్చెనలు గోడ నున్నదనముచే జారిపోవుచుండెను. పైనుండి యాంధ్రసైన్యము సలసల గ్రాగిన తైలమును వర్షించదొడగెను. ఆంధ్రసైనికులు శిలాఖండములను దొర్లించిరి. తురుష్కులు విసరిన పాషాణములు పినుమోకుల సాయమున బాగుగా పయికెగయుచుండెను. ఆంధ్రులు విసరిన రాలు చిన్నవియై శత్రువులను గారింపజాలవయ్యెను. మహమ్మదీయులు ధైర్యముగ గోల్పోక యుద్ధము సేయదొడగిరి. చివరకా మట్టిగోడ యందు చాల గండ్లువడెను. కొలది కాలముననే వారా బహిఃప్రాకారమును దాటి లోన బ్రవేశించిరి.

తరువాత వారికి శిలాప్రాకారము పరిఖావృతముగుపించినది. వారా శిలా ప్రాకారము నొకవంక పగులగొట్టుటకు గట్టి ప్రయత్నము చేసిరి. చక్రవర్తి కీమాట వినగనే యడలు పుట్టినది. ఆయన తన దుర్గపు టపాధ్య మయిన గట్టితనము మీద నత్యంత నిశ్చయమైన బుద్ధి కలవాడు. శత్రువు లెప్పుడు మట్టికోట నతిక్రమించి లోన ప్రవేశించిరో యప్పుడే యాయనకు భీతి జనించినది. ఆంధ్రవీరు లసువుల నొడ్డుచున్నారు, కాని విజయము దూరమగుచున్నది.

అట్లాయుద్ధము మూడు దినములు జరిగినది. తురుష్కులు శిలాకుడ్యమున కీవలనుండి బాణముల వేయుట, పాషాణముల విసరుట చేయుచుండిరి. లోనుండి యాంధ్రసైనికు లాకుడ్యపు రాతిమెట్లమీఁద నిలబడి కాగిన చమురు పోయుట, కారము చల్లుట, వేడినీళ్ళు పోయుట చేయుచున్నారు.

ఈమూడు దినములలో నొకనాఁడు నాగిరెడ్డియు పద్మనాయక సేనానియైన యెఱ్ఱదాచానాయకుఁడును యుద్ధమున నపారమైన శౌర్య సాహసముల వెల్లడించిరి. ఇరువురును నసమాన ప్రజ్ఞను కనుబరచిరి. ప్రభువా యెఱ్ఱదాచానాయకుని మిగుల మెచ్చుకొని బహుమతు లిచ్చెను. నాగిరెడ్డిని ప్రశంసించనే లేదు. దానితో రెడ్డి సేనానుల కందఱకు కోపము కలిగినది. చక్రవర్తి మొదటి నుండియు నిట్లే చేయుచున్నాఁడు. సమాన యోధులను సమానముగ గౌరవింపవలెను గాని యిట్లు పక్షపాతబుద్ధిని చూపించు టేమంత బాగున్న దనుకొనినారు.

నాటిరాత్రి రెడ్డిప్రముఖు లందరను పిలిచి నాగిరెడ్డి యొక చిన్న సభ చేసినాఁడు. బొబ్బారెడ్డి కాట్రెడ్డి, వేమారెడ్డి భైరవరెడ్డి మొదలైనవారందరును విచ్చేసిరి. వారందరు గలసి సంప్రదించుకొని

యొకనిశ్చయమునకు వచ్చిరి. అది ప్రభువు తమకన్న పద్మనాయకులను కమ్మలను వెలమలను మిక్కుటమైన ప్రేమతో చూచుచున్నాడు. ఆ గణపతిదేవుడు రెడ్డిసేనానుల నెట్లాదరించెడివాడు? పిల్లలమర్రి బేతిరెడ్డి గణపతిదేవరాయలకు కుడిభుజమై నిల్చినాడు. ఈనాడు తమ కవమానము జరుగుచున్నది. తామిక సహించలేరు. తాము ప్రభువు నొద్దకుపోయి యొకరోజు యుద్ధమునందు పాల్గొనక యుండినచో నాయుద్ధమున పద్మనాయక వెలమ కమ్మ సేనానులందరు మరణింతురు. ప్రభు వప్పుడు తమ్ము సగౌరవముగ నాహ్వానింపగలఁడు. అప్పుడు తాము చక్రవర్తి యాదరాభిమానముల నొక్కమారుగ జూరగొనగలరు. అని నిశ్చయించుకొనిరి.

మరునాడు నాగిరెడ్డి ప్రభువు నొద్దకుఁబోయి యనినాడు — "మహాప్రభూ! పద్మనాయకవీరులు ఎంతకైన తగినవారు. ఈవేళ వారు యుద్ధమును నడుకొని పోగలరు. వారికి బాసటగ వెలమ కమ్మ సైన్యము లున్నవి. మా సైన్యములు మిగుల నలసటఁ జెంది యున్నవి. ఈరోజునకు ప్రభువు లనుగ్రహించుచో విశ్రాంతి తీసుకొని రేపు తలపడగలము." అని.

ప్రభువునకీ కుతంత్రము తెలియదు. ప్రభువట్లె కానిమ్మనినాడు. మహమ్మదీయుల విజృంభణమట్లే యుద్ధృతముగ నున్నది. వారికి సహాయార్థము మరల ఢిల్లీనుండి యేబదివేల పదాతిదళము, ఇరువదివేల గుఱ్ఱపుదళము వచ్చినది. ప్రభుభక్తిపరాయణులైన పద్మనాయకవీరులు తెగించి పోరాడి యుద్ధమునం దాహుతులైరి. అంతదనుక యుద్ధముసేయుచున్నటు లున్న రెడ్లు యుద్ధరంగమునుండి పైదొలగి చనిరి. తమసేనానులందరు వెడలిపోవుటచే రెడ్డిసైన్యము చిందరవందరయైపోయినది. దానితో నిక యాంధ్రసైన్యమున కోలాహల ముద్భవిల్లి

నది. చక్రవర్తి యిది గమనించి తాను మదగజము నధిరోహించి కొంత సైన్యముతో కోటతలుపులు తెరిపించి బయటికివచ్చి శత్రుసైన్యమును దునుమదొడఁగినాడు. రెడ్డిసేనాను లిదియంతయు జూచుచు నూరకున్నారు. తక్కినసైన్యమంతయు నిహతమైనది. ప్రభువు పరిమిత సైన్యముతో కనపడగనే తురుష్కసైనికు లాయనను చుట్టుముట్టిరి. ఆయన కిరువైపుల నిరువురు కవచధారులు నిలబడి దగ్గరకు వచ్చినవారినెల్ల సంహారించుచుండిరి. సర్వసైన్యము నిహతమైనది. ప్రభు వొంటరిగ శత్రుసైన్యములఁ జిక్కనున్నాడు. ఇదిచూచి రెడ్డివీరుల హృదయములందు రాజభక్తి దేశభక్తి పెల్లుబికి వారెల్లరు యుద్ధములకు సిద్ధమైరి. ఇదిగమనించి మహమ్మదీయు లొకుక్కుమ్మడిగ చక్రవర్తినాయిద్దరిసైనికులతో సహా బంధించిరి. వారుముగ్వురు తుదిదాక శత్రువుల నడుకుచునే యుండిరి. కాని యసంఖ్యాకములైన తురకసైన్యములను వారెంతకాగి నిలువగలరు? పైనుండి రెడ్డి సైన్యము వచ్చులోపలనె తురకలు వారి ముగ్వుర గుఱ్ఱముల కళ్లెములను తమచేత నుంచుకొని యచటనుండి యాక్షణమ ససైన్యముగ తరలించుకొనిపోయిరి. రెడ్డిసేనానులు తమ విద్రోహమునకు వగచి ప్రాణములపై నాశవదలి తురకలతో నాహవమొనర్చి వీరస్వర్గ మలంకరించిరి.

ప్రతాపరుద్రునికి తీరని యవమానముగ నున్నది. కాకతీయ సామ్రాజ్య పతనమునకు తన పక్షపాతబుద్ధియే కారణ మనుకొనును. తనరాజ్యమున కులమత భేదములు, వర్ణ వ్యవస్థలు, రెడ్డి పద్మనాయక వెలమ, కమ్మ వైషమ్యములు, ఇవియన్నియు పరాజయ హేతువులైనవి. అసలు సామ్రాజ్యమున నీభేదము లున్నంతకాల మిట్లే యగుచుండు ననుకొనును. తాను పద్మనాయకుల మిగుల మన్నించుటఁ జేసి రెడ్ల కలుక వచ్చినది. వారు యుద్ధమును విరమించుకొనిరి. ఆ కారణ

మున సైన్యము చెల్లాచెద రయినది. తురుష్క విజయమున కవకాశ మేర్పడినది. అని వాపోవును. ప్రభువు చివరికి ట్లనుకొనెను. బ్రాహ్మ ణుని కవమానము సల్పినాడు. వశిష్ఠమహర్షి శాపము నేటికి ఫలించి నది. ఆ జక్కన్న మాటలు నమ్మలేదు. తగిన ప్రతిఫల మొసవిన దను కొనినాడు. ప్రభువు మతిభ్రమ కలిగినవానివలె నైనాడు. ఆరువందల సంవత్సరము ల వ్యాహతముగ శ్వేతవరాహ కేతనము నీడను సుభిక్షమై వర్ధిల్లిన కాకతీయోజ్జ్వల మహాసామ్రాజ్య మీనాటి కిట్లు తన మూల మున పతనావస్థ ప్రాప్తించినది. ప్రభువు మనస్సు వికలమయినది.

## ౨౦

వారు ముగ్గు రొకచోటనే బంధింపఁబడియుండిరి. అది బంధన మనవచ్చునా యన్న కాదు. బంధన మేలకాదు ? వారు కోటనుండి తప్పించుకొని పోవజాలరు. కోటచుట్టును బలమైన కాపుదల యున్నది. మహావీరులై ఖడ్గపాణులైన తురుష్క భటులు చుట్టి యున్నారు. ఆదుర్గము మహాశిలలచే కట్టబడియున్నది. బయటికి పోవుట దుర్గమముగ నున్నది.

వారి కాకోటలోపల సర్వస్వతంత్రతయు నున్నది. వారి కాలు సేతులు, మనస్సు వారి స్వాధీనమందే యున్నవి. వారేదైన కావలెనని యడుగుచో నది యప్పుడె వచ్చితీరును. వారి కన్ని సౌకర్యములు నున్నవి. కోటదాటి వచ్చుటకు మాత్రము వీలులేదు. ఆ నిబంధన యన్నదచట కన్పించుచున్నది..

వారు ముగ్గు రొకే గదియందుండిరి. యుద్ధమున తన కంగ రక్షకులవోలె కాపాడి త న్ననుసరించి తుదకు తనతోపాటు పట్టుబడిన

యీ యిరువురు మహావీరు లెవరో చక్రవర్తికి తెలియదు. తాను యుద్ధసమయమునందే తెలిసికొనుటకు బ్రయత్నించినాడు. కాని వారెల్లప్పుడును ముఖత్రాణములను ధరించియే యుండిరి. అందువలన తెలిసికొనజాలకపోయెను. ప్రభువునకు వారిని తెలిసికొనవలె ననెడి యాతురత మిక్కుటమైనది. తన యంగరక్షకులా చనిపోయిరి. తన విశ్వాసపాత్రులైన భటు లందరు నిదివరకైన యుద్ధములందే విగత జీవులైనారు. ప్రస్తుతము రాజ్యమున తనకంతటి విశ్వాసపాత్రులైన భటులు లేరే, వీరిద్ద రెవరు! ఎచటినుండి వచ్చిరి. ఎట్లువచ్చిరి? తా నన్నచో వీరి కింత యభిమాన మేమి? తనమూలమున తాముగూడ బంధితులు కాబడిన యీ పుణ్యాత్ము లెవరో ప్రతాపరుద్రునికి వారిని తెలుసుకొనవలెనను పట్టుదల గలిగినది. వారివంకకె చూడసాగినాడు. వారు చక్రవర్తి తమవంకకు చూచుచున్న కొలఁది తమ మొగముల నుత్తరీయము నొద్దుకొనుచు చక్రవర్తికిఁ దా మెఱుకపడకుండఁ జూచు కొనుచుండిరి. చక్రవర్తి దృక్ప్రసారము తమ వైపున కైనయవు డా వీరులు పెడమొగ మిడుచుండిరి. చక్రవర్తి కిదియాంతయు నత్యాశ్చర్య ముగ నున్నది. తనకు ప్రాణదాతలైవచ్చి తనకొఱకై యుద్ధమొనర్చి గాయపడిన యీ పూతచరిత్రులు తనయందు గుప్తముగ నుండఁజూతు రేమి? చక్రవర్తి కొలదిలిప్త లట్లే చూచి యనినాడు.—'మీరెవరు?'

వారు మాటాడలేదు.

ప్రభువు :— మీరు నాకుఁ బ్రాణదాతలై దేవదూతలువోలె వచ్చి నన్ను యుద్ధమున సంరక్షించితిరి. మీరు నాకడ గుప్తముగ నుండఁ జూతురేమి?

వారు మాటాడలేదు.

ప్రభువు :— మాటాడుటకుఁ గూడ శంకించుచున్నారేమి ; నా రాజ్యము శత్రుహస్తగతమైనది. నేనిప్పు డిట్టిస్థితియం దున్నాను. నేనే యాపూర్వపు ప్రతాపుడ నైనచో మిమ్మెంతయైన గౌరవించెడివాడను. మర్యాద సల్పెడివాడను. ప్రాణదాత లని పూజించెడివాడను కాని.

చక్రవర్తి కంఠ మొకింత రుద్ధమైనది. ఆయనకు కంఠము నెవరో నొక్కిన ట్లున్నది. ఆయన మాటాడఁజాలక పోయెను. కొంతతడవ వఱ్ఱె యుండినాడు. మరల కొన్ని లిప్తలు గడచినవి. చక్రవర్తి కొంత తేరుకొని విచారము నణచుకొని మరల ననినాడు. ' కాని యిప్పుడు కనీసము మిమ్ము తెలిసికొనఁ గోరుచున్నాను. '

వారింకను మాటాడకయె యుండిరి.

ప్రభువు :— ఏమి యింకను నిరుత్తరు లగుచున్నారు ? ఒకనాటి యాంధ్రచక్రవర్తియైన ప్రతాపరుద్రుని యనునయమునకు గూడ సమాధానము లేదా ? అవును, మిమ్మనిన లాభ మేమున్నది ? కాలక్రీడ యొక్క లక్షణ మిదే !

చక్రవర్తి మాటాడుటలో వారికి గుండియల నాగి నిల్చు బాధ కనిపించినది. వారు ప్రభువు నట్టి దీనమూర్తిగ జూచి సహింపలేకుండిరి. వారిమనస్సున దుఃఖము వెల్లువలై యుబుకుచున్నది. వారిలో నొక వీరుడు తన యుత్తరీయమును మొగమునుండి తొలగించి ప్రభువు నెదుట నిలబడినాడు.

ప్రభు వాతనిఁ జూచి విస్మయముగ్ధుడై యొక క్షణ మట్లె యాతనియందు దృష్టిని నిలిపి యనినాడు,—“ నీవా ”

వీరుడు మాటాడలేదు.

ప్రభువు :— నీవేనా ? సప్తపర్ణిని అష్టపర్ణిని చేయుటకై వచ్చిన శిల్పివి ? జక్కనాచార్యుడవు కావా ?

రెండవవీరుడు :— ఆఁ! ఆ మహాశిల్పి యీయనయేనా?

ప్రభువు :— ఆఁ! మాచలా! నీవా? ఇక్కడికెట్లు వచ్చితివి?

జక్కన్న :— ఆ మాచలదేవి యీమెయేనా?

ప్రభువు :— ఏమీ? మీరింతవరకొకరి నొకరెఱుగనే యెఱుఁగరా?

జక్కన్న :— లేదు ప్రభూ! నేనీమె నింతకుముం దెఱుఁగను. ఈమాచలదేవి దర్శనము కావలసిన దైవయోగమిట్లున్నది. ఈదర్శన మానాడే యగుచో నీనాటి స్థితి యిట్లుండెడిదే కాదు.

ప్రభువు :— ఎట్లుండెడిది?

జక్కన్న :— మహాప్రభూ! నే నీసామ్రాజ్యమును మరల నేడు వందలయేండ్లు మహోజ్జ్వలముగ వర్ధిల్లునట్లుగ జేసెడివాడను. కాని దైవయోగ మిట్లున్నది. లేనిచో నేను మీ రాజ్యమున నడుగుపెట్టి రెండు సంవత్సరము లైనది. నాకీమె దర్శనము కాలేదు.

రాజు :— ఓయీ! నీకీమె కనుపించుటకు నీవు మారాజ్యకాలము పొడిగించుటకు గల సంబంధమేమి?

జక్కన్న :— రాజా! ఈరాజ్యములోనున్న వర్ణాభిమానములు, కులాభిమానములు, పలుకుబడి సంపాదించుకొనుటకు ప్రయత్నములు నాకు నీమె దర్శనము కానీయలేదు. మాచలదేవి యేకులాభిమానము నకును జెందని వ్యక్తి. ఆమె ద్వారా తమదర్శనము త్వరగ చేసెడి వాడను. అప్పుడు మీ రాజ్యమును పొడుగించెడివాడను.

ప్రభువు :— ఎట్లు పొడిగించెడివాడవు?

జక్కన్న :— ప్రభూ! మీరాజ్య రహస్యము మీకు తెలియదు. సప్తర్షిమండలముయొక్క నీడ భూమిమీఁద పడినది. అది మీరాజ్యముగా పరిణమించినది. అవియే మీకోట కేడు ప్రాకారములు.

ఈ రాజ్యములో నేడు ప్రసిద్ధములైన సరస్సులు, ఏడుగురు రాజులు, సహస్రమంటపనిర్మాణమునకు పునాది యేడు స్తంభములు, ప్రాకాల చెలువుచుట్టు నేడు కొండలు, భద్రకాళిచేతు లెనిమిదైనను ఎనిమిదవ చేయి పైకెత్తబడి కనిపించక ఏడేయగుట, గణపతిదేవుడు చేయించిన యరటిచెట్టు సప్తపర్ణియగుట. ప్రభూ! తమకు పదునాలుగురు భార్యలు; ఏడుగు రుంపుడుకత్తెలు యిరువదియొకటియైన సప్తసంఖ్యచేత భాగింపబడదగియుండుట. యిదియంతయు సప్తర్షిమండలచ్ఛాయ. ఆమండల పరిభ్రమణశక్తి తమతో నవసానమైనది. ఆపరిభ్రమణమును మరల ప్రారంభింపజేయుటకు ఖగోళశాస్త్ర విజ్ఞానముచేత నేను సమర్థుడను. ఈ విద్య నాకులవిద్య. నాముత్తాతనుండియు వంశపరంపరాగతముగ వచ్చుచున్న విద్య. నేను ఏడు దినములు తపస్వినై నియతాహారము కలిగి మహామంత్రపునశ్చరణము చేసి సప్తర్షిమండలమును మరల భ్రమణారంభము కలదిగా చేసెడివాడను. దానికెంత యో తంత్రమున్నది. మహారాజా! తమరు నన్ను చెఱసాలయందుంచితిరి. ఐనను తక్కిన తంత్రమంతయు సాధ్యముకాదు కనుక చెఱసాలలోనే పరిమిత ద్రవ్యముతోడనే సప్తర్షిమండలముయొక్క పునఃపరిభ్రమణమును కలిపింపవలయునని ప్రయత్నించితిని. అది ఫలవంతము కాలేదు. సప్తర్షిమండలమును, ఆ కారాగారమునందు స్థాపించితిని. వారి నచ్చట నిలువద్రొక్కుటకు మహాతంత్రములు లేకపోవుటచేత మహామంత్రములు సిద్ధి నాకున్నను పనిమాత్రము నాకు సాధ్యము కాలేదు.

చక్రవర్తి :— ఔను. నీవున్న చెఱలో వెలుగు వ్యాపించినదని జనులు చెప్పుకున్నారు.

జక్కన్న :— ప్రభూ! ఆ తంత్రము మహోదారమైనది. లక్ష రూప్యములైనను వెచ్చపెట్టబడవలసి వచ్చెడిది. హిమవత్పర్వత

ప్రాంతములనుండి త్రివిష్టపమునుండి తీసికొని రావలసిన మహాపదార్థము లున్నవి. ఏడువందలమంది బ్రాహ్మణులచేత మంత్రపారాయణము చేయించవలసియుండెను. అంతటి మహాకార్యము కారాబద్ధుండనై యున్న నాకెట్లు సాధ్యమగును? మహారాజా! ఈసప్తపర్ణి గణపతిదేవ చక్రవర్తి కాలమున నిర్మింపబడినది. ఇది మాతాతగారుచేసిన కార్యము. గణపతిదేవచక్రవర్తి మాతాతగారిని పిలిపించి యీసప్తపర్ణిని చేయించెను. అది సప్తలోహసమ్మిశ్రితమైన పదార్థము. నాగార్జునునియొక్క పదార్థవిజ్ఞానశాస్త్ర పరమరహస్యము. మాతాతగారే నేనుగ పుట్టినాను. ఆయనకు నాకు భేద మేమనగా ఆయన తనవిద్య ఫలించెడు కాలమున పుట్టినాడు. నే నంతటి విద్యావంతుడనయ్యు నావిద్య ఫలించుట కననుకూలమైన కాలమున నేనుపుట్టినాను.

రాజు అవనతివదనుడై దీర్ఘవిచారసముద్రమున మునిగియుండెను.

జక్కన్న :— ప్రభూ! గతజలసేతుబంధన మేమిటికి? కాలమన్నిటికంటె శక్తికలది. ఆసప్తపర్ణి వట్టి బంగారపుచెట్టు కాదు. దానిక్రింద బంగారపు రేకు మీద బీజాక్షరములతో సప్తర్షి మండలము నిక్షేపింపబడినది. ఏయాకునం దేఋషి సమావహింప జేయబడెనో ఆఋషియొక్క శక్తి యెట్టిదో, ఆఋషి యేమంత్రమునకు వశుడో తెలియవలయును. తెలిసిన తరువాతగాని ఒక యాకు చెడిపోయినచో నాయాకెట్లు చేయబడవలయునో తెలియదు. ఇది యల్పులు చేసెడి పనికాదు. ఊరకె బొమ్మలు చెక్కుకొనువారు పెద్దయుద్యోగస్థులచేత పెద్దయుద్యోగులకు చెప్పించుకొనెడివారు పెద్దవేతనములకొఱకు రాజాదరణము కొఱకు ప్రాకులాడెడివారు చేయుగల పనికాదు. వారికి సప్తలోహమిశ్రవిద్యయె తెలియదాయెను. ఖగోళభూగోళములకు ముడిపెట్టుట యెట్లు తెలియును?

చక్రవర్తి :— ఆచార్యా ! క్షమించు. నాకు తెలియక నే శ్రీధరాచార్యుని మన్నించితిని. నామంత్రులతని నే ప్రశంసించిరి. లౌకికదృష్టులైన యధికారులు దివ్యదృష్టులైన తమవంటి మహాశిల్పుల స్వరూపమెఱుఁగరు.

జక్కన్న :— మహారాజా ! మహాశిల్పము కాలాంతరమునందు తెలిసెడిది కాని మహాశిల్పియొక్క జీవితకాలమున తెలిసెడిది కాదు. లౌకికాధికారులు, మందబుద్ధులు, అల్పశిల్పులు, ఆ మందబుద్ధులకు రుచింతురు. వారు పైకివత్తురు. మహారాజా ! అధికారిపోయి మహాశిల్పి నాశ్రయించవలయును. కాని శిల్పి యధికారి నాశ్రయించవలసి వచ్చినది. ఇంక మహాశిల్పమెట్లు బయటికివచ్చును ? నీవువచ్చి నన్నాశ్రయించవలయును. నేను నిన్నాశ్రయించుటకు వచ్చితిని. మొదటనే వ్యత్యాసమైనది. ఎంతకును మాచల దేవిదర్శనము నాకు కాలేదు. ఆ గన్నయ్యమంత్రి, అన్నయామాత్యుడు నాకుపయోగించలేదు. నాగిరెడ్డి నాయందు దయకలిగి కూడ నీరాజ్యమునందున్న పక్షాభిమానములచే పనిచేయలేదు. నాకు రాజదర్శనము కానందుకు దైవమును నిందింతునా ?

చక్రవర్తి :— మహాశిల్పీ ! నన్ను నిందించుము. నీకు నాదర్శనము కాకపోవుటకు నాశిరస్సునకూర్చున్న దరిద్రదేవత కారణము. ఓయీ ! మాచలయొక్క శిల్పమందిరప్రారంభోత్సమునాడు నీవును మాచలయు నొకరినొకరు చూచుకొనుచు నిలుచుండిరి. నే నప్పుడు వచ్చితిని. నేను వచ్చితినన్న విషయమే మీయిద్దరకు తెలియలేదు. మీయిద్దరు నంత తన్మయస్థితిలోనుండిరి. ఓయీ ! నాపదునాలుగురు భార్యలు తక్కిన నలుగు రుంపుడుకత్తెలు నాకంతటి ప్రియులుకారు. మాచల నాకు ప్రాణము. కాకపోయినచో నాకిన్నాళ్ళు మీయిద్దరిమీఁదగల కోపమున కామాచలను దేశమునుండి బహిష్కరించెడివాడను. నిన్ను శిరశ్ఛేదనము చేయించువాడను. మాచలయందు నాకు

గల్గినప్రేమ ఆమెనట్లు చేయించలేదు; నిన్నిట్లుచేయించలేను. చేయించ లేను గనుకనే మీరాయిద్దరు నాప్రాణమున కడ్డుకగిలినారు. ఆతురుష్క వీరుం డెత్తినకత్తి నాకంఠము నుత్తరించెడిది. మీరాయిద్ద రడ్డుపడినారు. ఇంతలో తురుష్కసేనాని సజీవముగా పట్టుకొనుమని యాజ్ఞచేసినాడు.

మాచల ప్రభువుపాదముల మీద పడెను. ఆమె కన్నీళ్ళేక ధారగా కార్చుచుండెను. రాజామెను లేవనెత్తి యిట్లనెను. — 'మాచలా! నీవి కటి ఖడ్గవిద్య యెవ్వరు నేర్పిరి!'

మాచల దుఃఖము నుపశమింపజేసికొని యిట్లనెను. మహా రాజా! ఈశిల్పాచార్యుని నేనెఱుగను. ఆనాడు చూచితిని. మరల నేను చూడలేదు. ఈయన యెవ్వరో నాకు తెలియదు. ప్రభూ! నాకు మీరు శిల్పరహస్యము లన్నియు నేర్పితిరి. నామనస్సులో నున్న శిల్ప సౌందర్యము యొక్క భావనంతయు నీయన కనిపించినంతనే యీాయ నయే నా సర్వభావము మూర్తికట్టిన ట్లగపించినాడు. నేనాయన వంక నట్లే నిలుచుండి చూచుచుంటిని కాబోలు.

జక్కన్న :— మహారాజా! నేను ఓరుగల్లు పట్టణమునకు చేరెడి వఱకు సప్తర్షి మండలములోని యరుంధతి మీాముత్తవతిల్లి యైన రుద్రమదేవి యనుకొంటిని. ఓరుగల్లు వచ్చెడివరకు నాకదియే యూహ. ఆశిల్పశాలా ప్రవేశ మహోత్సవమునాడు నేనీమెను చూచితిని. నామనస్సున కిందుకో యరుంధతి యీామె యనిపించినది. నాయూహ యంతయు తారుమారైనది. ఈమె వారాంగన యనినాకు తెలియదు. కాని యేదియో నాహృదయమున నరుంధతీ తేజస్సు జారిపోయి భ్రష్ట మైనట్లు కనిపించినది. నేను కాకతీయ సామ్రాజ్యమునకు మరల ప్రాణ ప్రతిష్ట చేయవలెనని వచ్చినవాడను. ఈమె ముఖ రేఖలలో, తనూ విన్యాసములో నేదో యపశ్రుతి కనిపించినది. దానితో నిర్విణ్ణుడనై యట్లే నిలిచియుంటిని. పైగా నొక మహారాణి యెవ్వరో తదుత్పవ

దర్శనార్థమై చనుదెంచి ననుకొంటిని. ఈమె కులముచేత వారకాంత యని మహారాజానుగ్రహపాత్రురాలని తెలిసినచో నే నట్లయ్యెడి వాడను కాను. ఈమె మహాశీలమునందు కళంకము చూచెడివాడను కాను. ఆమె కళంక మామె శీలమునందు గాక యామె జన్మ వృత్తాంతమునందలి దని తెలిసెడిది.

మహారాజు :— ఓయిశిల్పీ! శిల్పియనగా నిట్లుండునా? నాకు తెలియదయ్యా తెలియదు. నారాజ్యమున నాయంతటి పండితుడు లేడు. నాయంతటి మహావీరుడు లేడు. నాయంతటి రత్నపరీక్షకుడు లేడు. నాయంతటి శిల్ప సౌందర్య విజ్ఞాత లేడు ఇప్పుడు తెలిసినది, శిల్ప సౌందర్య విజ్ఞానము దానియంతట నది యేమియు పనిచేయదు. ఒక మహా దేవతాశక్తి ఒక యార్షమైన బుద్ధి ఒక యాంతరమైన జ్యోతి దానికి కావలయును. అట్టి పరిజ్ఞానములేని వట్టి సౌందర్యజ్ఞానము మట్టితో పూజకుండలు చేయుట వంటిది.

మాచల :— మహారాజా! తమరు నన్నవమానించిరని నాకు తెలియదు. మరేదో కారణమున తమకు నాపై కోపము వచ్చినదనుకొంటిని. నాశీలమును మీరవమానింతురనుకొనెడి శక్తి నాకుచాలలేదు.

మహారాజు :— ఓసి యరుంధతీ! అట్టియూహకూడ వచ్చుటకు వీలులేని బుద్ధియొక్క స్వచ్ఛశకలమా! నన్ను క్షమింపుము.

మాచల :— మహారాజా! యుద్ధములో నాకు గాఢమైన గాయమైనది. నాకు రక్తస్రావ మెంతయో జరిగినది. ఈమార్గము పొడుగున నే నాబాధ వెలికి తోచనీయకుండ ననుభవించుచున్నాను నామరణ మాసన్నమైనది. ప్రభు పాదములయందు మరణించుచున్నాను. నాజీవితమున కదియే పరమార్థము. నా గాయమునుండి నెత్తురు చిక్కిలిగా పోకుండ దారిపొడుగునను చేతితో పట్టుకొంటిని. ఈ ప్రసంగము మొదలు పెట్టి నప్పటినుండి చెయ్యి వదలితిని.

రాజు మిక్కిలి యాతురతతో మాచలదేవి కవచమును చేతులతో తొలగించెను. ఆమె యొడలంతయును నెత్తురు కొల్పై యున్నది. ఆమె సొమ్మసిలి పడిపోయినది. రాజు మొగమునందు తాను బంధితుండైనను అంతవరకు విషాదము కనిపించలేదు. అట్లున్న మాచలను చూచుచున్న రాజు కన్నులలో దుఃఖాదిదేవత తాండవించెను.

జక్కన్న వారి నిద్దరను చూచుచుండెను.

రాజు జక్కన్నను చూచి — 'మహాశిల్పాచార్యా! మా రాజ్యమును రక్షింపలేకపోయినచో రక్షింపలేకపోయితివి. మామాచలనైన బ్రతికించిపెట్టవయ్యా' అనెను.

జక్కన్న వికారముగా నవ్వనారంభించెను.

రా జిట్లనెను. 'ఏమి మహాశిల్పీ! నాకీవాంకాంతయందలి మక్కువను చూచియా నవ్వుచున్నావు.'

జక్కన్న :— కాదు కాదు, మహాప్రభూ! ఆతురుమ్కవీరుని కత్తి మీ మెడమీఁద పడకముందు మాయిద్దరికత్తులు వానికత్తికడ్డు పెట్టితిమి. అప్పుడే మాయిద్దరి డొక్కలలోనను రెండుకత్తులు దిగబడినవి. ప్రభువులు దానిని చూడలేదు. ఇంతలో జీవగ్రాహముగా వారిని పట్టుకొండన్న యాజ్ఞ వినిపించినది. ఇప్పుడామె యెట్టిస్థితిలో నున్నదో నేను నట్టిస్థితిలోనే యున్నాను.

అని జక్కన్న శక్తిలేని తన చేతులతో తన మైమరపు తీసి వేసెను. నేలమీఁద పడిపోయెను. మరు నిముషమున మాచలకు స్పృహలేదు. జక్కన్నకు స్పృహ లేదు.

చక్రవర్తిస్థితి యప్పుడెట్టుండెనో చక్రవర్తికే తెలియదు. ఆయన దారుభూతుడైనాడు. ఆయన శిలాభూతుడైనాడు. కాని ఆ రెండు శరీరములనుండి ప్రాణములు పోవుట చూచినాడు.

రాజున కొక్కసారి మూడు రాజ్యములు పోయినవి!

